







ఫోటోలు: గుడిపూడి విజయరావు

శ్రీశైలం ఆలయ ప్రాకార శిలలపై 14వ శతాబ్దం నాటి అద్భుత శిల్పాలు

సాహిత్య
ప్రస్థానం
సంపుటి : 11 ఫిబ్రవరి 2012 సంచిక : 73

# ఆలోచించరా?

ఔను. ఇది ఒక అభియోగంలా అనిపించినా వేసుకోక తప్పని ప్రశ్న. సాహిత్య సృజన కారులు, పాఠకులూ విమర్శకులూ ఇంతమంది వున్నా అసలు రచనా రంగం తీరు తెన్నులపై ఆలోచించేందుకు స్పందించేందుకు ఎందుకు ఆసక్తి చూపించడం లేదు? గత సంచికలో మేము పేజీ నిండా ప్రశ్నలు ఇచ్చి సూచనలు చేసి మరీ అభిప్రాయాలు ఆహ్వానించినా పంపిన వారు చాలా తక్కువ. అదే సమయంలో కవితలు కథలు వ్యాసాలు పంపిన వారు చాలా మందే వున్నారు. వాటి ప్రచురణ గురించి వాకబు చేసిన వారూ తగు మాత్రం వున్నారు. అది సంతోషమే. తమ రచనల పట్ల ఆ మాత్రం ప్రత్యేక శ్రద్ధ వుండటం న్యాయమూ అవసరమూ కూడా అనుకోవచ్చు.

కాని- విస్తృత కోణంలో సాహిత్య రంగాన్ని సందర్శించి సంస్పందించాల్సిన అవసరం లేదా?

ముఖాముఖి మాట్లాడినప్పుడు గాని లేదా ప్రస్తావనలు వచ్చినపుడు గాని ప్రస్తుత రచనలపైన లేదా చర్చల పైన వైముఖ్యం నిరుత్సాహం వ్యక్తం చేసే సాహితీ మిత్రులు దాన్ని నిర్దిష్టంగా తమ విమర్శలు లేదా సూచనలు ఎందుకు రూపొందించడం లేదు? పత్రికలకు పంపించడం లేదు? మేము అడిగినా ఆ కదలిక ఎందుకు కొరవడుతున్నట్టు?

సాహిత్య చర్చ లేకుండా నాణ్యత పెరగదు.మంచి చెడ్డలు తేలవు. అవసరమైన వాటికి ప్రోత్సాహం గాని అవాంఛనీయమైన వాటికి అభిశంసన గాని లేకపోతే ఎలా? ఎప్పుడూ మన రచనల ముద్రణ అభినందనలకే పరిమితమై పోతే మన కలాలు పదునెక్కడం కూడా జరగదు. సమాజంలో మిగిలిన రంగాల్లో చూస్తున్న స్వార్థ పూరిత ధోరణుల ప్రభావానికి సాహిత్యం కూడా మినహాయింపు కాజాలదు. వ్యక్తిగత ప్రయోజనానికో తక్షణ లబ్ధికోసమో పొరబాటు ధోరణులకు ప్రోద్బలమిచ్చేవారి పట్ల అప్రమత్తంగా వుండకపోతే కొంత కాలం తర్వాత అవే తిష్ట వేస్తాయి.ఆలోచనా రహితంగానో అనివార్యంగానో అసహాయంగానో ఇతరులూ అనుసరించడం మొదలెడతారు.

ఒక ఏడాదిలో వివిధ రూపాల్లో వివిధ పత్రికల్లో వేదికల్లో వెలువడిన సాహిత్యాన్ని ముందుకొచ్చిన వివిధాంశాలను సింహావలోకనం చేసి గుణ దోష విచారణ జరపకపోతే సృజన శీలతకు అత్యవసరమైన యోచన,యోజన దెబ్బతింటాయి. ఇప్పుడు రచనా పరంగా కృషి చేస్తున్నవారు చాలా మంది వున్నా రచనలు అందుకునే వారు ఆస్వాదించేవారు ఆ స్థాయిలో పెరగడం లేదన్నది నిజం.రచయితలైన వారే పాఠకులుగా స్పందించక పోతే వారి రచనలకూ అదే స్థితి ఎదురవుతుంది.కనక సాహిత్య రంగంతో సంబంధం వున్నవారు ఆ ఆసక్తిని అభిరుచిని పెంచడం, నిశిత దృష్టిని పెంపొందించడం బాధ్యతగా భావించాలి.

చివరి సంగతి- సాహితీ స్రవంతి మొదటి నుంచి కొత్త గొంతులను ప్రోత్సహిస్తోంది. వక్తలుగా కవులుగా రచయితలుగా ముందుకు నడవడానికి వూతమిస్తోంది. గత పదేళ్ల కిందటి జన కవనం నుంచి తాజా జన కవనం మధ్యలో ఆ విధంగానే ఎంతో మంది ఆత్మ విశ్వాసంతో ఆశయ బలంతో ముందుకు రాగలిగారు. రచనలను పెంచడంతో పాటు వాటిని చదవడం, విమర్శనాత్మకంగా చూడటం కూడా పెరిగితే తప్ప ఈ పని పూర్తి కాదు. ముందు రచయితలతోనే ఆ పని మొదలవాలి. రచయితలే విమర్శకులా అనే ప్రశ్న ఒకటైతే పాఠకులుగా రచయితల పాత్రను ఎవరూ కాదనలేరు.

అందుకే మేము ప్రచురించిన ప్రశ్నావళిపై స్పందనలను ఈ నెల కూడా ఆహ్వానిస్తున్నాం. దానిపై సమీక్ష ముగింపు మార్చి సంచికలో. ఎవరి అభిప్రాయాలు ఏమైనా నిస్సంకోచంగా నిరభ్యంతరంగా పంపించవచ్చు. జన కవనం లాగే జన విమర్శనం కూడా కావాలి.రావాలి.

బొమ్మలు : చంద్ర, శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొరప్రసాద్
వల్లభాపురం జనార్దన

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టిసి
కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# భూమి - నేల



- ఎన్.ఎ. సూర్యజ్యోతి

**పట్నంకి పదహారు కిలోమీటర్ల అగ్రహారం, నగరం వెళదామని పట్నానికి బయలుదేరాడు పారయ్య, రోడ్డు మీదకొచ్చి అలవాటుగా టీ పాకకేసి చూశాడు. అలవాటే మిగిలింది గానీ టీ పాకలేదని పారయ్య గుర్తించాడు.**

పారయ్యకి ఎనభై ఏళ్ళు దాటే ఉంటాయి. మోకాళ్ళ దిగువకు పంచె కట్టాడు. కొత్త కమీజు తొడిగాడు. శరీరం కఱ్ఱ కట్టేసి, ఈ మనిషికి ఏనాడైనా మాంసం చితుకుందా? అన్నంత కఱ్రలా ఉంటాడు. బస్సు కోసం ఎదురు చూస్తున్న పారయ్య ఆర్టీసి బస్సు వచ్చి, చెట్టు దగ్గర ఆగడాన్ని చూశాడు. బస్సు ఎక్కేడు. పట్నంకి ఒక టికెట్టిమ్మని అడిగేడు. పారయ్య తెలిసిన కండక్టరు, "విశాఖపట్నం వెళ్ళదోయి" అని పరాచకం ఆడేడు. "నీ ఆసికాలు కేటిగానీ, పట్నానికి టికెట్టియ్యవోయ్" అన్నాడు. టికెట్ తీసుకొని సీట్లో కూర్చున్నాడు.

పట్నం మొదలుకి వచ్చేసరికి రైల్వే గేట్ పడిపోయింది. పారయ్య ఆందోళనగా బస్సుదిగి "బండి తప్పొద్ది గావాల" అనుకొని రైలు కట్టకి అడ్డంబడి ప్లాట్‌ఫారంకి చేరేడు.

ప్లాట్‌ఫారం నిండా జనమే జనం. ఇసకేస్తే రాలదు. "సంబర పండక్కైనా ఇంత జనముంటారో ఉండరో" అని మనసులో అనుకొని, "బాబు ఇది డి. ఎమ్మోనా?" అని ఒక ప్రయాణికుడిని అడిగాడు. "ఆ" డి.ఎం.యు.ఏ. విశాఖ వెళ్ళే డి.ఎం.యు" అని సమాధానమిచ్చాడు. పారయ్య పరుగులాంటి నడకతో కౌంటర్ వద్దకు వెళ్ళాడు.

"బాబు ఇశాపట్నంకి ఓ టికెట్టిమ్మి" అని యాభై రూపాయల నోటిచ్చాడు. కౌంటర్లో క్లర్కు టికెట్టు, చిల్లరా తిరిగిచ్చాడు. బండి ప్లాట్‌ఫారం మీదకొచ్చేసరికి, బెల్లం చుట్టూ ఈగల్లాగ జనం బండి మీద కెగబడ్డారు. పారయ్య తన ప్రమేయం లేకుండానే రైలు కంపార్ట్‌మెంట్లో పడ్డాడు.

మూడు, మూడున్నర గంటలు పారయ్య కుస్తీ పడి, విశాఖపట్నం చేరేడు. రైలు దిగి పారయ్య మనవడి కోసం ఎదురుచూస్తున్నాడు. కొంతసేపటికి మనవడు భాస్కరరావు పారయ్య దగ్గరికి వచ్చి "ఆలస్యం అయిపోయింది, గాబరా పడ్డావేటి?" అన్నాడు. గాబరేఁలా? నువ్వు రాకపోతే మళ్ళీ బండుంది గాదేటి?" అన్నాడు.

"నీకెటకారం పోలేదు" అన్నాడు మనవడు నవ్వుకుంటూ.

"నాతోటి పోద్దిరా" అన్నాడు తాత.

వాల్తేరు మెయిన్ గేట్లొంచి తాతని తీసుకుపోయి తన ఆటోలో కూలేశాడు.

ఆటో తిన్నగా రైలు పట్టాలు దాటి, మురికివాడలో మొదటి ఇంటి దగ్గరాగింది.

"దిగు, దిగు మనిల్లొచ్చేసింది" అన్నాడు తాతతో. తాత ఆటో దిగేడు. మనవడు ఇంట్లోకి దారిచూపేడు.

ఇంట్లోకి కేకేసి గుమ్మం దగ్గరే నిలబడ్డ భాస్కర్, "రమా, తాతొచ్చేడు, స్కూలు టైమైపోతోంది, పిల్లల్ని తీసుకురావాలి, ముసిలోడు ఉదయం ఎప్పుడో బయలుదేరాడు. ఆడికి కాస్త అన్నం పెట్టేస్తే తినేసి పడుకుంటాడు" అన్నాడు.

"ఏట్రా ఈదిలోంచి ఎల్లిపోతావేటి? ఇంట్లోకైనా రావా? అన్నాడు తాత. "లేదు, టైమ్ అయిపోతుంది" అని కంగారుగా వెళ్ళిపోయాడు.

రమ పెట్టిన అన్నం తిని, బయటున్న కుర్చీమీద కూర్చున్నాడు పారయ్య.

పారయ్య ఇంటినీ, చుట్టువక్కలనీ సాలోచనగా పరిశీలిస్తున్నాడు. కొత్త అతిథికి ఘనస్వాగతం పలుకుతూ దోమలు. దోమల్నుంచి రక్షించుకోవడానికి పారయ్యకు రెండు చేతులూ చాలట్లేదు. తను కూర్చున్న చోటుకి ఒక రెండడుగుల దూరంలో పారుతున్న మురికి కాలువ. ఆ కాలువ నుంచి వచ్చే దుర్గంధం. ఇంక ఇంటిని పరిశీలిస్తే, ఒక ఎనిమిది అడుగుల చదరంలో రెండు గదుల ఇల్లు. అందులో ఒక గది మంచంతో నిండిపోయింది. రెండో గదిలో సగాన్ని పొయ్యి, వంట సామాను ఆక్రమించాయి. మిగిలిన చోటులో ఇద్దరు అతి కష్టం మీద కూర్చోవచ్చు. పైగా ఆ ఇంటి పై కప్పు రేకులతో చేయడం వలన సూర్యుడు తన ప్రతాపాన్ని ఆ ఇంటి మీదే చూపిస్తున్నట్లుంది. చివరిగా పారయ్య, ఆ మొత్తం కాలనీని రెండుగా చీల్చేస్తున్నట్లుగా రైలు పట్టాలలాగే ఉన్న ఒక పెద్ద గోడ ఆ ఇంటి ప్రక్కనుంచే మొదలవడాన్ని గమనించాడు. "ఇంత పొడుగు గోడ పక్కనేటుందో?" అని ఆలోచనలో పడ్డాడు.



పారయ్య ఆలోచనలో ఉండగానే ఇద్దరు పిల్లలు బిలబిలమని ఇంట్లోకి చొరబడ్డారు. ఇంటి బయట వున్న తాతను చూసి, "హాయ్! తాత, ఎప్పుడొచ్చేరు? బాగున్నారా? అని కోరస్ పాడారు. ముని మనవళ్ళని, వాళ్ళు వేసుకున్న యూనిఫారం, మెడలో వేలాడే టై, నడుం చుట్టూ బెల్టు, కాలికి బూట్లు, మేజోళ్లు, భుజాన పుస్తకాల సంచి చూసి, చదువుల సరస్వతులని పొంగిపోయేడు తాత.

రాత్రి పదైంది. మనవడి కోసం ఎదురు చూసీ, చూసీ కునికిపాట్లు పడ్డాడు. మూడు రోజులు ఇలాగే గడిచిపోయాయి. విశ్రాంతి లేకుండా మనవరాలు బట్టల కొట్లో పనికీ, మనవడు ఆటోకీ, పిల్లలు స్కూలుకీ పోవడాన్ని గమనిస్తూనే ఉన్నాడు.

ఒకరోజు రాత్రి మనవడు, తాతని చూసి తాతా "నీకు బోరు కొట్టేస్తుందా. ఇక్కడ ఇంతే. ఉరుకులు పరుగులు. మాలో మేం కలుసుకోవడమే కష్టం. విసుగు విరామం లేకుండా పని చేస్తూనే ఉండాల" అన్నాడు.

''ఓరయ్యా! ఈమాత్రం దానికి, ఈ నగరవేల పారొచ్చేసినావురా? మనిషికి కాసింత ఇశ్రామముండొద్దా? ఇశ్రామం, ఇరామం నేకపోతే పోయింది, నిద్రైనా సరిగ్గుండొద్దా? ఈ మురిక్కాలువ, ఈ దోమలు, నీళ్ళ కోసం దేవులాట, "పాల కోసం రాళ్ళ మోత" ఇన్నాం గానీ, నీళ్ళ కోసం రత్తాలన్నమాట ఇన్లేదురా?"

మనవడు శ్రద్ధగా వింటున్నాడు. విని, నీ జీవితం ఏమైనా గొప్పగా గడిసిందేట్రా తాత" అన్నాడు.

"అలగంతావా? మావూర్లో బుగతలున్నప్పుడు మాగనంగ వుండీదిరా మావూరు. ఆ బుగతలు మనం లేకపోతే పెళ్ళే చేసుకోమన్నార్రా."

భాస్కర్రావు నమ్మలేనట్లు తాత మొహంకేసి చూశాడు. పారయ్య కథ చెప్పడం ప్రారంభించాడు.

డెబ్బై ఏళ్ళ క్రితం సంగతి రా ఇది. "వూరి సిన్న బుగతకి శుంకి బుగతమ్మతో పెళ్ళిరా. ఈలు మూడూళ్ళకి బుగతలైతే ఆ బుగతమ్మాల నాన్నకి ఆ వూర్లోనే కొంత భూముంది. మా బుగతలకి మాదిగ డప్పు పడందే పెళ్ళి నడదు. ఆ వూరికి, మా వూరికి మజ్జలోని నాగావలమ్మ. నది ఒడ్డుకి ఆ వూరికి రెండు కోసుల తోవ. నది ఒడ్డు నుంచి వూరు మొగకి బళ్ళు మొగిసిపోనాయి. మొదటి బండ్ల మా నడిపి బుగతుంతే, సివార బళ్ళలో సిలకట్టు నాయుడ్లున్నారు. నడిపి బుగత బండి ముందు మన ఈది, ఈదంతా డప్పులతో నడత్తన్నాం. "తాత కథ చెప్పడం చూసి మనవళ్ళిద్దరూ చేరిపోయారు. "స్టోరీ ఈజ్ ఇంట్రెస్టింగ్" అంది అక్క హేమలత. తెలిసి తెలియకుండా తలాడించాడు అవినాష్. తాత మనవళ్ళ వంక చూసి మళ్ళీ ప్రారంభించాడు.

"రెండో బండ్లోంచి వొట్టి గడ్డి దింపి మంటెట్టాం. నేను (ఈ హేమకన్నా నాలుగేళ్ళు పెద్దుంతాను). మా అయ్య, లచ్చుం మావ, అసిరి తాత, ఈరయ్య, ఇలా మొత్తం పధ్నాలుగు మందిమి డప్పు కాపడం ప్రారంభించాం. ఈ పెళ్ళికనే కొత్త డప్పులు కట్టించాడు బుగత. డప్పు సెబ్దం ఇంటే సాలు బుగతకి పూనకవొచ్చేది. "పూనకం అంటే ఏంటి తాత" అని అడిగేడు అవినాష్. "మొన్న టి.వి.లో "అమ్మోరు సినిమా చూడలేదా?'' అంది హేమ. ''పూనకం'' అంటే వివరించబోయిన తాతకు నిరాశ ఎదురైంది. "అంతా టీవీలే సెప్పేత్తన్నాయి" అనుకున్నాడు.

"డప్పు మీద దరువెయ్యడం మొదలెట్టాం. దరువు, వరస సాగుతున్నాయి. బుగతకి పూనకం మొదలైంది. సరిగ్గా ఆ సమయంలో

వొదువు గోరి నాన్న పరుగెత్తుకొచ్చి, పూనకంలో నున్న నడిపి బుగతని పక్కకి తీసికెళ్ళి ఏటేటో గుసగుసలాడాడు. గుసగుసల మజ్జలోంచి నడపి బుగత "అయితే ఈ పెళ్ళి జరగదు" అని గట్టిగా కేకేశాడు. నడిపి బుగత లాంటి మనిషిని మరి సూడబోం. ఆరడుగుల మనిషి, ఆజానుబావు. రెండెడ్ల బళ్ళు మోసే బరువుని మోసీగల్డు. ఆ బుగతకి కోపం రావడం మేం సూన్నేదు. అసలే పెద్ద గుడ్లని ఉరిమి, మరింత స్పష్టంగా, "అయితే మరి ఈ పెళ్ళి జరగదు" అన్నాడు. మాకిసయం అర్ధమవ్వలేదు. మెల్లిమెల్లిగా ఏటైంది బాపూ అనడిగాం. "ఒరేయ్, వీళ్ళు బ్రాహ్మణులట! బ్రాహ్మణ వీధిలోకి మాదిగలు రాకూడదట, డప్పు కొట్టకూడదట" అని వొదువు తండ్రి నర్సింగ బుగత వేపు తిరిగి సూసి, "మీ అమ్మాయిని, మాదిగ డప్పులు కొట్టించని బ్రాహ్మణుడికిచ్చి పెళ్ళి చేసుకోండి" అన్నాడు. నర్సింబుగత, నడిపి బుగత సేతులొట్టుకొని, "బాబూ ఇవి చేతులు కావు, కాళ్ళు. ఆడపిల్ల బ్రతుకు నాశనమవుతుంది. ఊరన్నాక ఆచారముంటుంది. "ఊరంతా ఒక దారైతే, ఉలిపి కట్టిదొక దారన్నట్టు" ఉండలేం కదా? దయించి, మీ పంతాలకు పిల్లల భవిష్యత్తు పాడు చెయ్యొద్దు'' అన్నారు. ''బతిమాలవలసింది నన్ను కాదు. మాదిగ డప్పు లేకుండా, "చాకలి" దివిటీ లేకుండా, "మంగలి" చామరం లేకుండా పెళ్ళి జరగదు. మీకు చేతకాకపోతే పెళ్ళికూతుర్ని పట్నం తీసుకురా, అక్కడ చేద్దాం పెళ్ళి."



"ఎంత మాట, ఎంత మాట ఆడపిల్లని ఊరు దాటించి పెళ్ళి చేస్తామా? మీకు తెలియని ధర్మమా? ఆడపిల్లను గడప దాటించి పెళ్ళి చేస్తానా? పెళ్ళి చేసి గడప దాటిస్తాను గానీ? మా ఊరి వాళ్ళ కాళ్ళా వేళ్ళా పడి మళ్ళీ వస్తానని ఊర్లోకెళ్ళాడు.

అలాగెల్లిన నర్సింబుగత ఓ రెండు గంటల తరువాత తిరిగొచ్చి, "అచ్యుతరాం బాబూ, మావాళ్ళు ఒప్పుకున్నారు. అయితే ఒక షరతు. మా వాళ్ళందరూ తలుపులేసుకొని ఉంటారు. ఇది అవమానమేనని నాకు తెలుసు. కానీ మీరు దాన్ని అవమానంగా భావించకుండా విడిదింటికి రండి."

నడిపి బుగత పెశాంతంగా చూస్తూ "ఇంతకీ మీ బ్రాహ్మణ నాయకుడెవరోయ్? అని అడిగాడు. "అప్పన్న శాస్త్రులండి" "అతగాడిల్లు వచ్చినప్పుడు చూపించు", "అలాగే" "మోగించండ్రా డప్పులు" అని కేకేశాడు. "డప్పుల మోత మొదలైంది. బళ్ళు సాగడం మొదలైంది. అప్పన్న శాస్త్రులు ఇల్లొచ్చింది. "జనమంతా రండ్రా" అని హుకుం జారీ చేశాడు బుగత. "అప్పన్న శాస్త్రులు ఇంటి ముందు గరిడీ కట్టండ్రా" అన్నాడు బుగత. మొత్తం 14 మంది డప్పులోల్లం నేను అందరికన్నా పిక్కిరోన్ని. ఈ బుగత ఇంటిముందు గరిడీ కట్టేసినం. ఏటౌతుంది సెప్మా నాకర్దం కాలేదు. మా అయ్య మాంచి ఊపుమీదున్నాడు. నడిపి బుగతేటి సెప్తాడా అని సూత్తన్నాం.

"వాయించండ్రా డప్పులు"

"ప్రారంభమయింది. సెప్తె అబద్ధం. సూత్తే నిజం. గంటైంది. డప్పు నృత్యం. మరో గంట పులి డాన్సు. ఇలాగ డప్పు నడుస్తనే ఉంది. బుగత సివమెత్తినట్లు సూస్తనే ఉన్నాడు. కొట్టి కొట్టి మా సేతులు పడిపోయినా బుగత ఆపమనడు.

ఇంతలో ఆ ఇంటి తలుపులు తెరుసుకున్నాయి. బిల బిలమని ముప్పై నలభై మంది బ్రాహ్మలు బయటకొచ్చారు. "శర్మగారూ, తప్పయిపోయింది, క్షమించండి. అన్ని ఇళ్ళ తలుపులూ తెరిచే ఉంచుతాం. మీ డప్పు నృత్యాలు, మీ దివిటీల వెలుగులు, అందరం చూస్తాం" అన్నాడు.

బుగత మా అయ్య కేసి, మా అయ్య బుగత కేసి సూసి సిరునవ్వులు సిందించారు. అది, అలా జరిగింది. పెళ్ళి, మాదిగోడు లేకుండా, మాదిగ డప్పు లేకుండా పెళ్ళి జరగదన్నాడు మా బుగత.

"తాతా ఇప్పుడికీ అర్ధమవ్వలేదా? ఆ వూరు బ్రాహ్మణులకి మాదిగోన్ని వీధిలోకి రానివ్వకపోవడమే అహంకారానికి గుర్తయితే, మాదిగోళ్ళ చేత రెండు గంటల పాటు, చేతులు రక్తం కారేట్టు డప్పులు కొట్టించడం మీ బుగతల అహంకారం" అన్నాడు భాస్కరం.

"మాదిగంటే ఏంది తాతయ్య" అని హేమలత ప్రశ్నించింది.

మళ్ళీ భాస్కరం, ''బుగతలేమయ్యారు? వాళ్ళ భూములేమయ్యాయి?" అని అడిగాడు.

"సొతంత్రం వొచ్చింది. దున్నేవాడికి భూమి అని చట్టం వొచ్చిందట. దాంతో బుగతల బూములు పోయాయి. బుగతలూ పోయారు."

"మరి మనకేం భూమి రాలేదు? మీరే కదా భూమి దున్నేరు."

"దున్నింది మేమైనా, దున్నినట్టు రైతుల పేర్లే ఉన్నాయట. మాదిగలవి లేవట."

"మరి మనవేటయ్యాం."

"అంతకు ముందు బుగతల సేరీల్లోనూ, రైతుల కౌలు భూముల్లోనూ పాలేర్లుగా వుండేవోలం. ఇప్పుడు అచ్చంగా రైతుల దగ్గర పాలేర్లయ్యాం."

"మరి పట్నం వచ్చి నేనేం బాగున్నానని అడుగుతావేం తాత. మీరు మాత్రమేం బాగున్నారని? అక్కడ బాగులేకే కదా నేను పారొచ్చింది. నువ్వు డప్పు కొట్టిన వయసులోనే గదా. నేనా రైతుల గొడ్లిప్పింది. వాళ్ళ పిల్లలు చదువుకుంటున్నప్పుడు, నేను గొడ్లు కాయడానికి మెరకలకి పోయాను కదా? మెరకలో ఉన్న దొంగ గొడ్డు పంట పొలంలో పడి మేస్తే, రైతు కొట్టిన చింతబరిక దెబ్బలకే కదా నేను ఇక్కడకొచ్చి పడింది."

# జనవరి నెల పురస్కారాలు





| ఓ బాడుగెద్దు ఆత్మకథ | శ్వాసించే విగ్రహం |
|---|---|
| కథకు........రూ.700/- | కవితకు.......రూ.500/- |
| రచయిత : తియ్యగూర సీతారామిరెడ్డి | రచయిత : సంగెవేని రవీంద్ర |

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

"అవును నిజమే. అలా పారిపోయిన నువ్వు పదేనేల్లు మాకు కనబడకపోతే, నీమీద బెంగెట్టుకొని నా కొడుకు సచ్చిపొండు."

"పట్నమొచ్చి పడిన నేను మెకానిక్ షెడ్లో పని నేర్చుకొని ఆటో డ్రైవర్నయ్యాను."

"ఏట్రా నేను, మీ అయ్య పాలేర్లుగా ఉండి రోజంతా ఇశ్రామం లేకుండా ఉండోలిమి. నీ బతుక్కి మాత్రం ఇశ్రామమేముందిరా?"

"పోని మనూర్లుంతే ఓ సల్లని గాలీ, మంచినీళ్ళైనా ఉండును కదరా. ఈ మురికిలో ఇంతమంది, ఈ దోమల్తో దోమలాగ ఈ బతుకూ, ఒక బతుకురా? ఈ గోడెవడు కట్టేడో? ఆ గోడవతలేటుందో? ఈ గోడ కసింత అటు జరిపితే, కాలవ అటు పారిస్తే, అదైనా కసింత బాగున్ను కదరా?" మాటల్లో పొరుగింటి వ్యక్తి వచ్చి కూర్చున్నాడు.

"నాయుడంకుల్ బాగున్నారా?" అని హేమ, అవినాష్ అతని మీద పడ్డారు.

"బాగానే ఉన్నానర్రా, ఇదిగోండి మీ లంచం" అని చెరో చాక్లెట్ చేతిలో పెట్టాడు.

"మీరేదో మాట్లాడుతున్నట్లున్నారు. మాట్లాడుకోండి" అని వెళ్ళిపోయాడు.

"నాయుడంటన్నావెవర్రా? ఆళ్ళ వర్ణమేటి?"

"చీపురుపల్లి దగ్గరొక ఊరు వాళ్ళది. కాపోళ్ళులే. పంటల పండక ఊరు వల్లకాడైపోతే కట్టుపని కూలీగా ఇక్కడ పని చేస్తున్నాడు."

"అయితేట్రా, ఆళ్ళూ మనింటి పక్కనే ఉంతన్నార్రా?"

"మనసులో ఏముంటుందో ఏమో గాని అన్ని కులాల వాళ్ళం కలిసే ఉంటామిక్కడ."

తలపంకించాడు పొరయ్య.

"వీధిలోంచి, వీలుకాని పరిస్థితుల్లో ముసల్దాని శవం తీసుకెళ్ళినందుకు, తమ బుర్రలపై నాట్యమాడిన మునకాల కర్రలు గుర్తొచ్చాయి."

"ఇంతకీ ఇంత పొడూగ్గా ఈ గోడేట్రా?"

"అదో పెద్ద కథ. నువ్వు కూసున్న మరక ఖరీదు పదిహేను వేలు. ఈ కాలనీ మొత్తంలో ఎప్పుడో మాలాటోలందరం గుడిసెలేసాం. గుడిసెలేసినప్పుడు దీనికంత ఖరీదు లేదు. దీని ఖరీదొక్కసారి పెరిగిపోయేసరికి, నగరంలో రైల్వే కాంట్రాక్టరు స్థలమాక్రమించి, రాత్రికి రాత్రి బుల్డోజర్లు తెచ్చి మా గుడిసెల్ని కూలేసి, ఈ గోడ లేపేసేరు."

"అదేట్రా, అన్నాయము, పేదోళ్ళ గుడిసెలు కూల్చేత్తారా? మీరేటి సేసేర్రా? మరీ గవరమెంటు మీకు సాయం రానేదా?"

"గవరమెంట్రాలేదు గానీ, మీ మనవరాల్తో పనిచేస్తున్న బట్టల షాపుల పనోళ్ళు, మా ఆటోవోళ్ళు, కట్టుపనోళ్ళు, అందరం ఏకమై, మళ్ళీ గుడిసెలేసేనం."

"మరాడేటి సేసినాడు?"

"ఆడేటంటాడంటే, గోడవతల స్థలమాడు తీసుకుని, గోడివతల మాకు ఒకల మీదొకలకి, ఒకల మీదొకలకి అగ్గిపెట్టెల్లాంటి ఇల్లు కట్టేస్తానంటండు."

"మరి మీరేటంట్రన్న? పోనీ అలా రాజీ పడిపోవచ్చు కదా?"

"మేం ఒకళ్ళ మీద ఒకళ్ళం ఉండటానికి ఇష్టపడం. ప్రక్కప్రక్కనే ఉండటానికే ఇష్టపడతాం" తేల్చి చెప్పాడు భాస్కరరావు.

పిల్లలిద్దరూ రైమ్ అందుకున్నారు.

The More we get together
Together, Together,
The more we get Together
The Happier will be
because your friend is my friend
and my friend is your friend
The more we get Together
The Happier will be

## నిరీక్షణే ఒక గాయం

**- ఎన్. అరుణ**

కాలం కూడా ఒక గాయమే
కనులకు కనిపించదు
మంట వల్ల తెలుస్తుంది
మనసులో మంటలు రేపుతుంది

మాటలన్నప్పుడు ఆ బాధ తెలియలేదు
ఇప్పుడు బయటపడింది
పాట తప్పుతూనే వుంది
ఊట మిగిలింది

వెళ్ళినవాడు తథాగతుడే
వచ్చినవాడూ అతడే
తాకిన గాయం మాత్రం
వేకువగా ఉదయించింది

దూరాల కోసం అన్వేషణ
సమీపానికి రావాలని నిరీక్షణ



అడుగడుగునా
అసంతృప్తే ఒక మహాగాయం
ఇంతేనా జీవితం అనిపిస్తుంది
అంతులేని ఆరాటం
అంతా సారాంశంగా మిగిలిపోతుంది
నిజానికి నిరీక్షణే ఒక గాయం

అన్నట్టు
నాకైతే విశ్వాంతరాళంలో
భూగోళమే
ఒక కదిలే గాయంలా కనిపిస్తుంది

---

## డెత్ మార్ట్

**- కెంగార మోహన్**
**సెల్ : 9493375447**

ఆఖరి కోరిక తీర్చాల్సిన
అవసరం లేదు

ప్రాణాలు రిటైల్‌గా
ఎఫ్‌డిఐలో లెక్కలేయబడుతున్నాయి

అమ్మకం మార్టులిక
డెత్‌మార్టులే

కొనాలంటే అన్నీ దొరుకుతాయి
టమోటాలు, ఉల్లి, ఎల్లిపాయలు
నువాక్రాన్, ఉరితాళ్ళతో సహా

వ్యాపార విప్లవం కాదు
అక్షరాల శవాల కార్ఖానా

ఉత్పత్తి అపరిమితం
పోర్టోరికో, బ్రెజిల్, కోస్టారికా
ఎల్‌సాల్వేడార్, గ్వాటిలామా లే కాదు




ఇండో, చైనా, థాయ్
అర్జెంటీనా, సింగపూర్, చిలీ
ఇప్పుడిక మౌనం

ఇక్కడ హోల్‌సేల్స్, రిటైల్స్
డిస్ట్రిబ్యూటర్స్ ఏది ఉండదు
వస్తువులన్నీ ఆల్‌సేల్స్

ఇక చిన్నా చితకా
చిల్లర, బడా వర్తకులంతా
ఊపిరి ఆపాల్సిందే

---

## దగ్ధ దృశ్యం

**- సలీం**

అగ్నికీలల్లా వేయి నాల్కలతో వ్యాపిస్తూ
అల్లుకుంటున్న దట్టమైన ఒంటరితనం
నేనిపుడో దగ్ధ దృశ్యాన్ని...
గడ్డకట్టించే చలిలా
హృదయాన్ని కొరికేస్తూ నైరాశ్యం
నేనిపుడు ఘనీభవించిన దుఃఖాన్ని...
నేను లేను..
నా ఆశ సుడిగాలిలా తిరుగుతూ
మనోనేత్రం తెర్చుకుని
మూసుకుపోయిన తలుపు వైపు
మౌన వేదనతో వేచి చూస్తోంది
తలుపు తెరుచుకుని
చిరు దరహాసమేదో
మలయమారుతంలా పల్కరిస్తుందని
ఆత్మీయ తరంగమేదో
గుండెలోని అగ్నిగుండాల మీద
తన శీతల స్నేహ హస్తం చాపుతుందని
గదినిండా మనుషులు
ఊపిరాడనంతగా క్రిక్కిరిసి
స్వార్థపు చెమట వాసన



గొడవ గొడవగా పోట్లాడుకుంటూ
ఎవరి గొడవ వాడిదే
శరీరం మీద పాకుతూ బుసకొట్టే పాములు
పాలను తాగి విషం కక్కే నాగులు
కొండచిలువలా నన్ను చుట్టేస్తూ ఒంటరితనం
తలుపు మీద చిరు మువ్వల సవ్వడిలా
ప్రేమహస్తంతో ఎవరైనా తట్టే క్షణం కోసం
యుగాల నుండీ నిరీక్షణ

వెచ్చటి దుప్పటిలా నన్ను చుట్టుకుని
గడ్డకట్టిన మనసు పొరల్లోకి
జీవజలధారలై ప్రవహిస్తారని
ఎదురుచూపు
తలుపుని ఇనుప సంకెళ్ళతో బిగించారెవరో
ఉక్కపోతలా ఒంటరితనం
ఉక్కు పిడికిట్లో అల్లాడుతూ
ఆశల రెక్కలు తగిలించుకుని
తలుపు వైపు అంతిమ శ్వాసతో చూస్తూ
తలుపు తట్టే శబ్దం కోసం
వళ్ళంతా మొలిచిన చెవులు
ఎక్కడి నుంచో దిగంతాల ఆవలి నుంచి
అదుగో.. తలుపు తడ్తున్నారెవరో
నా ఒంటరితనానికి
పాడుతున్న చరమగీతంలా
మృదు మధుర హృదయ నాదం
తలుపు కవతల ఎవరో
తడి తడి కళ్ళతో
తడిసి ముద్దయిపోయిన గుండెతో
నన్ను ఆత్మీయంగా హత్తుకోడానికి...



# గాథా సప్తశతి - సౌందర్య దర్శనం

- జయంతి పాపారావు

**సంస్కృతం కూడా ప్రాకృత భాష మరో రూపమే, మరో భేదమే. ప్రాకృత భాషల్లో, జన సామాన్యంలో, ఎక్కువ వాడుకలోనున్న పదాలను సేకరించి, సంస్కరించి, 'సంస్కృతం' అన్న పేరున సంస్కృత భాషను రూపొందించారు. ఆ తరువాత 'సంస్కృతం' పెద్ద ఎత్తున అభివృద్ధి, వ్యాప్తి చెందింది. ఆ తరువాత, సంస్కృతం కోకొల్లలుగా ప్రాకృత శబ్దరూపాలను తనలో చేర్చుకుని, పద జాలాన్ని విస్తరించుకుంది.**

గాథాసప్తశతి - ఏడువందల గాథల సంకలనం. 'గాథ' అనగా పద్యమే. ఏడు వందల గాథలు అంటే - ఏడువందల పద్యాలు. 'గాథ' అనగా గానము చేయదగినదని అర్థం. ఆ కాలంలో ఈ పద్యాలను పాటలుగా పాడుకునే వారని తెలుస్తుంది. పద్యాన్నే కాదు, దాన్ని రాగయుక్తంగా, లయబద్ధంగా పాడినా, దాన్ని 'పాట' గానే పరిగణించే సంప్రదాయం జనసామాన్యంలో ఇప్పుడు కూడా వుంది. కూని రాగం తీసినా 'పాటే' అంటారు.

శార్ఙ్గదేవుని 'సంగీత రత్నాకరము'లో 'రాగ వివేకా అధ్యాయము'లో షడ్జ కైశిక రాగానికి ఉదాహరణగా ఇందులోని ఒక గాథను సస్వరంగా చెప్పబడిందని పరిశోధకులు గుర్తించారు. 'పురాతన ప్రబంధ సంగ్రహం' అను జైన గ్రంథంలో ఆ గాథను శాతవాహనుని ఆస్థానకవి అయిన పాద విప్తాచార్యుడిచే సిద్ధ నాగార్జునికి ఉపదేశింపబడినట్లు కూడా, పరిశోధకులు గుర్తించారు. దీన్ని బట్టి, ఇందులోని పద్యాలను పాటలుగా పాడుకునేవారని తెలుస్తుంది. ఈ గ్రంథంలో మూడో పద్యంలో ఒక విషయం చెప్పబడింది. (హాలుడు 1-3) లోకంలో ఒక కోటి గాథలున్నాయి. అందులోంచి, ఏడువందల అందమైన వానిని కూర్చడమైనది అని చెప్పబడింది. దీన్నిబట్టి ప్రజల్లో ఆనాటికి వాగ్రూపంలో గాథలు చాలా పెద్ద సంఖ్యలో ఉండేవని తెలుస్తుంది. వాటిల్లోంచి ఏడు వందల గాథలు ఎంపిక చేయబడి, లిఖిత రూపంలో కూర్చబడ్డాయని తెలుస్తుంది.

గాథా సప్తశతి - ప్రాకృత భాషలో కూర్చబడింది. ప్రాకృత భాషలు ప్రాచీన కాలంలో జన సామాన్యంలో వాడుక భాషలుగా ఉండేవి. అవి వందల వేలమైళ్ళ ప్రాచీనత, వ్యాప్తి కలిగి ఉన్నాయి. మనదేశంలోని వివిధ ప్రాంతాల్లోని వాడుక, వ్యాప్తి ఆధారంగా వాటిని విభజించారు. మహారాష్ట్రి - శౌరసేని గౌడి - లాటి - మాగధి - పైశాచి - ఆవంతి - అర్ధమాగధి - ప్రాచ్య - బాహ్లీక - దాక్షిణాత్య - మొదలగు గుర్తింపు పేరులతో విభజన జరిగింది. అదే విధంగా, జాతి ఆధారంగా, అభీరి - శకారి - చాండాలి - శాబరి మొదలగు పేరులతో కూడ విభజన జరిగింది. వీటినన్నింటినీ 'ప్రాకృతములు'గానే పిలుస్తారు.

సంస్కృతం కూడా ప్రాకృత భాష మరో రూపమే, మరో భేదమే. ప్రాకృత భాషల్లో, జన సామాన్యంలో, ఎక్కువ వాడుకలోనున్న పదాలను సేకరించి, సంస్కరించి, 'సంస్కృతం' అన్న పేరున సంస్కృత భాషను రూపొందించారు. ఆ తరువాత 'సంస్కృతం' పెద్దఎత్తున అభివృద్ధి, వ్యాప్తి చెందింది. ఆ తరువాత, సంస్కృతం కోకొల్లలుగా ప్రాకృత శబ్దరూపాలను తనలో చేర్చుకుని, పద జాలాన్ని విస్తరించుకుంది.

ప్రాకృత భాషల్లోని ఎన్నో గ్రంథాలు చారిత్రక కారణాల వల్ల కనపడకుండా పోయాయి. ఇప్పుడు పదుల సంఖ్యలో మాత్రమే మిగిలాయని పరిశోధకులు అంటున్నారు. బౌద్ధ - జైన - ధర్మాలు ప్రాకృత భాషలను సొంత భాషగా చేసుకుని, పవిత్ర భాషగా భావించి, పోషించారు. కాబట్టే, ఎంతో కొంత కొద్దిగానైనా, ప్రాకృత భాషల్లోని వాఙ్మయం మిగిలిందని అభిప్రాయపడ్డారు.

ప్రాకృత భాషల్లోని కొన్ని గ్రంథాలు సంస్కృతంలోకి, జర్మనీ - ఆంగ్లం - వంటి పాశ్చాత్య భాషల్లోకి అనువదింపబడ్డాయి. ప్రాకృత భాషలు అంతరించి పోయినా, ఆ భాషలు సృష్టించిన వాఙ్మయం - సాహిత్యం- మనకి ఎంతో కొంతమేరకు మిగిలాయంటే అది అనువాదాల వల్లేనని తెలుస్తుంది. వాటి గురించి అనువాదాలు వల్లే ఎంతో కొంత తెలుసుకోగలుగుతున్నాం.

**సంస్కృతం కూడ అంతరించి పోతున్న భాషే. అది సృష్టించిన సాహిత్యమంతా, నిలిచే భాషల్లోకి అనువదించవలసిన అనివార్యత ఎంతైనా ఉంది. తెలుగులో గ్రాంథిక భాషలోని గ్రంథాలు చదివి అర్థం చేసుకోగలిగిన పరిస్థితి ఇప్పుడు దాదాపుగా లేదు. ఆ సాహిత్యం మిగలాలంటే - నిలవాలంటే - వ్యవహారిక వచనంలోకి మార్చుకోవలసిన అవసరం ఉంది. లేకపోతే భావి తరాలకు సమాధే మిగులుతుంది. అనువాదాలు భవిష్యత్తులోకి ప్రవేశించే సాహిత్య సాంస్కృతిక చారిత్రక వాహినులు.**

ఆ విధంగా ప్రాకృత భాషల్లో మిగిలిన గ్రంథాల్లో - గాథాసప్తశతి - ఒకటి. 'బృహత్కథ' కూడా పైశాచీ భాషలో రచింపబడింది. అది కూడా ప్రాకృత భాషే. బృహత్కథ- ఆధారంగా, సోమదేవభట్టు క్రీస్తు శకం 11వ శతాబ్దిలో 'కథా సరిత్సాగరం' సంస్కృతంలో సమకూర్చాడు. Ch. Tawney (1837-1922) ఆంగ్లంలోకి సంపూర్ణంగా అనువదించాడు. 1300 పేజీల ఆంగ్లానువాదం 1880లో రెండు సంపుటాలుగా ప్రచురించబడింది.

పైశాచీ భాష అంతరించిపోయినా, అది సృష్టించిన సాహిత్యం ఇవాళ మనకి లభ్యంగా ఉందంటే - దాన్ని మనం చదివి తెలుసుకోగలుగుతున్నామంటే - అది అనువాదాల వల్లేనని స్పష్టంగా చెప్పుకోగలం.



అనువాదాల చారిత్రక ప్రాముఖ్యత - అవసరం - అనివార్యత- అంతరించిపోతున్న భాషల విషయంలో అంతా - ఇంతా కాదని స్పష్టమౌతుంది. సంస్కృతం కూడ అంతరించి పోతున్న భాషే. అది సృష్టించిన సాహిత్యమంతా, నిలిచే భాషల్లోకి అనువదించవలసిన అనివార్యత ఎంతైనా ఉంది. తెలుగులో గ్రాంథిక భాషలోని గ్రంథాలు చదివి అర్థం చేసుకోగలిగిన పరిస్థితి ఇప్పుడు దాదాపుగా లేదు. ఆ సాహిత్యం మిగలాలంటే - నిలవాలంటే - వ్యవహారిక వచనంలోకి మార్చుకోవలసిన అవసరం ఉంది. లేకపోతే భావి తరాలకు సమాధే మిగులుతుంది. అనువాదాలు భవిష్యత్తులోకి ప్రవేశించే సాహిత్య సాంస్కృతిక చారిత్రక వాహినులు.

ఆనాటి ప్రజల వాడుక భాష అయిన ప్రాకృత భాషలోని సరళత - నిరాడంబరత - సౌలభ్యత - సహజత - గుండెను తాకే స్పర్శత - ఇప్పుడు మనం తెలుసుకోగలుగు తున్నామంటే - గాథా సప్తశతి - అనువాదాల వల్లేనని మనం వేరే చెప్పుకోనవసరం లేదు.

గాథాసప్తశతి - ఏ ఒక్క కవి రచించిన గ్రంథం కాదు. ఎందరెందరో రచించిన గాథలను సేకరించి సమకూర్చిన గ్రంథం. ఈ ఏడు వందల గాథలనూ రచించిన కవుల సంఖ్య మూడు వందల పై మాటేనని గుర్తించారు. భువన పాలుడు అనే గ్రంథ వ్యాఖ్యాత - ఈ 700 గాథలను 384 కవులు రచించినట్లు పేర్కొన్నాడు. ఈ గ్రంథానికి 19 గురు వ్యాఖ్యాతలు టీకా రాశారు. జగన్నాథపాథక్ తన హిందీ అనువాద పీఠికలో 14 మంది వ్యాఖ్యాతల పేర్లు పేర్కొన్నారు. పీతాంబరుడు రచించిన టీకలోనూ, వెబరు సంగ్రహించి ప్రచురించిన గ్రంథంలోనూ ఈ గాథలు రచించిన కవుల పేర్లు పేర్కొనబడ్డాయి.

గాథాసప్తశతి - మూడో గాథలో - హాలుడు - పేరు ఉంది. అందువల్ల - కూర్పరి హాలుడే అని అభిప్రాయం ఏర్పడింది. ఆగాథలో - కవివత్సలుడు - శాలివాహనుడు పేర్లు కూడా వున్నాయి. కవివత్సలుడు - అన్నది హాలునికి ఇవ్వబడిన బిరుదనీ, శాలివాహనుడు - అన్నది హాలుని మరో పేరని అభిప్రాయం ఏర్పడింది. చారిత్రక ఆధారాలతో కూర్పరి ఎవరన్నది నిర్ధారణ కాలేదు. కాల నిర్ణయం కూడా జరగలేదు.

గాథా సప్తశతి - పేరు మొట్టమొదట పేర్కొన్నవాడు బాణ భట్టు అని గుర్తించారు. అతడు రచించిన - హర్షచరిత్ర - పీఠికలో దాని ప్రసక్తి ఉంది. బాణుడు క్రీస్తు శకం 6వ శతాబ్దికి చెందినవాడు. అందువల్ల కూర్పరి క్రీస్తు శకం 6వ శతాబ్దికి పూర్వపువాడని తెలుస్తుంది. పాశ్చాత్య పరిశోధకులు - భారతీయ పరిశోధకులు - కూర్పరి కాల నిర్ణయం - గ్రంథం కాల నిర్ణయం - కూర్పరి ఎవరన్నది - అనే దానిపై విభిన్నమైన అభిప్రాయాలు చెప్పారు. చారిత్రక ఆధారాలు దొరకనంత కాలం - అటూ ఇటూ ఎటూ - ఏవిధంగా ఎవరు చెప్పినా, ఎలా చెప్పినా, ఆ అభిప్రాయాలుగానే మిగిలిపోతాయి. నిర్ధారణ కాదు.

గాథా సప్తశతికి ప్రాణం పోసిన మొదటి పండితుడు వెబరు. జర్మనీ దేశస్థుడు. ఎన్నో రాత ప్రతులను సేకరించాడు. వేయి గాథలను ఎంపిక చేశాడు. జర్మను భాషలో ప్రతి గాథకీ టీక రాశాడు. వివరణాత్మకమైన ఉపోద్ఘాతం రాసాడు. రాత ప్రతులలోని గాథల మూలాలన్ని రోమను లిపిలోకి మార్చాడు. ఆ విధంగా ఆ వేయి గాథల గ్రంథాన్ని క్రీస్తు శకం 1881లో ప్రచురించాడు. గాథలను నాలుగు విధాలుగా విభజించి ప్రచురించాడు. 1. 698 - సామాన్య మూలగాథలు, గంగాధరుని టీక ఆధారం అయి ఉంటుంది. 2. 116 - ప్రత్యేక మూలగాథలు. ఇతర వ్యాఖ్యాతల టీక ఆధారంగా అయి ఉంటుంది. 3. 151 - గాథలు తెలుగు దేశంలోని మూల పాఠం నుంచి సేకరించినవి. 4. 35 గాథలు వివిధ అలంకార గ్రంథాల నుంచి సేకరించినవి. ఆ విధంగా 1000 గాథలు సేకరించి, మూలాన్ని రోమను లిపిలోకి రాసి, విభజించి, ప్రతి గాథకీ టీక రాసి ప్రచురించాడు. వివిధ రాతప్రతులలోని పాఠ భేదాలను గుర్తించి జాబితా తయారు చేశాడు. పరిశోధన అంటే ఎలాగ ఉండాలో - వెబరు పరిశోధన నుంచి నేర్చుకోవాలి. 5. పండిట్ దుర్గాప్రసాద్ సంపాదకత్వంలో - 1911లో గాథాసప్తశతి ప్రచురింపబడింది. గంగాధర భట్టు రాసిన - భావావేశ ప్రవేశిక అను టీకను చేర్చి 'కావ్యమాల' బొంబాయి వారు ప్రచురించారు. ఆ తరువాత వచ్చిన గాథా సప్తశతి - అనువాదాలకు పైన పేర్కొన్న రెండు అనువాదాలు - గంగాధరభట్టు టీక పీతాంబరుని టీక - ప్రధానంగా ఆధారమయ్యాయి.

14వ శతాబ్దికి చెందిన కొండవీటి రాజు, కోమటి వేమ భూపాలుడు - సప్తసతీసారము - సంస్కృతంలో 15వ శతాబ్ది మొదటి భాగంలో రచించాడు. 104 గాథలను ప్రాకృత సప్తశతి నుంచి ఎంపిక

ప్రాకృత భాషలో ఆనాటి ప్రజల వాడుక భాషలో - వచ్చిన ఈ గాథలు ఆనాటి గ్రామీణ వ్యావసాయక జీవితాన్ని అత్యంత సహజంగా చిత్రించాయి. రాజులు - రాణులు - మంత్రులు - దేవతలు- నగరాలు - ఏనుగులు - గుర్రాలు - యుద్ధాలు - ఇందులో ఎక్కడా కనిపించవు. అటు బౌద్ధ, జైన మతాలతో కానీ ఇటు హిందూ మతంతో కాని - ఏ మతంతో కాని ఈ గాథలు ముడిపడి ఉండలేదు. మతాతీత లౌకిక జీవితమే చిత్రించబడింది.

చేసుకుని - భావదీపిక - పేరిట వ్యాఖ్యానించాడు. ఈ 104 గాథల్లో అలంకార గ్రంథాల్లో ఉదహరించిన గాథలను కూడా చేర్చాడు. ఈ గ్రంథాన్ని దిగుమర్తి సీతారామస్వామి తెలుగులోకి అనువదించారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, విశాఖపట్నం - 1951లో ప్రచురించారు.

కోమటి వేమ భూపాలుని ఆస్థానంలో (14 వశతాబ్ది) విద్యాధికారిగానున్న శ్రీనాథకవి సార్వభౌముడు గాథా సప్తశతిని తెలిగించినట్లు అతడే చెప్పాడు. తన కాశీ ఖండ కావ్యంలో - నూనూగు మీసాల నూత్న యౌవనమున, శాలివాహన సప్త శతినుడివితి - అని పీఠికలో చెప్పాడు. అయితే ఆ అనువాదం దొరకలేదు. మూడు పద్యాలు మాత్రం దొరికాయి - మానవల్లి రామకృష్ణ కవి రచించిన - కుమార సంభవము (1908)-లో ఒక పద్యం ఫుట్‌నోట్ కింద చూపబడింది. రెండు పద్యాలు - వేటూరి ప్రభాకరశాస్త్రి - క్రీడాభిరామంలో చేర్చబడ్డాయి.

గాథాసప్తశతిని, రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ 1931లో తెలిగించారు. "శాలివాహన గాథాసప్తశతీ సారము గ్రంథశీర్షికం బొంబాయి కావ్యమాల వారి ప్రచురణ ఆధారంగా చేసుకుని 395 గాథలు మాత్రమే తెలిగించారు. కట్టమంచి రామలింగారెడ్డి 22-09-1931 న ప్రస్తావన రాశారు. అనంతపురం, 'శ్రీ సాధన' ముద్రశాలలో ముద్రించారు. ఆ తరువాత రెండవ ముద్రణను ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు 1964లో ప్రచురించారు. 734 గాథలను ఇందులో చేర్చారు. వెబరు పండితుడు క్రీస్తు శకం 1881లో ప్రచురించిన గ్రంథం దొరికింది. అది జర్మనీ భాషలో ఉంది. జర్మనీ భాష అనంతకృష్ణ శర్మకి రాదు. అయితే అందులోని ఇంగ్లీషు మాటలు రోమను లిపిలోని టీకాలతరములలో ఉదహరించిన వాక్యాలు - రోమను లిపిలోని మూలగాథలు - ఆధారంగా ఎంపిక చేసి, అనువదించి మొత్తం 734 గాథలు రెండో ముద్రణలో పొందుపరిచారు. వెబరు మార్గాన్నే అనుసరించి నాలుగు భాగాలుగా విభజించారు. వెబరు పండితుని గ్రంథం నుంచి - వేమ భూపాలుని 'సప్త శతీసారము' నుంచి - కావ్యలక్షణ గ్రంథాల నుంచి - గాథలను సేకరించారు. గాథాసప్తశతిలోని 700 గాథల్లో కొన్నింటిని విడిచిపెట్టేశారు. అర్థం కానివి - అనువాదానికి లొంగనివి - అనువాదానికి యోగ్యం కానివి - విడిచిపెట్టేశారు. ఏఏ గ్రంథాల ఆధారంగా అనువాదం చేశారో - ఏవిధంగా అనువాదం చేశారో - చాలా విపులంగా నిజాయితీగా - పీఠిక (16-2-1964)లో స్పష్టం చేశారు. అది చాలా ఉపయోగకరమైన పద్ధతి.

గాథా సప్తశతిని సంపూర్ణంగా 1944లో గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి తెలిగించారు. గాథా సప్తశతిలోని 700 గాథలను 1968లో వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య అనువదించారు. తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి (రాజమండ్రి) వంద గాథలను తెలిగించారు. ప్రతి 100 గాథల్లోంచి 14 గాథలు ఎంపిక చేసి, ప్రారంభంలో ఒక శివస్తుతినీ, ముగింపులో ఒక శివస్తుతిని చేర్చి వందగాథలు తెలిగించారు. ఆ విషయాన్ని దిగుమర్తి సీతారామస్వామి - సప్త శతీసారము - తెలుగు అనువాద పీఠికలో పేర్కొన్నారు. కానీ, అది దొరకలేదు. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయంలో కూడా లేదన్నారు.

ఈ తెలుగు అనువాదాలన్నీ పద్యంలోనే వచ్చాయి.

గాథా సప్తశతి - ప్రభావంలో, ప్రేరణలో పలు కావ్యాలు వచ్చాయి. తెలిసిన కొన్నింటి శీర్షికలు చెప్పుకుందాం.

ప్రాకృతం : జయవల్లభుడు - వజ్జాలగ్గ- మహారాష్ట్రి.

సంస్కృతం : అమరు శతకం (అమరుడు -7వ శతాబ్ది ఆర్యా సప్తశతి (గోవర్థనుడు) ఈ రెండూ ముక్తక కావ్యాలు.

హిందీ : బిహారీ సత్‌స ఈ (బిహారీలాల్ -17వ శతాబ్ది) సాహిత్య చరిత్ర గ్రంథాల్లోనూ - అలంకార శాస్త్ర గ్రంథాల్లోనూ వీటి వివరాలు దొరుకుతాయి.

ప్రాకృత భాషలో ఆనాటి ప్రజల వాడుక భాషలో - వచ్చిన ఈ గాథలు ఆనాటి గ్రామీణ వ్యావసాయక జీవితాన్ని అత్యంత సహజంగా చిత్రించాయి. రాజులు - రాణులు - మంత్రులు - దేవతలు- నగరాలు - ఏనుగులు - గుర్రాలు - యుద్ధాలు - ఇందులో ఎక్కడా కనిపించవు. అటు బౌద్ధ, జైన మతాలతో కానీ ఇటు హిందూ మతంతో కాని - ఏ మతంతో కాని ఈ గాథలు ముడిపడి ఉండలేదు. మతాతీత లౌకిక జీవితమే చిత్రించబడింది. పల్లెటూళ్ళు - పొలాలు - పచ్చని పంటలు - పచ్చని రంగు రంగుల పూలచెట్లు గోదావరి తీరాలు - మెలుచుచున్న లేతపచ్చిక బయళ్ళు - వంటి సహజ ప్రకృతి సౌందర్యమే కనిపిస్తుంది. ప్రజల సహజ వాస్తవ జీవితమే కనిపిస్తుంది. ప్రజల దైనందిన జీవితాన్ని - ఆ జీవితంలోని నిర్మాణశాల దృక్పథాన్ని - ఆశావహ జీవిత విధానాన్ని - ఆ జీవితంలోని స్వచ్ఛమైన ప్రేమానురాగాలను - ఈ గాథలు మన మనోనేత్రం ముందు ఉంచుతాయి. ప్రేయసీ ప్రియుల మధ్య - భార్యా భర్తల మధ్య, నాయికా నాయకుల మధ్య ఉండే శృంగారం - ప్రేమ - విరహ వేదన - ప్రణయ ఆగ్రహం - వంటివి ఈ గాథల్లో సెలయేళ్లలా ప్రవహిస్తాయి. నైతిక విలువల ప్రస్తావన కూడా అక్కడక్కడ ఉంది.

బహుభార్యాత్వం - స్త్రీలను దొంగిలించి ఎత్తుకుపోవడం - వ్యభిచారం - వివాహేతర సంబంధాలు - వంటి సమాజానికి హానికరమైన దుర్మార్గాలు కూడా అక్కడక్కడ చెప్పబడ్డాయి. పురుషుల సాహసం- ధైర్యం - గురించి కూడా ప్రస్తావన దర్శనమిస్తుంది.

కొన్ని గాథల సారాంశాన్ని అవగాహన రూపంలో ఉదాహరించుకుందాం.

ప్రాకృత భాషలోని ఈ గాథలు చదవని వారికీ, వినని వారికీ, ప్రేమా శృంగారతత్త్వాలు ఎలా తెలుస్తాయి?! (1-2)

తగని వానిని వలచి సాధించుట కంటే, తగిన వానిని వలచి నిరాశతో చచ్చుట మేలు (దుగ్గసామి - 1-12)

# దుఃఖభాజ్యంగా

- దుర్గాప్రసాద్ అవధానం
సెల్ : 9492608314



గాలి విసిరి కొట్టినట్టు
చినుకు తెప్ప మీద కురిసినట్టు
ఉరుకుల్లో పరుగుల్లో
ఊపిరి ఎగిసెగిసి పడుతున్నట్టు

విజృంభిస్తుంది విశ్వశక్తి
ఏడుపులతో నవ్వులతో
ఆగమాగం చేసే ఆకలితో అల్లరితో

భయంలో పెరిగిన పెద్ద గుండె
నిలువరించలేని నీరసంలో
శిశు తాకిడిని తట్టుకోలేని అసహనంలో
అదుపులోకి తెచ్చుకునే అణచివేతలో
దెబ్బలు కొట్టి

ప్రతి తరం
మనో గాయాల పొరల్లో నాటుకుపోయే
పెద్దల కోర్కెల భావాలు
తలకెక్కించే తన్నుల దాడిలో
భయానకం

ఆకాశమంత విశాలంలోకి
పక్షి తన అండజాన్ని
ఎందుకు పొదిగి ఎగరనిస్తుందో...?
భూమంత విస్తరణలోకి
జంతువు తన పిండజాన్ని ప్రసవించి
చెంగున ఎందుకు గెంతనిస్తుందో..?

విశ్వమంత గాలిలోకి
చెట్టు తన ఉద్భిజాలాన్ని
మొక్కగా లోతైన వేర్లతో
ఎందుకు ఎదగనిస్తుందో..?

పెంచటానికో ఆక్రమించటానికో
శిశువంటే చిన్నది కాదు
విశ్వసూక్ష్మం
మనిషంటే వస్తుమారకం కాదు
శక్తి

వస్తూ వస్తూ అనంత శక్తితో
పోతూ పోతూ అతి బలహీనంతో
కులానికి కుటుంబానికి మధ్య
మధ్యముడిగా
మతానికి రాజ్యానికి మధ్య మూఢుడిగా
ప్రతి బాల్యం పెరిగి పెద్దై
దైన్యంలో భీతిలో
హత్యలుగా ఆత్మహత్యలుగా
ఎపుడు లోలోపల తెమిలే
దుఃఖబాజ్యంగా...

---

వలపు మక్కువ ఎక్కువైపోగా, చెంచు మగడు తాను మోయుచున్న పెద్ద విల్లును మోయలేక, చెక్కి సన్న పరిచాడు. అతని భార్య ఆ పొట్టును బయటపోయగా, అది సుడిగాలికెగిరి, దాని సొబగును చాటుచున్నది. (హాలుడు - శాలివాహనుడు 2-20)

పెళ్ళాం చచ్చిపోగా, ఆ ఇంటికి వెళ్లి ఏడ్వలేక, పొలం పని లేక పోయినా, పొలంలోనే ఉండిపోయాడు. (పుండరీయుడు 2-69)

తన్ను పెళ్ళాడక మునుపు ఏనుగులను వేటాడగలిగిన బోయవాడు, పెళ్లాడాక తనమీద వలపు ఎక్కువైపోయి నెమళ్ల వేటకు దిగిపోయాడు. (పోటీసుడు -2-73)

తన ప్రియుని చేరుటకై, వానాకాలంలో అర్ధరాత్రివేళ్లలో గోదావరి దాటి అవతలి గట్టుకుపోయి వస్తూ ఉండేది. (మయరద్ధయుడు. 3-31)

యవ్వనం తిరిగిరాదు. జీవితం శాశ్వతం కాదు. ఆ అల్ప కాలంలో సుఖానుభవం కోరేవాడిపట్ల ఈ లోకం ఎందుకు కఠినంగా ఉంటుంది? (హాలుడు -3-47)

పల్లెటూళ్లల్లో ఉప్పు దొరకదు కానీ, స్నేహం దొరుకుతుంది. పట్టణాల్లో ఎంత ఉప్పు దొరికినా, స్నేహం లేనప్పుడు దానివల్ల లాభం ఏంటి? (తిలోయణుడు 4-16)

నీవు శత్రువుని చంపేశావు. అతని భార్య చిన్న బిడ్డతో అడవిపాలై, గతిలేక ఉంది. (భీమస్వామి - 6-95)

ఊరుకాలిపోతున్నా, యువకులు వచ్చి మంటలు ఆర్పలేదు. ఎందుకంటే - నీ అందాన్ని చూస్తూ వాళ్లు నిలువునా కాలిపోతున్నారు! (714)

ఆ విధంగా ఈ గాథలు జీవితంలోని సహజ సౌందర్యాన్ని సహజంగా చిత్రించాయి.

గాథా సప్తశతిలోని గాథలు ఆర్యాచ్ఛందస్సులో కూర్చబడ్డాయి. సంస్కృతంలో ముక్తకాలుగా రూపుదిద్దుకున్నాయి. హిందీలో 'బిహారీ సత్‌సఈ'లో ద్విపదలుగా వచ్చాయి. తెలుగులో దొరికిన శ్రీనాథుని మూడు పద్యాలూ ఉత్పలమాల - మత్తేభం - తేటగీతిలో వచ్చాయి. అనంత కృష్ణశర్మ ఆటవెలది - తేటగీతి - కందం-లో అనువదించారు. అనువాదం మూల రచన పట్ల విధేయత కలిగి ఉంటుంది. తెలుగు అనువాదంలో మూలగాథల్లోని సహజత్వం - నిరాడంబరత - పాత్రల్లోని నిర్మలమైన మనస్తత్వం - మనోవేదన - ప్రేమ, శృంగారతత్వాల అంతర్వాహిని - జీవితం పట్ల ఆశావహ దృక్పథం - అంతర్లోక అనుభూతి చిత్రాలు అంతటా దర్శనమిస్తాయి. కదిలిస్తాయి. "నా భర్త నా శరీరంలోకి గుచ్చి గుచ్చి చూస్తాడు. అతడికి కనబడకుండా కప్పేసుకుంటాను. అయితే - నా మనసు మాత్రం అతడు అలా చూస్తూనే ఉండాలని కోరుకుంటుంది." - వంటి మనో సౌందర్య అనుభూతి చిత్రాలు వందలాదిగా తారసపడతాయి. ప్రేమతత్త్వం - శృంగారతత్త్వం - కొండల్లోంచి పుట్టి గలగల ప్రవహించే సెలయేళ్లల్లా ఈ గాథల్లో ప్రవహిస్తాయి.

అర్థవంతమైన జీవితాన్ని అర్థవంతంగా జీవించాలన్నదే ప్రధాన సందేశం.

ఇందులో చెప్పిన పల్లెటూళ్లు - ప్రకృతి సౌందర్యం లేకుండా పోవచ్చు. పట్టణాలుగా మారిపోయి ఉండవచ్చు. అయితే ఇందులో చెప్పిన స్త్రీ పురుష సంబంధాల్లోని ప్రేమతత్త్వం - శృంగారతత్త్వం - మానవ సంబంధాల్లోని స్నేహతత్త్వం - జీవితం పట్ల నిర్మాణ శీల ఆశావహ దృక్పథం - మానవజాతి ఉన్నంతకాలం ఉంటాయి. ఈ గ్రంథం వాటికి సహకరిస్తుంది. అందువల్ల, ఈ గాథలకు చావులేదు. ■

# ఖమ్మంలో ప్రతిధ్వనించిన కవిత్వ భేరి

- పోతగాని సత్యనారాయణ




జనవరి 22న ఖమ్మం పట్టణంలో నిర్వహించిన "జనకవనం" సభలో మాట్లాడుతున్న అద్దేపల్లి రామమోహనరావు. వేదికపై దేవేంద్ర, వాసిరెడ్డి రమేష్, తెలకపల్లి రవి, అంపశయ్య నవీన్, కె. ఆనందాచారి

ఉద్యమాలకు పురిటిగడ్డగా పేరుగాంచి, కళా సాహిత్యాలకు పుట్టినిల్లుగా భాసిల్లుతున్న ప్రజా చైతన్య గుమ్మం ఖమ్మం పట్టణంలో సిపిఎం 23వ రాష్ట్ర మహాసభ సందర్భంగా "జనకవనం అత్యంత ప్రతిష్టాత్మకంగా నిర్వహించబడింది. ఆదివారం జనవరి 22న స్థానిక జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో ఆహ్వాన సంఘం ఆధ్వర్యంలో నిర్వహించిన జనకవనం సాహిత్యాభిమానులను ఉర్రూతలూగించింది. వందకు పైగా కవులు జనకవనంలో పాల్గొని మతోన్మాదాన్ని, సామ్రాజ్యవాదాన్ని, ప్రపంచీకరణను, అవినీతి పాలకుల దోపిడీలను నిరసిస్తూ కవితాస్త్రాలు సంధించారు. ఉదయం 11 గంటల నుండి రాత్రి 7 గంటల వరకు నిరంతరాయంగా సాగిన కార్యక్రమంలో విశాల దృక్పథంతో కూడిన సామాజిక స్పృహ, ప్రశంసనీయమైన సృజనాత్మకత వ్యక్తమైనాయి.

మొత్తం 125 మంది కవులు అధికారికంగా పేరు నమోదు చేయించుకున్నారు. వీరిలో కవితలు చదవడానికి కాక వినడానికి వచ్చిన వారూ వున్నారు. వయోభేదం లేకుండా ఈ కార్యక్రమానికి హాజరై ప్రజా చైతన్యాన్ని నిరూపించారు. అన్ని ప్రగతిశీల భావ స్రవంతులకు సంబంధించిన కవులు, రచయితలు, ఔత్సాహికులు నూతనోత్తేజంతో పాలు పంచుకున్నారు. అధిక సంఖ్యలో పాల్గొన్న కవులందరి సందేశంతో ఒకే స్ఫూర్తి తొణికిసలాడింది. ప్రతీ కవీ తన కవితలో మానవ వాస్తవిక జీవితాన్ని ప్రతిబింబించాల్సిన బాధ్యతను సక్రమంగా నేరవేర్చినట్లు కనిపించింది. మనిషిలో మానవత్వాన్ని సమాధి చేసి రాక్షస ప్రవృత్తిని ప్రకోపింపచేసే పాశ్చాత్య వినిమయ విష సంస్కృతిని ఎండగట్టడానికి కవిత్వాన్ని పదునైన సాధనంగా వాడుకున్నారు.

చేజారుతున్న చేతివృత్తుల్ని, భవిష్యత్తును వెతుక్కుంటూ వలసపోతున్న పల్లె తల్లుల్ని, అనిశ్చితిలో కొట్టుకుపోతున్న పాలక వర్గ ద్వంద్వ నీతిని పలువురు కవులు శక్తివంతంగా చిత్రించారు. నేటి వాస్తవిక సామాజిక పరిస్థితులకు అద్దం పట్టేలా సాగిన కవితా పఠనం సభికుల్ని ఆలోచింపచేసింది. కవులు ఉద్వేగభరితంగా కవిత్వీకరించిన పంక్తుల్ని ఉటంకిస్తున్నప్పుడు కరతాళ ధ్వనులతో ఉత్సాహపరచడం కనిపించింది. సాహిత్య చైతన్యం, సాంస్కృతిక స్పృహలతో జనకవనం ప్రత్యామ్నాయ, ప్రజాసాహిత్య సంస్కృతిలా గోచరించింది. కవయిత్రులు అధిక సంఖ్యలో పాల్గొనడం ఈ జనకవనంలో ప్రాధాన్యత గల అంశం. కవితా పఠనం మధ్య మధ్యలో క్లుప్తంగా సందేశాలు నడిచాయి. మూడు భాగాలుగా సాగిన జనకవనంలో రాష్ట్ర నలుమూలల నుండీ వచ్చిన కవులు ఉత్సాహంగా పాల్గొన్నారు. వక్తలందరూ వచ్చిన కవితలలో సామాజిక స్ఫూర్తిని అభినందిస్తూ కవితా రచనలో మెలకువలు, మెరుగుదలకు సూచనలు చేశారు.

మొదటి భాగం ఉదయం 11 గంటలకు దివంగతులైన సాహిత్య, సాంస్కృతికరంగ ప్రముఖులకు నివాళులు అర్పించిన అనంతరం ప్రారంభమైంది.

కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత అంపశయ్య నవీన్ ముఖ్య అతిథిగా హాజరై ప్రసంగించారు. "కవిత్వం మన జాతి జీవనంలో అంతర్భాగమైందని, కవిత్వం రాసేవాళ్ళు ప్రాచీన, ఆధునిక కవితా సంపుటాలను కనీసం వందకు పైగా చదివితేనే కవిత్వంలో సాంద్రత పెరుగుతుందని అభిప్రాయపడ్డారు. కవిత్వం అనేది సాదా సీదా వ్యవహారం కాదని గుర్తించాలన్నారు. తన బాధలు తానే కాకుండా ప్రపంచ బాధల్ని తన బాధలుగా గుర్తించి రాయడమే నిజమైన కవిత్వ లక్షణమని తెలిపారు.

సామాజిక అవగాహన కలిగి శబ్దం పైన సాధికారంతో రాసిన కవిత్వమే చిక్కని సాంద్రత కలిగిన కావ్యంగా వాసికెక్కుతుందని తెలిపారు. తాను కవిత్వం రాయకపోయినా శ్రీశ్రీ తదితర కవుల ప్రభావం తన రచనలపై ఎంతో వుందన్నారు. మహాకవి శ్రీశ్రీ సమాజాన్ని

ప్రభావితం చేయదల రచనలు ఎన్నో చేశారని, ఆయన రచనలు ఇప్పటికీ, ఎప్పటికీ నిత్య నూతనమని కొనియాడారు. జేబులో వున్న ఒక్క రూపాయితో నూతనమని కొనియాడారు. జేబులో వున్న ఒక్క రూపాయితో మహాప్రస్థానం పుస్తకాన్ని కొని వరంగల్ నుంచి హన్మకొండకు బస్సులో వెళ్ళేందుకు డబ్బులు లేక నడిచి వెళ్ళిన సంగతిని గుర్తుచేసుకున్నారు. ఏమి రాయాలి, ఎలా రాయాలి అనే విషయాన్ని ముందే నిర్ణయించుకుని కవిత్వం రాయాలని సూచించారు. వచనానికి, కవిత్వానికి తేడా తెలుసుకుని కవిత్వం రాయాలని నూతన కవులకు సూచించారు.

ముఖ్య అతిథిగా విచ్చేసిన ప్రముఖ కవి, విమర్శకులు డా॥ అద్దేపల్లి రామమోహనరావు ప్రసంగిస్తూ "జనకవనం నేడు ఎంతో ప్రసిద్ధి చెందిన మాటగా ప్రాచుర్యం పొందిందని, కవి సమ్మేళనం అనే మాట కేవలం కవుల కలయికను సూచించే మాటగా మాత్రమే పరిమితమైన తరుణంలో "జనకవనం" ఆవిర్భవించిందన్నారు. అందువల్ల ప్రజా భాగస్వామ్యంతో కూడిన విశాల దృక్పథం ఏర్పడిందని అభిప్రాయపడ్డారు. పెట్టుబడిదారీ విధానం ఫలితాల నేపథ్యంలో వామపక్షాలే సమాజానికి ప్రత్యామ్నాయమని గుర్తించాలన్నారు. ఒడిదుడుకులకు గురవుతున్న సమాజాన్ని రక్షించేందుకు 'జనకవనం' ద్వారా కవులను సమీకరించి దిశా నిర్దేశం చేయటం అభినందనీయం అన్నారు. వేగంగా చోటు చేసుకుంటున్న సామాజిక పరిణామాల నేపథ్యంలో రేపు ఏమవుతుందోనన్న భయం ప్రజలను ఆవరిస్తోందన్నారు. సమాజ పరిణామ క్రమాన్ని దృష్టిలో వుంచుకుని రచనలు చేయవలసిన అవసరం ఏర్పడిందని తెలిపారు. సమాజ పోకడలను నిశితంగా పరిశీలించడంతో పాటు కవులు తమ రచనల ద్వారా చైతన్య పూరితమైన మార్పులు సూచించాలన్నారు.

**డా॥ అద్దేపల్లి రామమోహనరావు ప్రసంగిస్తూ "జనకవనం నేడు ఎంతో ప్రసిద్ధి చెందిన మాటగా ప్రాచుర్యం పొందిందని, కవి సమ్మేళనం అనే మాట కేవలం కవుల కలయికను సూచించే మాటగా మాత్రమే పరిమితమైన తరుణంలో "జనకవనం" ఆవిర్భవించిందన్నారు. అందువల్ల ప్రజా భాగస్వామ్యంతో కూడిన విశాల దృక్పథం ఏర్పడిందని అభిప్రాయపడ్డారు.**

జనకవనానికి సమన్వయ కర్తగా వ్యవహరించిన ప్రముఖ పాత్రికేయులు, సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి మాట్లాడుతూ కవులు జనం వెంట ఉన్నప్పుడే జనం కవుల వెంట ఉంటారన్న సిద్ధాంతం జనకవనం విషయంలో నిరూపితం అయిందన్నారు. పదేళ్ళ క్రితం ప్రారంభమైన జనకవనానికి విశేష ఆదరణ లభిస్తోందన్నారు. కవులు సామాజిక సైనికులుగా వ్యవహరించాల్సి వుందని గుర్తు చేశారు. అవినీతి అక్రమాలతో పేట్రేగిపోతున్న పాలక వర్గాలు మాఫియాను మాఫీ చేస్తూ సామాన్యుణ్ణి సఫా చేస్తున్నాయని చమత్కరించారు. రాబోయే రోజుల్లో అనేక ప్రగతిశీల కార్యచరణతో ముందుకు సాగాలని సూచించారు. ప్రభుత్వ, ప్రజా వ్యతిరేక విధానాలను ప్రశ్నిస్తూ రచనలు సాగించాలన్నారు. సమస్యలను ఎత్తి చూపడంతో పాటు పరిష్కార మార్గాలు సూచించడం ద్వారా ప్రభుత్వ మొద్ద నిద్ర వదిలించాలన్నారు.

ఆహ్వాన సంఘ అధ్యక్షులు, సిపిఎం కేంద్ర కమిటీ సభ్యులు తమ్మినేని వీరభద్రం ఉపన్యసిస్తూ సిపిఎం రాష్ట్ర మహాసభల్లో సాహిత్యరంగంపై విస్తృత చర్చ చేయడం ద్వారా లోతుగా విశ్లేషించడం జరుగుతుందని తెలియజేశారు. సమాజ మార్పులకు దోహదం చేసే సాహిత్య రంగాన్ని కాపాడాల్సిన బాధ్యత వుందన్నారు. మహాసభలో పార్టీకి సంబంధించిన ఎన్నికల ఎత్తులు, రాజకీయ పొత్తుల వంటి అంశాలతో పాటు సాహిత్య రంగ ప్రయాణం గురించి చర్చించి భవిష్యత్ కార్యాచరణ ప్రకటిస్తామన్నారు. సాహిత్య రంగ అభివృద్ధి కోసం తీర్మానాలు చేయడం జరుగుతుందన్నారు. సకల జనుల సమస్యల పరిష్కారంలో భాగంగా ప్రజల్లోకి అభ్యుదయ భావాలను ప్రోది చేయడానికి ఈ జనకవనం నిర్వహించబడుతోందని గుర్తు చేశారు. ప్రగతిశీల భావ స్రవంతిలో ప్రయాణిస్తున్న కవులు, రచయితలు ఒక ప్రత్యామ్నాయ సంస్కృతికై కృషి చేయాలన్నారు.

ప్రముఖ రచయిత, కవి, జనగానం సంపాదకులు దేవేంద్ర మాట్లాడుతూ మనిషి పరాయీకరణ నుండి విముక్తి చెందే వరకు కవిత్వం ప్రత్యామ్నాయ ఆలోచనలతో ముందుకు సాగాలని ఆకాంక్షించారు. కవిత్వం నేడు ఒక అనివార్యమైన భావ వ్యక్తీకరణగా మార్పు చెందుతోందని, దానిని నేటితరం కవులు విస్మరించలేని ప్రతిభావంతమైన సాధనంగా ఉపయోగించుకోవాలని సూచించారు.

జనకవనంలో ఆత్మీయ సందేశాన్ని అందించిన కవి యాకూబ్ మాట్లాడుతూ జనకవనం ప్రజా చైతన్యానికి శ్రీకారం అవుతుందని అన్నారు. ఒకే భావజాలం, పదునైన ఆలోచనలు కలిగిన వారంతా ఒక చోట చేరటం ద్వారా ఆరోగ్యకరమైన సమాజ నిర్మాణానికి భూమిక ఏర్పడుతుందన్నారు. సామాజిక చీడ పీడలపై చర్చలు జరిగిన సందర్భంలో మార్పుకు బీజం పడుతుందని అన్నారు. జనకవనం మధ్య మధ్యలో అమూల్యమైన సందేశాలను అందించిన వారిలో మువ్వా శ్రీనివాసరావు, వాసిరెడ్డి రమేష్‌లు సమాజానికి సందేశమిచ్చే రచనలు అచ్చు వేసేందుకు తమ వంతు సాయం అందిస్తామని హామీ ఇచ్చారు. ఇంకా సాహితీవేత్త మోతుకూరి నరహరి మాట్లాడుతూ మంచి విషయాలను ఎవరు చెప్పినా విని, ఆయా రచనలను అధ్యయనం చేయడం ద్వారా కవులు ప్రత్యామ్నాయ సంస్కృతిని నెలకొల్పే బృహత్తర కార్యక్రమంలో భాగస్వాములు కాగలరని సూచించారు. ఈ కార్యక్రమంలో కవి సీతారం పాల్గొని చేగువేరా తరహా సామాజిక మార్పునకు పాటుపడేలా తగిన రచనలు చేయాలని కోరారు.

అత్యంత ప్రతిష్టాత్మకంగా జరిగిన జనకవనానికి అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కటుకోర్పుల ఆనందాచారి మాట్లాడుతూ ఖమ్మంలో మహాసభల నేపథ్యంలో జనకవనం జరగడం ప్రాధాన్యత సంతరించుకున్న అంశమని అన్నారు. ప్రజాసాహిత్యం విస్తృతంగా రాయాల్సిన ఆవశ్యకతను వర్తమానంలో బాగా పెరిగిందని అన్నారు. ఇటువంటి జనకవనాలు స్ఫూర్తినిస్తాయన్నారు. వల్లభాపురం జనార్దన, రౌతురవి, మాల్యశ్రీ, సౌరప్రసాద్, సాధనాల వేంకటస్వామి నాయుడు, లెనిన్ శ్రీనివాస్, కటుకోర్పుల రమేష్, పురిమళ్ళ సునంద, తంగిరాల చక్రవర్తి, జనకవనం నిర్వహించారు. ఆద్యంతం ఆసక్తికరంగా సాగిన కవితా పఠనంలో కవులు తమ చైతన్యవంతమైన కవితలతో ఆహుతులను అందిస్తూ ఆలోచింపచేశారు.

'పోతగాని' రాసిన "ఆధారం చేజారుతున్న క్షణం" అనే కవితతో జనకవనంలో కవితా పఠనం ప్రారంభమైంది. ప్రపంచీకరణ నేపథ్యంలో నగరాలలోకి దూసుకొస్తున్న బహుళ జాతి కంపెనీలు, చిల్లర వర్తకాన్ని కబళిస్తున్న వర్తమాన పరిణామాలను వివరిస్తూ...

"శాసల్ని శాసించే గ్లోబల్ వ్యాపారికి
పాలకులే పాలేర్లై పాదాలొత్తుతుంటే
ఆప్యాయంగా ఆదరించి ఆదుకొన్న పచారీ కొట్లు
అనివార్యంగా అస్తిత్వాన్ని చేజార్చుకుంటై
ఛిద్ర చిత్తరువులై చెదిరిపోతున్న
చిల్లర మిణుగురులన్ని
చినిగిన పుస్తకంలో చెరిగిన అక్షరాలై చెదిరిపోతుంటాయి"

అంటూ హృద్యంగా కవిత్వీకరించారు.

"దగా చేయడానికి ఇక సామాగ్రి అయిపోనట్టుంది
బరితెగింపు సామ్రాజ్యవాద భూతం అక్టోపస్‌లా మారింది
... ... ...
గడిచిన చరిత్రపై నిట్టూర్పులు సరే
వర్తమానంపై నిబద్ధ సంతకం చేసేవాడు కావాలి" అంటూ

"నిబద్ధ సంతకం" కవితలో సామ్రాజ్యవాదాన్ని తూర్పారబడుతూ నిబద్ధత గల ప్రత్యామ్నాయ సంతకం కావాలని ఆకాంక్షించారు వొరప్రసాద్.

"అమ్మయ్య! నాకింకెవరితో సంబంధం లేదు
బంధాలు అనుబంధాలు తెంచేసుకున్నాను.
... ... ...
ఇప్పుడు నా బీరువాలో అన్నీ బ్రాండెడ్ దుస్తులే!
ఈ ప్రపంచీకరణ నా కళ్ళు తెరిపించింది
నేనెలా బతకాలో చెప్పింది.
అవతలివాడిని ఎలా దోచుకోవాలో నేర్పించింది అంటూ

ధ్వని ప్రధానమైన కవితను ప్రపంచీకరణపై నిరసనాస్త్రంగా సంధించారు డా॥ మాధురి.

"కష్టజీవుల కంకాళాలపై
మాయాసుర కోటలు
... ...
భూస్వర్గ సౌధాలు
దళితుల స్వేదాశ్రువులు
... ...
సామాన్యుల కరనఖాలు
నరసింహ నఖరాయుధాలౌతాయి" అంటూ దళితులపై

జరుగుతున్న అమానుష దోపిడీలను ఎండగడుతూ తిరుగుబాటుకు సన్నద్ధం చేస్తున్నారు. "దెయ్యాల బంగ్లాలు" అనే కవితలో నాగాస్త్ర.

"కవిత్వ సాహచర్యంలో
సంచలించి పోతాను!
ఒకానొక విస్మృత స్థితిలో
విచలితమౌతాను
నా మదిలో కవిత్వం గుభాళిస్తున్నంత కాలం
మనీషినై పరివ్యాప్తమౌతాను"

అంటూ కవిత్వం పట్ల తన్మయత్వాన్ని ప్రకటించాడు సాధనాల వేంకటస్వామి నాయుడు. తన కవిత "కవిత్వ కెరళిలో".

"ఆలోచనల అగ్ని జ్వాల రగిలి
మూడోనేత్రం తెరచినప్పుడు
నిశ్శబ్ద చైతన్యం విస్ఫోటిస్తూ
తూరుపు వెలుగు రేకగా ప్రభవిస్తుంది"

అంటూ మహిళలపై జరుగుతున్న అత్యాచారాలను నిరసించారు. "నిశ్శబ్ద విస్ఫోటనం"లో పురిమళ్ళ సునంద.

"విదేశీ విధేయం" అనే కవితలో

"కబళించే కుట్రలు కొనసాగుతున్నాయి
కాకుల్ని కొట్టి గద్దలకు వేసే పన్నాగం
రాజ్యమేలుతోంది" అంటూ తీవ్ర స్వరంతో ప్రపంచీకరణ

నేపత్యంలో పాలక వర్గాల దుర్నీతిని ఎండగట్టారు లెనిన్ శ్రీనివాస్.

"ఆడించే తాడు ఎవరి చేతిలో వుందో
అసలు కీలకం ఏమూలన దాగుందో
ప్రజలింకా గుర్తించనంత కాలం
ఆరు పదుల స్వాతంత్ర్యం అడవి కాచిన వెన్నెలే!"

అంటూ "గమ్యం – గమనం" కవిత మేల్కొలుపుతున్నారు ఆర్. రాజేశమ్.

"అయితే ఏం చేద్దాం" అనే కవితలో –

"ప్రపంచమంతా ప్రకోపాలున్నాయ్
విశ్వజనావళికి వెతలున్నాయ్
అయితే ఏం చేద్దాం?
ఒక్కసారి వెల్లువలా ఎగిసిపడదాం
సామ్రాజ్యవాదాన్ని ధ్వంసం చేద్దాం
ప్రత్యామ్నాయ వ్యవస్థను నిర్మిద్దాం" అంటూ సామ్రాజ్యవాద

ఒంటెద్దు పోకడలకు చరమగీతం పాడాలని ప్రేరేపించారు శాంతిశ్రీ.

"ప్రపంచీకరణ వ్యాఖ్యాతగా పుట్టిన అవినీతి
బహుళ జాతి కంపెనీలకు పున్నమి చంద్రుడు
దేశీయ సంపదకు సినీవాలి
ఇవనీన సవర్ణ దీర్ఘ సంధిలా సాగిసాగి
వృద్ధి సంధిలా ఎదిగి ఎదిగి
విసర్గ సంధి రూపాల్లో అవతారమెత్తిన
ప్రోగ్రెస్ రిపోర్టు" అంటూ ప్రపంచీకరణ దుష్ప్రభావాలను

ఎత్తిచూపారు ప్రోగ్రెస్ రిపోర్టు" కవితలో వల్లభాపురం జనార్దన.

"నీళ్ళు పెట్టిన ఈ చేతులతోనే
నిప్పు పెడుతున్నాను
గోరు ముద్దలు తినిపించిన ఈ చేతులతోనే
తలకొరివి పెడుతున్నాను" అంటూ రైతుల దీనస్థితిని కళ్ళకు

కట్టించారు "దగ్ధ హృదయం" కవితలో డా॥ దిలావర్.

"ఈ చీకటి చలి రాత్రి నిశ్శబ్ద నిరామయ యాత్రలో
మనిషి స్వార్థ కాంక్షల నదిలో తేలియాడుతున్నాడు
బ్రతుకులోని దుఃఖపు చారికలను
ఎండలో ఆరబెడుతున్నాడు" అంటూ "ఆశల వృక్షాలు"

కవితలో మారని మానవుని కోసం పరితపించారు డా॥ సిహెచ్. ఆంజనేయులు.

"సువిశాల ప్రజాస్వామిక వ్యవస్థలో
ప్రజా జీవనానికి అన్నీ అవస్థలే" అంటూ "నవకవనం

సాగాలి" అనే కవితలో తాతోలు దుర్గాచారి.

# హేతువాద పతాక ఎగురవేద్దాం



- కత్తి పద్మారావు

సూర్యుడు వెలుగునుండి వేడికి
స్రవించిన ప్రతి సమయంలో
మనిషి సంక్షుభితుడు
అవుతున్నాడు.
మనిషికి మనిషి దూరం
అవుతున్న సందర్భాలన్నిటిలో
ఒంటరౌతున్నాడు.
మనిషిని నమ్మడం మానేసి
నక్షత్రాలను బట్టి గ్రహస్థితులు
చూసుకుంటున్నాడే
గ్రహగతులే మనిషివర్తనను
నిర్ణయిస్తే
ఇక మనిషి జీవితానికి
అర్థం ఏముంది?
మనిషిలో కమ్మిన చీకటి
అభద్రత
తన్నుతాను నిలబెట్టుకోలేని
ఆత్మ స్థైర్యం
జీవన వర్తనలో
వికలాంగులను చేస్తోంది
నీకోసం వెంబడించిన
నీవు అపనమ్మకంవైపు
ప్రయాణిస్తున్నావు
ఖగోళ శాస్త్రాన్ని
కాకమ్మ కథలతో నింపుతున్నావు
ఒకే గ్రహగతుల క్రింద
విభిన్న జీవన గతులను
జీవిక కోసం
విశ్లేషిస్తున్నావు
అవును! అడవిలో జీవించేవాడే
ఎక్కువ కాలం ఎందుకు జీవిస్తున్నాడు
భూమి, నీరు, నిప్పు గాలి గురించి
నీకు తెలియదా!
మనిషి నుండి మనిషిని
వేరుచేయడానికి
నీ దగ్గరున్న నక్షత్రాలు
కలపడానికి లేవా!
నిజమే
మనిషి జ్ఞానంకంటే
మౌఢ్యాన్ని అభిలషిస్తున్నాడు
నేర్చుకోవలసిన దానికంటే
తృప్తిపడుతున్నాడు
వివేచింపజేసే అన్ని ఆలోచనలకు
తెరవేస్తున్నాడు
అభద్రతనే శాస్త్రానికి
బానిసవుతున్నాడు
అడుగుఅడుగులో
నక్షత్రాల ప్రభావం
నామీదేంటి
అని ఆలోచించడంతోనే
జీవితం గతిస్తుంది.
ఇవన్నీ తిరోగమన వాదనలే
జీవితాని కిప్పుడు వెలుగుకావాలి
నమ్మకం కావాలి
ప్రకృతి, జీవం, అభివృద్ధిని
అన్నిటని సమన్వయం
చేసుకోవాలి.
అటువంటి
సమాజంకోసం
పొట్టకూటి సిద్ధాంత రాయుళ్ళను
పక్కకు నెట్టి
ముందుకు నడుద్దాం
హేతువాద పతాకను
ఎగురవేద్దాం

---

"నాగరికతలు విలసిల్లిన నట్టింట్లో
బతుకు నగుబాటు చిత్రం
పల్లె ముఖంపై దుఃఖ వస్త్రం" అంటూ "బతుకు ఛిద్రం" అనే కవితలో, వాస్తవిక జీవన స్థితిగతుల్ని ఆర్ద్రంగా వెలిబుచ్చారు పుప్పాల మట్టయ్య.

"సౌజన్యం కోరనప్పుడు" అనే కవితలో
"అంకురాలు మొలకెత్తే పిడికిళ్ళౌతాయి
గళాలు సవరించి యువత
శిరమెత్తే కొడవళ్ళౌతాయి" అంటూ యువతను చైతన్య పరిచారు కపిల రాంకుమార్.

"ధనం విలువ పెరుగుతుంటే
మనిషికెంత బరువో
జనం విలువ తరుగుతుంటే
ప్రగతి కెంత కరువో... అంటూ తను రాసిన గజల్ పాడి సభికుల్ని అలరించారు కన్నెగంటి వెంకటయ్య.

"తెలుగురా ఇది వెలుగుల జిలుగురా
వెన్నెల వెలుగురా వేనోళ్ళ పలుకురా" అంటూ స్వీయ రచనను పాడి వినిపించారు వాస భూపాల్.

"తరాలు మారినా, అంతరాలు మారినా
యుగాలు మారినా, యుగాంతాలే వచ్చినా
స్వాగతమంటోంది హైటెక్ యమలోకం
మార్పు కోరుకొంటుంది మానవలోకం" అంటూ "హైటెక్ యమలోకం" కవితలో సమాజ స్వభావాన్ని తెలియజేశారు దాసరాజు శ్రీనివాస్."

"జ్ఞాపకాల చిత్రం కాదిప్పుడు
దివిటీలా వెలిగే చిత్రం గేయాలిప్పుడు
సమ సమాజ స్థాపనకు
పోరాట స్ఫూర్తిని రగిలించే చిత్రం కావాలిప్పుడు" అంటూ "దృశ్యా దృశ్యం" కవితలో సమ సమాజ స్థాపనకై పోరాటాల ఆవశ్యకతను విప్పి చెప్పారు రాచమళ్ళ ఉపేందర్. ఇంకా ఈ జనకవనంలో ప్రజానాట్యమండలి శేషగిరి బృందం ఆలపించిన గేయాలు సభికుల్లో ఉత్తేజం నింపాయి. జీవన్, సంపటం దుర్గాప్రసాద్, బి.ఇందిర, అమ్మిన శ్రీనివాసరాజు, స్ఫూర్తి, ఖాజామొయినుద్దీన్, మ్యాడగాని మధు, గోపినాథ్, భూపతి వెంకటేశ్వర్లు, కె. ఆనంద్‌కుమార్, పొత్తూరి సుబ్బారావు, కేతవరపు రాజశ్రీ, వూసల రజనీగంగాధర్ తదితరులు పాల్గొని తమ కవితా పాఠవాన్ని ప్రదర్శించారు.



# వాకాటి వారి బాసిజం కథలు

- డా॥ విజయగౌరి

వాకాటి సుమారు మూడు వందలకు పైగా కథలు రచించి, కథా ప్రపంచంలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించగలిగారు. వీరి కౌటుంబికపరమైన కథలు, ప్రేమ కథలు, హాస్య, వ్యంగ్య కథలు మొదలైన వాటితో బాటు బాసిజం కథలు కూడా పేరెన్నికగన్నవి.

ప్రపంచంలో ప్రతీ వ్యక్తికి తనకన్నా ఏదో ఒకరకంగా తక్కువ స్థాయిలో ఉన్నవారి మీద పెత్తనం చెలాయించాలనే కోరిక ఉంటుంది. కోడళ్ళ మీద అత్తగారు, పనివాళ్ళ మీద యజమాని భార్య మీద భర్త పెత్తనాలు చెలాయిస్తుంటారు. అదేవిధంగా ఆఫీసుల్లో తన కింది ఉద్యోగస్తుల మీద ఆఫీసర్లు పెత్తనం చెలాయించడాన్ని ఇతివృత్తంగా వాకాటి వారెన్నో కథలు రాశారు. వీరి కథల్లో ఒక ఆఫీసరు తన కింది ఉద్యోగస్తులను స్వంత పనులకు వాడుకుంటే, మరో ఆఫీసరు నోటికి వచ్చినట్లల్లా మాట్లాడి వాడు బాధతో గిలగిలా తన్నుకుంటూ ఉంటే చూసి సంతోషించే శాడిస్టు అయి వుంటాడు. ఇంకో ఆఫీసరు తన అభిప్రాయాలను బలవంతంగా అవతలివాడి నెత్తిన రుద్ది ఆనందిస్తే, మరొకడు కేవలం తన అభిప్రాయాలే విలువైనవిగా భావిస్తూ అవతలి వ్యక్తి కూడా ఒక మనిషేనన్న ఇంగిత జ్ఞానాన్ని కోల్పోతుంటాడు.

అయితే ఎటువంటి బాసులనైనా బుట్టలో పెట్టి తమ పనులు చేయించుకునే వాళ్ళు లేకపోలేదు. మరికొందరు ఈ బాసుల పీడ నుండి విముక్తి పొందడానికి ఉద్యోగాలకే నీళ్ళొదులుకుంటారు. అధికార దాహం కలిగిన ఈ ఆఫీసర్ల ప్రవర్తనను వాకాటి తమ కథలలో తీవ్రంగా ద్వేషించారు. ఆత్మగౌరవాన్ని దెబ్బతీసే మాటలు భరిస్తూ అధికారి బూటు కాలికింద బానిస బతుకు బతికే కన్నా ఆ ఉద్యోగ పంజరం నుంచి బైటపడి ఆత్మాభిమానాన్ని కాపాడుకోవడం లోనే ఎంతో ఆనందం వుందని రుజువు చేశారు.

ప్రేస్ ఓల్డ్ అనే సర్వదష్టుడి కథలో గుమస్తా మనోహరరావు తన ఆఫీసరు ఆశీర్వాదాన్ని ఎయిర్ పోర్టులో రిసీవ్ చేసుకున్నాడు. ఆయన గారిచ్చిన బాగేజ్ టికెట్‌ను పుచ్చుకుని తాడుతో కట్టబడి అసహ్యంగా వున్న సూట్‌కేసును పుచ్చుకుని అంతకు ముందే తాను బంజారాహిల్స్‌లో ఉన్న గెస్ట్‌హౌస్ దగ్గరికి మాట్లాడిన కారులో ఎక్కి కూర్చున్నాడు. అప్పటికే లోపల ఉండి కారునటు తిప్పమన్నాడు. కోఠీలో మిత్రుడితో ఓ అరగంట కబుర్లు చెప్పాడు కారును వెయిటింగ్‌లో ఉండనిచ్చి, కారు డ్రైవర్ గొడవ చేయడం మొదలుపెట్టాడు. మీటరుతో బాటు మనోహరరావు బి.పి. పెరగడం మొదలెట్టింది. ఇవేవీ పట్టించుకోని ఆశీర్వాదం కారులోకి తాపీగా కూర్చోవడం, జడివాన పడటం, ఆ వానలో కారు కదలనని మొరాయించడం...

చివరికి మనోహరరావు కారు దిగి ఆ వానలో తడుస్తూ కారు తోస్తూ వుంటే ఆశీర్వాదం అతగాడికి సాయమూ చేయలేదు, థాంక్సూ చెప్పలేదు. పైగా 'ఇంజను పాతదల్లే ఉంది' అంటూ సన్నాయి నొక్కులు నొక్కాడు. ఆశీర్వాదం జేబులో చేయి పెట్టి డబ్బు తీసే ప్రయత్నాలేవీ చేస్తున్నట్లు అనిపించకపోవడంతో తనే ఆ కారు డ్రైవర్‌కు డబ్బిచ్చి, మరో కారు మాట్లాడాడు మనోహరరావు. గెస్ట్‌హౌస్ జేరగానే మౌనంగా లోపలికి పరుగెత్తిన ఆశీర్వాదం వైఖరికి విస్తుపోయాడు మనోహరరావు.

ఒక గుమస్తా ఆశీర్వాదానికి సెల్యూట్ చేశాడు. ఇంకో చెయ్యి ఏమైందని అంటూ వెళ్ళిపోయాడు. ఆశీర్వాదం ఆయన భారత సాంప్రదాయం ప్రకారం 'నమస్కారం' కోసం ఎదురు చూశాడని ఆ గుమస్తాకు తెలియదు మరి. హెడ్‌క్వార్టర్స్‌లోనయితే ఏదో విధంగా ఇలాంటి ఆఫీసర్ల మొహం చూడటం, దండాలెట్టడం వాడు జ్ఞాన మణిపూస అనుకుని పడేసే పెంటికల్ని ఏరుకోవడం, వాడు చాలా అమాయకంగా మొహం పెట్టడం ఏదో వరం ఇస్తున్న ఫోజులో జారీ చేసిన హుకుం శిరసావహించడం తప్పదు. ఇలాంటి వాళ్ళే ఏ జూనియర్ ఆఫీసర్నో, అసందర్భపు ప్రశ్నలు వేసి ఇరకాటంలో పెట్టి తర్వాత మా మూడోవాడు ఎం.పి. ఫిలాసఫీలో వున్నాడు. వాడికీ పుస్తకం కావాలి. అని ఒక చీటీ ఇస్తాడు. ఆ చీటీ పట్టుకుని అక్కడ్నుంచి బైటపడితే చాలనుకున్న ఆ జూనియర్ ఆఫీసరు ఊరంతా వెతికి ఆ పుస్తకాన్ని తీసుకుని ఆఫీసరు దగ్గరికి వెళ్తే ఆయన ఈ జూనియర్ ఆఫీసరు వైపు ప్రశ్నార్థకమైన మొహంతో పుస్తకాన్ని అబ్బాయికి పంపేయండి అంటాడు. అది కూడా తెలీదా? అన్నట్టు.

కార్యాలయాలలో పని బాగా జరగాలంటే సిన్సియర్‌గా పనిచేస్తూ రూల్సు రెగ్యులేషన్స్ తెలిసి చురుకుగా పనిచేసుకుంటూ పోయే వ్యక్తులు కావాలి. నిజానికి అలాటి వ్యక్తుల వల్ల ఆఫీసర్లకు పని సులువవుతుంది. కానీ రూల్సుకు ప్రాముఖ్యతను ఇవ్వకుండా తన ఇష్టానుసారం ప్రవర్తిస్తూ సిన్సియర్‌గా పనిచేసే వ్యక్తులను అవమానించే ఆఫీసర్ల తత్వాన్ని వాకాటి "మంది మరొక్కడూ" కథలో వర్ణించారు.క్లర్కుగా పనిచేస్తున్న వేణుగోపాలం అదే ఆఫీసులో పనిచేస్తున్న మరో క్లర్కు ఈవెనింగ్ కాలేజీలో చదువుకునేందుకు అనుమతి నడుగుతూ రాసిన అప్లికేషన్ తన దగ్గరికి వచ్చినపుడు ఇటువంటి వాటికి అనుమతి ఇవ్వవచ్చు అనే రూలు ఉంది కాబట్టి దాని అప్లికేషన్ ఆఫీసరు దగ్గరికి వెళ్ళినా డ్రాఫ్టింగ్ కోసం మళ్ళీ తన దగ్గరికే రావాలి కాబట్టి ఒక్కసారే డ్రాఫ్ట్ కూడా పెట్టేసి సంతకం




కోసం ఆఫీసరు దగ్గరికి పంపాడు. అది నచ్చని ఆఫీసరు వేణుగోపాలాన్ని లోపలికి పిలిచి, "నువ్వు ఒట్టి గుమస్తావి, అంతేగానీ డైరెక్టర్‌వి కాదు. అందుకని ఆ రూల్ ప్లాన్ చేసి కాగితం అక్కడ పెడితే ఏ నిర్ణయం నేను తీసుకోగలను" అని ఆ ఫైలును కిందకి విసిరేశాడు.

''ఎదురీత'' కథలో సంజీవరావు ఆఫీసులో మేనేజర్ వెంకట్రమణయ్య తన కింద పనిచేసే క్లర్కులు స్పెల్లింగులు సరిగా రాయడానికి, అధికారుల మీద నిర్లక్ష్యం తగ్గడానికి, చేతి రాత అందంగా కుదరడానికి, వేగంగా నడవడానికి హోమియోపతి మందులు బలవంతంగా ఇస్తూ వాళ్ళ దగ్గర డబ్బులు వసూలు చేసేవాడు. ఆఫీసరు వేధింపులకు తట్టుకోలేక, ఆర్థికపరమైన ఇబ్బందులు ఎదురవుతుంటే విసిగి వేసారి ఉద్యోగానికి రాజీనామా చేసిన రావు కథే "చిలుకా పారిపో" అడ్డమైన గడ్డిమేసి ఎందరి కాళ్ళనో పట్టుకుని పైకి ఎగబాకిన రావుకి తన కింద పనిచేసే వాళ్ళంటే చులకన. ఒకరోజు మధ్యాహ్నం లంచ్ అవర్లో పేపరు చదువుతున్న క్లర్కును పిలిచి "ఇది ఆఫీసా? ఇల్లా! అని అడిగి రావు మాట్లాడే లోపలే" "ఏం చెముడా? తెలుగు అర్థం కాదా? నీకు ముప్పూటలా సరిపడే జీతం ఇస్తుంటే కాలుమీద కాలేసుకుని దర్జాగా పేపరు చదువుతావా?" ఇదేం నీ మామగారి ఇల్లనుకున్నావా? అని పెద్దగా అరిచాడు. క్లర్కు పొరబాటైపోయిందని చెబుతూ తాను సాయంత్రాలు లేటైనా పనిచేస్తున్న విషయం ఆయనకు గుర్తు చేశాడు. అందుకు ఆఫీసరు మరింత మండిపడుతూ "చెయ్యాలోయ్ ఎవడికోసం చేస్తావ్? నా ఇంటి పని చేస్తున్నాననుకుంటున్నావా? సర్కారు వాడి సొమ్ము తేరగా తినడం లేదూ? అందుకోసం చెయ్యాలి. చెయ్యకపోతే ఛార్జిషీట్ ఇచ్చి ఇంటికి పొమ్మంటారు. చేసింది వెధవ పని, దానికి తోడు నోరు కూడానా? గుమస్తాలకే ఇంత కావరమైతే దేశం ఎట్లా బాగుపడుతుందయ్యా? వెళ్ళు, వెళ్ళి ఒళ్ళు దగ్గర పెట్టుకుని మసలుకో!" అన్నాడు. ఆ గుమస్తా ఆత్మాభిమానం చంపుకుని ఎన్నాళ్ళో ఆ ఆఫీసరు కింద ఉద్యోగం చేయలేకపోయాడు.

ఈ ఆఫీసర్లు కేవలం ఆఫీసుల్లోనే కాదు, బైట కనపడ్డా ఏదోరకంగా పీక్కు తినకమానరు. అలాటి ఆఫీసరు కథే "తిరుపతీయమ్" - మూడేళ్ళ కొడుకు మహేశ్వర్‌కి క్షవరం చేయించడానికి బైలుదేరిన శేషగిరికి మేనేజర్ సీతారామారావు ఎదురుపడి హోటల్ వైపుకు దారితీశాడు. నేతి దోసె తెప్పించుకున్నా మేనేజరుతో బాటు తాను తగుదునమ్మా అంటూ ఆయన ఖర్చుతో అదే తింటే బావుండదని శేషగిరి ఆర్డనరీ దోసె తెప్పించుకున్నాడు. సర్వరు బిల్లు తెచ్చేసరికి మేనేజర్ చేతులు కడుక్కునేందుకు వాష్‌బేషిన్ దగ్గరకి వెళ్ళడం, ఆ బిల్లు శేషగిరి ఇచ్చేయడం జరిగిపోయాయి. బైటకి వస్తూ ఆయన శేషగిరితో జీవితంలో ఒక పాయింట్ ఉందోయ్. ఎంత పెద్ద సమస్య అయినా స్పర్శ లేకుండా సర్దుకుపోవాలి. అది వ్యక్తిగతమైనది గానీ, అంతర్జాతీయమైనది గానీ, మన సిల్లీఫూల్స్ వున్నారు. చిన్న చిన్న విషయాలకు ఆఖరుకు హోటల్ బిల్ దగ్గర కూడా నేనిస్తానంటే నేనిస్తానని అసహ్యంగా మాట్లాడుకుంటారు. ఐ సింప్లీ హేట్‌దెమ్..." అంటూ వెళ్ళిపోయాడు. కొడుకు క్షవరానికి బయలుదేరిన శేషగిరికి అలా మేనేజర్ చేతిలో పడి క్షవరమైపోయింది. గుమస్తాలకు ఆర్థికపరమైన ఇబ్బందులు ఎన్ని ఉన్నా ప్రిస్టేజిని కాపుడుకోవటం కోసం ఆఫీసరు గారింట్లో పండుగను తమ ఇంట్లో పండుగలాగా చేసుకోక తప్పదు.

"ఘోషయాత్ర" కథలో గుమస్తా శేషగిరి మరో చొక్కా కొనుక్కునే ఆర్థిక స్థోమత లేక చిరిగిన చొక్కానే భార్యతో కుట్టించుకుని వేసుకుంటూ, బస్సు టికెట్‌కి కూడా సరిపడా చిల్లర లేక ఆఫీసుకు నడిచి వెళ్ళేవాడు. అయినా ఆఫీసరు గారమ్మాయి పెళ్ళికి తన అవసరాన్ని పక్కకు నెట్టి బహుమానం కొనక తప్పింది కాదు.

ఎదుటివారి బలహీనతలను ఆధారం చేసుకుని తమ పబ్బం గడుపుకుని వాళ్ళను నడి సముద్రంలో వదిలేసే ఆఫీసర్లు సమాజంలో ఎందరో ఉంటారు. 'స్వయంకృతం' కథలో ఆఫీసరు రావు అలాటివాడే. ఆదివారం కూడా ఆఫీసుకు రావాలని హెడ్‌క్లర్క్ స్టెనో మాధురితో అన్నప్పుడు తనకు రావడం కుదరదని చెప్పి పర్మిషన్ కోసం రావును అడిగింది. తనతో ఆమె ఊటీకి రావడానికి ఒప్పుకుంటే పర్మిషన్ ఇస్తానన్నాడు రావు. రావు తనను పెళ్ళి చేసుకోకపోతాడా అని నమ్మిన మాధురి ఆయన రమ్మన్న చోటికల్లా వెళ్ళింది. ఆమె ఆశను, బలహీనతను ఆధారం చేసుకున్న రావు ఆమెతో అవసరం తీరిపోగానే భార్యా పిల్లలతో సహా జర్మనీకి ట్రయినింగ్ కని వెళ్ళిపోయాడు. అతడు వివాహితుడని తెలియని మాధురి తన జీవితాన్ని నాశనం చేసుకుంది.

ఆఫీసులో ఆఫీసరు చెప్పే అడ్డమైన పనులు ఇష్టం వున్నా లేకపోయినా అందరూ చేస్తారు. ఆత్మాభిమానంతో ఆఫీసరు స్వంత పనిని చేయడానికి నిరాకరిస్తే ఏం జరుగుతుందో వాకాటి "సృష్టిలో తీయనిది" కథలో చెప్పారు. సాయి క్లర్కుగా పనిచేసే ఆఫీసులో హెడ్‌క్లర్కు తన మూడో కొడుకు బడికెళ్ళి జీతం కట్టి రమ్మన్నప్పుడు సాయి నిరాకరించాడు. అది మనసులో పెట్టుకున్న హెడ్‌క్లర్క్ అతనిలో తప్పులు వెదకటం మొదలెట్టాడు. ఈ సతాయింపులు భరించలేని సాయి ఉద్యోగాన్ని వదలిపెట్టాడు.

నూటికో, కోటికో ఒక్కరు "రెండు చక్రాలు" కథలో హెడ్‌క్లర్క్ మూర్తిలాంటివారు. ఆఫీసులో ఎవరైనా తప్పు చేస్తే నెమ్మదిగా మందలిస్తాడు. అయినా వినకపోతే మెమో ఇస్తాడు. ఆ మెమోలలో అధికారం ఉండదు. 'అమ్మ తిట్లు' కనిపిస్తాయి. మెమో అందుకున్న వ్యక్తిని పేపరు మీద సంజాయిషీ ఇమ్మని అడిగి తీసుకుని మరోసారి ఇలా జరగకూడదని గట్టిగా మందలించి, అందరూ వెళ్ళిపోయాక ఆ మెమోను, సంజాయిషీ కాగితాన్ని చింపి బుట్టలో వేస్తాడు. క్రింది ఉద్యోగస్తులతో పనిచేయించడం ప్రధానం కానీ వారిని బాధించడం ఆఫీసర్ల లక్ష్యమై ఉండకూడదని వాకాటి పాండురంగారావు మూర్తి ప్రవర్తన ద్వారా చెబుతారు.

కాలక్షేపానికో, పేరు ప్రతిష్టల కోసమో, డబ్బు సంపాదించడం కోసమో కాకుండా తన అనుభవాలను పాఠకులకు పంచి యిచ్చి, 'ఆత్మవిమర్శ' చేసుకునేందుకు దోహదపడే కథలను రాసిన వాకాటి పాండురంగారావు వంటి కథకులు ఉండటం తెలుగు పాఠకుడు చేసుకున్న అదృష్టం. నేటి యువతి ఈ కథలలోని నీతి నిజాయితీలను గ్రహించి సమాజానికి తమ వంతు 'మేలు' చేయగలిగితే ఈ కథలకు సార్థకత చేకూరినట్లే.



సెల్ : 9912428407

# ప్యాంట్రీవాలా

- చిన్ని నారాయణరావు



వాళ్ళ సూర్యుడెప్పుడు
ఉదయిస్తాడో తెలియదు కాని
తెల్లారేకల్లా చకోరపక్షులైన
ప్రయాణీకుల ఆకలి యుద్ధాల్ని
తీర్చను రాత్రంతా నిశాచరులవుతారు వాళ్ళు
జాము రాత్రి దాటేశాక... కనురెప్పల్ని
నిద్రాదేవి హస్తలాఘవంతో కాటేశాక
ఛుక్ ఛుక్ రైలు ఒక్కసారిగా వాకింగ్ ఆపేసి
జాగింగ్ జోన్‌లోకి ప్రవేశిస్తుంది
అక్కడే అమ్మ జోలపాటల
ఆప్యాయతానురాగాలు జవురుకొని.
కాసేపు పసితనం పులుముకొంటాం
బాల్యం తాలూకు తీపిఛాయల్ని
నెమరేసుకొంటాం

అలసట పొంగి పొరలుతూ వగర్చే మనసుకు
కాఫీల కరచాలనంతో ఉల్లాసాన్ని
అందించే వాళ్ళు ప్యాంట్రీవాలాలు
నురగలు కక్కే తేనీటి సేవనం చేయించి
ఆత్మీయ ఆలింగనం చేసుకొంటారు వాళ్ళు
బండెడు చాకిరీకి గుండెనొడ్డిన నకళ్ళే వాళ్ళు
శివుణ్ణి హిమాలయాల్లో కన్నట్లు
రైళ్ళే వీళ్ళ ఆనవాళ్ళు
లోయల్లాంటి రైలు బోగీల్లో
ఆకలికి పట్టెడన్నం పెట్టే
ఈ ప్యాంట్రీ పని వాళ్ళు చిందించే రైల్వే
చెమట చుక్కల ఘోషల సవాళ్ళు వేనవేలు...
ఎడారి ప్రయాణాల్లో... సుడిగాలి పర్యటనల్లో
మనకు నిజమైన నేస్తాలు వాళ్ళు
ట్రావెలోకానికి ఇన్‌స్టెంట్ ఎనర్జీని
ప్రసాదించే సుప్రభాత కిరణాలు
ఒయాసిస్సుల్లో సైతం అమృతభాండం
ఒలికించగల భువిపై దేవతలు వాళ్ళు
అప్పర్ బెర్త్‌పై తమ దాహార్తిని పడకేయించి
పగలనక రేయనక పరిశ్రమించే
యంత్రాలైన వాళ్ళు
తాము మాత్రం గూడ్సు రైలైపోయి
పానీయాలు మోసుకొస్తూ
జనం దప్పిక తీర్చను ఊటబావులైన వాళ్ళు
చిరునవ్వులు పట్టాల క్రింద నలిగిపోతే
నడిచే ఆకలి ఆవిష్కృత దృశ్యాలే వాళ్ళు
సూపర్ ఫాస్ట్ రాజధాని ఎక్స్‌ప్రెస్‌లై
అమృత కలశం జాడ పోబిడి తెస్తూ
తాము మాత్రం ఆకలి పక్షులై అలమటిస్తూ
రేపటి కోసం బడబాగ్నిని మోసే
వింతలోకం వాళ్ళు
వాళ్ళ విస్తట్లో సూర్యుడెప్పుడు
ఉదయిస్తాడో తెలియని వాళ్ళు
బ్రతుకే ప్లాట్‌ఫారమై
అవుటర్ సిగ్నల్ కోసం
పట్టాలపై నిరీక్షించే జీవచ్ఛవాలు
వాళ్ళెక్కిన రైలుకూతకు కన్పిస్తుంది విరామం
పయనించే జనావళికి చేరువవుతుంది మార్గం
ప్యాంట్రీవాలాలకే గమ్యం ఎప్పుడూ
కూతవేటు దూరం


ఎం. హెచ్. భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-20
వివరాలకు : 040-27660013, సెల్: 9490099059 ; ఇ.మెయిల్ : ssprasthanam_@gmail.com ; www.prasthanam.com

కథ

# భరోసా లేని బ్రతుకు



- గనారా

**చేతులకు ఆయిల్ గ్రీజు - ఎంత కడిగినా పోలేదు!**
**జిడ్డు -**
**అలాంటి చేతులతో భోజనం చెయ్యమంటే ఎలా?**
**ఇబ్బందిగానే వుంది!**
**తప్పదు -**
**అతని వృత్తిలో ఇది మామూలే!**

చిన్నప్పుడు, గుడ్డలకు మురికి అంటుకుంటే, అమ్మ వూరుకునేది కాదు! తిట్టినా, ఎంతో శుభ్రం చేసేది. చాకలనే ప్రశ్న ఉండేది కాదు. తనకు వయస్సు వచ్చినా, ఆమె ఉతికేది. శాశ్వతంగా వెళ్ళిపోతే ఇబ్బందని, వయస్సు వస్తుండటంతోనే పెళ్ళి జరిపించి, బాధ్యత తీర్చుకుని వెళ్ళిపోయింది అమ్మ!

రాజారావు బట్టలు ఉతికే రాయికి చేతులు రుద్దాడు. సబ్బు పెట్టి పట్టి రాశాడు. అయినా ఆ జిడ్డు వదలలేదు, ఆమె వస్తుందని చూశాడు. రావడం లేదు!

కోపం తగ్గలేదు కాబోలు!

నిజమే!

తనే తప్పు చేశాడు!

ఇలాంటి సందర్భాలలో తనలో తానే నిందించుకునేవాడు!

అట్లా ప్రవర్తించకూడదని, ఒట్టు పెట్టుకుంటూనే ఉంటాడు.

కానీ మామూలే!

తాను మాత్రం ఏమన్నాడు?

మందలింపు తప్పు కాదు కదా?!

కాకపోతే సవ్యంగా చెప్పే అలవాటు కాలేదు. కటువుగానే అంటాడు.

వేపచెట్టు నీడ!

బయట ఎండ ఎక్కువగానే ఉంది. చెట్టుపై కాకి అరుస్తూ వుంది!

రాజారావుకు చికాకు పెరిగింది.

వంట చేసిందో లేదో!

ఓ బండి డెలివరీ యిచ్చి మార్కెట్‌కి పోయి పెద్ద చేప కొన్నాడు.

పని నేర్చుకోవడానికి వచ్చిన కుర్రాడికి ఇచ్చి ఇంటికి పంపాడు.

చేప పొలుసు రాతి ప్రక్కన వెండిలా మెరుస్తూ వుంది. దాని అవశేషాలు కాకులు పట్టుకుపోయాయి.

వంట చేసిందన్న మాట!

కోపం తగ్గే వుంటుంది!

తాడుపై వున్న పాత గుడ్డతో చేతులు తుడుచుకున్నాడు. వెండి వుంగరం సరిచేశాడు. చేతిపై ఉన్న కృష్ణుడి పచ్చబొట్టుపై తడిపి... తుడిచాడు. తాటి ఆకుల ఇల్లు చూరు క్రిందకి వంగి లోనికి ప్రవేశించాడు. తలుపు చప్పుడికి అటు నుంచి ఇటు చూసింది అతని భార్య! మూతి ముడిచి పడుకుంది! అటు ఇటు తిరుగుతూ గూటిలో ఏదో తడుముకున్నాడు. సహనం పరీక్షించకూడదనుకున్నదేమో! లేచి కురులు ముడిపెట్టి, అలికిన గోడకు చేరవేసిన పీట తీసి, చేతులు కడుక్కుని వడ్డించింది... వేడి వేడి పులుసు, మట్టి గాజులు పైకి లాగి బిగించింది. ఆ గాజులు చప్పుడు రాజారావుకు యిష్టం! వీధిలోకి వచ్చిన గాజుల వాడు అమ్మకు గాజులు వేస్తుంటే, ప్రక్కనే ఆనుకుని, కూర్చునేవాడు! బాల్యస్మృతులు మదిలో మెదిలాయి. ఆ గాజులు... రంగులు పాత జ్ఞాపకాల్ని తడిమాయి!!!

భర్త చేతుల జిడ్డు గమనించింది ఇల్లాలు! అతని వృత్తిలో అదో భాగం! ఆమె విధి నిర్వహణ తినిపించడం. ముద్ద చేసి నోటికి అందించింది. ఆ ఆదరణకు, ఆప్యాయతకు అతని మనసు కరిగిపోయింది.

రెండో ముద్దకు కళ్ళల్లో నీళ్ళు ఉబికాయి! ముఖం ప్రక్కకు తిప్పి, భుజానికి కళ్ళు వత్తుకున్నాడు.

"ఏంటి అయ్యా! ఏమైంది?"

"వాడు ఎక్కడ?"

మౌనంగా వుండిపోయింది!

"బాధపడ్డాడా? ఎంత నొచ్చుకున్నాడో!"

"ఆడికి మనం కాకపోతే యవరున్నారయ్యా... కోపం వస్తే ఎంత మాట పడితే అంతే అంటావు! అమ్మ పోయినప్పటి నుండి... తండ్రిలా సాకావే!!!"

రాజారావు పైకి లేచాడు!

"ఎక్కడికయ్యా..! ఇది తిను.. మధ్యలో లేవకూడదు!!!"

"వద్దు! వాడిని తీసుకువచ్చి తింటాను, ఎక్కడకి పోయాడో!"

"చద్ది కూడు తినలేదు!" కళ్ళు వత్తుకుంది. "ఆ గుడి దగ్గరో... ధాన్యం గోడవున్లు దగ్గరో ఉంటాడు!" రాజారావు మనస్సు కకావికలం అయ్యింది! స్కూటర్ మెకానిజానికి తెచ్చిన దానితో బయలుదేరాడు.

పన్రెండేళ్ళ బావమరది రాంబాబుని వెదుక్కుంటూ రామాలయం చెట్టు నీడన చూసి ఆ ధాన్యం గోడౌన్స్ వైపు వెళ్ళాడు రాజారావు. ప్రహరీ గోడలా గిడ్డంగులు, చుట్టూరా ముళ్ళకంపలు పెంచారు. స్కూటర్ వదిలి తుప్పలు, ముళ్ళ డొంకలు తప్పించుకుంటూ లోనికి వెళ్ళాడు.

క్రింద జాగ్రత్తగా చూసుకుంటూ అడుగులు వేశాడు. ముళ్ళ కంపలకు వ్రేలాడుతున్న పాత గుడ్డలు, మట్టిలో కప్పుకుపోయిన, రంగు రంగుల పీలికలు, తవుడు వాసన! జిడ్డు నేల, పశువులు మసిలిన అడుగుజాడలు! గోడౌన్స్ అవతలి వైపు నీడలో కుర్రోళ్ళు కేరింతలు, గోటి బిళ్ళ ఆటలు!

"రాంబాబు! రారా! నీ వంతు ఆట వచ్చింది!"

"ఆడు రాడురా!"

"ఏం?"

"రాత్రి ఆడి బావ చీవాట్లు పెట్టాడురా!"

"ఏం?"

"ఆడి – హీరో సినిమా రిలీజు కదా!"

"ఆ సిన్మాహాలు దగ్గర జెండాలు కట్టడానికి వెళ్ళాడు. వెంకటరావు గాడు రమ్మంటే వెళ్ళాడు."

"తన్నులు తిన్నాడన్న మాట!"

"మా బావ కొట్టాడు! – మా అక్కను తిట్టాడు! అందుకే కోపం వచ్చింది!!!"

నకనకలాడుతున్న కడుపుతో మెట్లపై కూర్చున్నాడు రాంబాబు.

రాజారావుకు ఆ కుర్రోళ్ళ మాటలు స్పష్టంగానే వినిపిస్తున్నాయి!

ఆ గోడ వార బండిని ఆపి ముందుకు వెళ్ళాడు.

"ఓరేయ్! మీ బావ!" అంటూ ఆ కుర్రోళ్ళు పరుగులు తీసారు.

అక్కడ మెట్లపై కూర్చున్న రాంబాబు లేచాడు, నేరస్తుడిలా తలవంచి నిలబడ్డాడు.

"పద – ఇంటికి, చద్దన్నం తినలేదట!!! చదువుకోకపోతే ఎలారా?! నాలాగే ఎందుకు పనికిరావు!!!"

రాజారావు గారాబంగా రాంబాబును దగ్గరకు తీసుకున్నాడు.

...

అక్క కుప్ప కూలిపోయింది. ఒక్క గెంతులో రాంబాబు పరుగుతీశాడు. చుట్టుపక్కల వాళ్ళంతా చేరిపోయారు!!!

ఆమె తలను ఓ ఇల్లాలు వళ్ళోకి తీసుకుని, మొహాన నీళ్ళు చిమ్మారు. బంధువులు ఒక్కటే ఏడ్పు! ఆ ప్రాంతం కోలాహలంగా మారిపోయింది.



# వీడ్కోలు

- ఛాయరాజ్
సెల్ : 9440258275

ఉమ్మ జలగర్భ కోశంలోంచి నిన్ను చూసి
ఇప్పుడే వచ్చావనుకున్నాను! అప్పుడే వెళ్ళిపోతున్నావు!
చితి మంటల్లోంచి నిన్ను చూశాను - కడుపు మంటల్లోంచీ
నిత్యనూతనానివి నువ్వైతే - నిగ్గును నేను... పో...
కలల వలయానికి కేంద్రబిందువును నేను
నువ్వు ఉత్తకాలానివి - నిష్క్రమించలేవు ప్రవేశించలేవు
మా ప్రదేశమూ మేమూ లేకుండా...
ఒక కొత్త వ్యవస్థలోనికి రాలేని నువ్వు
నిజమనిపించే అబద్ధానివి
నూతన లోకాన్ని ఆవిష్కరించగలవా...రా..
నువ్వు లేనప్పుడూ నేనుంటానని భయపడిపోకు
శ్రమకు తోడుగా వుంటాను - కళల కోటి కళ్ళల్లో వుంటాను
బాధ్యతల్లో వుంటాను
నువ్వు బీడుల్లో విహరించు! నేను మహాప్రస్థానంలో వుంటాను
నన్నంటుకోవడం నీకు కుదరదు - నేను మండిపోతున్నాను
కాని కాలం నాకెందుకు!
కళల లోతుల్లోని
కలల విజయానికి జాగృత కిరీటాన్ని...
నా విశ్వాసాన్ని ఆహ్వానించలేని
నీ కదలికల గురించి నాకెందుకు?
కాలమా! ఉత్త నిన్ను రద్దు చేయగలను సుమా!
ఈ విజ్ఞానం నాకుందన్న జ్ఞానం నీకు లేదు
ఇంత పీడక వ్యవస్థలోని అనుభవాలేని చందమైతే
'నేను' అంటే 'మేము' నిన్నెంతని భరించగలం కాలమా?
దమ్మున్న శ్రమ మువ్వలలో
నిన్ను కూర్చి మోగించి భాగించ గలం కాచుకో
విభాగించి విప్లవధ్వనులుగా
నిన్ను మార్మోగించగలం... పో....

---

రాజారావు స్కూటర్ ట్రెయిల్ తీస్తుండగా... ఓ జంక్షన్‌లో లారీ ఢీ కొట్టింది!!!

ఆ వీధిలో కొందరు కుర్రోళ్ళు, పెద్దలు అక్కడ ఆసుపత్రికి చేరుకున్నారు.

కొన ఊపిరితో వున్న రాజారావు - రాంబాబును దగ్గరకు తీసుకుని, శాశ్వతంగా కళ్ళు మూశాడు!!! అక్కడ నుండి రాంబాబును కొందరు పెద్దలు ఓదారుస్తూ, ధైర్యం చెబుతూ బయటకు తీసుకెళ్ళారు.

చెయ్యాల్సింది ఏముంది? కర్మకాండ తప్పిస్తే!

ఆ అక్కా తమ్ముడ్ని చూసి, కన్నీరు కార్చని వారు లేరు, రాజారావు మంచితనం, రిపేరింగ్స్‌లో ఆయన పనితనం నుంచి ఆయన చేతిలో స్కూటర్ మెకానిజంతో శిక్షణ పొందిన కుర్రోళ్ళు... గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్నారు!

ఊళ్ళో మెకానిక్ షెడ్లు బంద్ అయ్యాయి! వీధి పెద్దలు కర్మకాండలో నిమగ్నమయ్యారు!

రాజారావు కష్టమర్లలో ఒకాయన లాయర్ నాగభూషణం వార్త తెలిసిన వెంటనే హుటాహుటిన బయలుదేరి వచ్చాడు.

ఆ విషాద వాతావరణంలో అక్కడికి వచ్చిన ఒకరిద్దరు పరిచయస్తుల్ని పలుకరించాడు ఆయన. ఏదో కాస్త సానుభూతి సంతాపం... తెలియజేశాడు. పనిలో పనిగా, రాజారావు నష్టపరిహారం... ఒక ఇన్సూరెన్స్ కంపెనీ వాళ్ళు ఇస్తారని, కొన్ని 'లా' పాయింట్స్ వివరించారు కొందరు - "ఐదు" అన్నారు.

కొందరు - "పది" అన్నారు. లక్షలు చర్చలు వాదోపవాదాలు జరిగాయి.

మరో ప్రక్క కర్మకాండకు కావలసిన ఏర్పాట్లు జరుగుతున్నాయి.

"మనిషి పోయి వుంటే... డబ్బు... డబ్బు.... అంటారేమిటి!!" ఒకావిడ విరుచుకుపడింది!

"ఆవిడ రోజులు... ఎలా గడుస్తాయి? ఆ కుర్రోడి భవిష్యత్ ఏం కాను?" లౌకికం తెలిసిన మరో వ్యక్తి అందుకున్నాడు.

"నిండు ప్రాణం పోయిన తరువాత ఎలా వూరుకుంటాం" లాయర్ నాగభూషణం కలుగచేసుకున్నాడు.

"చట్టం తన పని తాను చేసుకుపోతుంది, ఆవిడ చేత కాగితాలపై సంతకాలు చేయించండి!!!"

...

అద్దాలు బిగించిన చలువ గదిలో లాయర్ నాగభూషణం కూర్చున్నాడు. ఎదురుగా క్లయింట్స్, జూనియర్స్ గుమస్తాలు, కొందరు వాది, ప్రతివాదులు!

రాంబాబు అక్కతో పాటు చాలా సేపటిగా ఆయన పిలుపు కోసం ఎదురు చూస్తున్నాడు!!! గంట తదుపరి వారిని లోపలికి ఆహ్వానించాడు. బయట అందరూ గమనిస్తూనే వున్నారు!!!

ఆమె కన్నీళ్ళు తుడుచుకుంది. తమ్ముడ్ని దగ్గరగా తీసుకుంది. ఏదో వాగ్వివాదం... ఆయన చికాకు... ప్రదర్శించాడు. సొరుగులోంచి మూడు వందలు కట్టలు తీసి ఆమెకు అందించాడు. ఇన్సూరెన్స్ కంపెనీపై దావా ఖర్చులు... ఆ పెట్టుబడికి, వడ్డీ వగైరా తన లాయర్ ఫీజు.. పోలీసులు.. వగైరా... వగైరాలు...!!!

లక్ష నష్టపరిహారం, మిగిలింది ముప్పై వేలు. లాయర్ తన పని తాను చేసుకుపోయాడు. ఆ డబ్బు ఆమె తీసుకుని అతనిపై గిరాటు వేసింది. మెటికలు విరిచింది!!! శపించింది!!! తమ్ముడ్ని తీసుకుని విసురుగా బయటకు నడిచింది. ఊహించని పరిణామానికి ఆ లాయర్ మ్రాన్పడిపోయాడు!!!

# 'రోడ్డు' మీద నడిచిన కవిత్వం!



**- డాక్టర్ రాధేయ**

కవిత్వం అంటే వర్తమాన ప్రాణం
కవిత్వం అంటే భవిష్య ప్రయాణం
కాలం కంటే నిన్ను ముందు నడిపించే
కాలాతీత మహాశక్తి కవిత్వం!

**- డా॥ రావి రంగారావు**

ప్రపంచంలో అతి ప్రాచీన కవిత్వం ప్రకృతి వర్ణనలతోనే ప్రారంభమయింది. ప్రకృతి సౌందర్యాన్ని చూసి కవి ఉత్తేజాన్ని పొందుతాడు. అతనిలో సౌందర్య దృష్టి పెరుగుతుంది. తాను వర్ణిస్తున్న ప్రకృతి చిత్రం మన మనోనేత్రానికి స్పష్టంగా కనపడేలా పద చిత్రాలను కూరుస్తాడు. ఆదికవి వాల్మీకి నుండి అత్యాధునిక కవి కూడా సాధారణంగా అందమైన పదచిత్రాలు లేకుండా కవిత్వం రాయలేదు. అంతేకాదు ఎలాంటి అక్షర జ్ఞానం లేని జానపద కవులు కూడా చక్కటి అలంకారాల అల్లికతో అద్భుతమైన వర్ణనలు చేశారు. తెలుగు కవికి అన్నీ కావ్య వస్తువులే. కవి అన్నవారికి జీవితమూ, కవిత్వమూ వేరు వేరు కావు. జీవితం పట్ల సంతృప్తి లేనివాడిలో సంక్షోభం వుంటుంది. కవి కూడా సామాన్య వ్యక్తిలాగే స్పందిస్తాడు. అయితే సాంద్రమైన అనుభూతితో అందర్నీ ఆకట్టుకుంటాడు. ఈ అనుభూతి, అనుభవంతో పాఠకుల్లో తనదైన ముద్ర వేసుకుంటాడు. సమాజంలోని మనిషి మనిషితో తనకు గల అనుబంధమే అతణ్ణి సమాజానికి మరింత సన్నిహితుడిగా చేస్తుంది. తనకు ఏర్పడిన ప్రాపంచిక దృక్పథంతోనే తన కవిత్వాన్ని విస్తృతపర్చుకుంటూ నడక సాగిస్తాడు. కవులు మనుషులను ప్రేమిస్తారు. సమాజాన్ని ప్రేమిస్తారు. దృశ్యాలను ప్రేమిస్తారు. ప్రయాణాల్ని ప్రేమిస్తారు. తన కాలినడకకు ఆలంబన నిచ్చే రోడ్డును సైతం ప్రేమిస్తారు. ఈ వ్యాసంలో 'రోడ్డు'ను ఎంతో ఇష్టంగా, ప్రేమించే కవుల కవిత్వాన్ని విశ్లేషించుకుందాం!

మైలురాళ్ళ రుమాళ్ళతో మధ్య మధ్య ముఖం తుడుచుకుంటూ రోడ్డు పరుగెడుతుంది. ఆ రోడ్డుతో పాటు తామూ పరుగెత్తాలని పక్కన పాకుతున్న చెట్లు ఎప్పుడూ సరదా పడుతుంటాయి. ఏ గతుకుల్లోనో అడ్డం పడిపోయి ఈ రోడ్డు తన నడ్డి విరగ్గొంటు కుంటుందేమోనన్న దిగులుతో వృక్షాలు కంగారు పడుతుంటాయి అంటూ రోడ్డులా జీవించమంటూ జీవితాన్ని అభ్యర్థిస్తున్నాడు ఈ కవి -

"సింధూర ధూళి లాంటి చిరునవ్వు విసురుకుంటూ / ఇరువైపులా ఉన్న ఇళ్ళ కురులలోంచి / పాపిటలా దూసుకుపోతుంది రోడ్డు / రోడ్డుకు విశ్రాంతి లేదు / చిమ్మ చీకటైనా / నక్షత్రాల టార్చిలైట్లు పట్టుకొని / నడుస్తుంది / వెనక్కి తిరిగి చూడదు రోడ్డు / మడమలు పగిలిపోతున్నా ముందుచూపే / అలసిపోయిన ముఖాలే వెనక్కి చూస్తాయి / ఎత్తు మీదున్న వాళ్ళకే గదా నిత్యాందోళనలు / నేల కుదుళ్ళను పట్టుకున్న రోడ్డు బిగువు / గాలి పరుచుకుంటుందా / జీవితమా! నువ్వూ రోడ్డులా జీవించగూడదూ / "

**- డా॥ సి. నారాయణరెడ్డి**

పొద్దుటి పూట చెట్ల కింద ప్రాణనదులు ప్రవహిస్తాయి. ఊపిరి తిత్తులు బారలు సాచి ఈదుతుంటాయి. ఈనెలకూ రక్తనాళాలకు మధ్య ప్రాక్తన ప్రసారాలు జరుగుతాయి. కలత నిద్రలోని కలవరాలు కాళ్ళ కింద నలిగిపోతాయి. అది నడకే. చెదిరిపోయిన మనిషి తనలోకి వేస్తూ అడుగులు రోడ్డును స్పర్శిస్తున్నాయి. రోడ్డు పుష్పిస్తుంది. మనసు కోల్పోయిన మహత్తర దృశ్యాలు రోడ్డు మీద పరిమళిస్తాయి అంటున్న ఈ కవి -

"రోడ్డు పాదాలు పాదాలుగా పుష్పిస్తుంది / శ్వాసలు నాదాలుగా నినదిస్తాయి / శుభ్ర సుందర ముఖబింబాలు / ముందొచ్చిన సూర్యుళ్ళవుతాయి / ఇంట్లోని ఇరుకు గదుల చీకటి / తెలిరేకలు సోకి వెలిగిపోతుంది / పచ్చి వచనం కూడా కవిత్వం రెక్కల్తో లేస్తుంది / ఎవరు నాటారో ఈ మొక్క / వారికి నా దండం / ఎవరి నవ్వో ఈ పువ్వు / అది నా హృదయం / రోడ్డుమీదికి వాహనం ప్రవేశిస్తుంది / ఫెళ్ళుమని కొట్టిన ఆయిల్ బాకులు దిగి / ఉదయం విలవిల్లాడుతుంది/"

**- డా॥ ఎన్. గోపి**

రోడ్లు అనంతాలు, అతి ప్రాచీనాలు. ఈ మనుషులు రోడ్లను తరచూ తమ అరికాళ్ళపై మోస్తుంటారు. రోడ్లను ఏ వజ్రాయుధమూ కోయలేదు. ఒక తుఫానూ, ఒక భూకంపమూ తప్ప. రోడ్లను ఏ శక్తీ

కొలవలేదు. రోడ్లను కొలవాలంటే చెమట చుక్కల్ని లెక్కకట్టాలి. అందుకే నేను రోడ్లకు నమస్కరిస్తున్నాను అంటున్నాడీ కవి – "నిన్నూ నన్నూ మనందర్నీ / పాక్షికంగానైనా గమ్యానికి చేర్చే / ఈ రోడ్లకు నమస్కరిస్తున్నాను / ఈ రోడ్లకు సాష్టాంగ పడుతున్నాను / రోడ్డంటే ఒక మహత్తర ఆచరణ / రోడ్డంటే దగ్గర దగ్గరగా పేర్చబడ్డ / సమాధి బతుకుల్ని సమూలంగా బ్రద్దలు కొట్టడం / చిన్నదైనా చితకదైనా / రోడ్ల నుంచి నేర్చుకోవాల్సిన పాఠం ఒక్కటే / నేల విడిచి సాము చేయక పోవడం / దారి పొడవునా నిలువెత్తు జాగ్రత్తలు / మన సవాలక్ష అజాగ్రత్తలకు అద్దం పడతాయి / పాతిన మైలురాళ్ళు / మన బద్ధకానికి ఆనవాళ్ళుగా నిలిచిపోతాయి / రోడ్డు అన్నింటినీ భరిస్తుంది. ఒక్క అలక్ష్యాన్ని తప్ప / రోడ్లేసేవాడు / ఒక జాతి నిర్మాతకు తక్కువ / ఒక నాగరికుడికి ఎక్కువ /"

**– లకుమ**

మా ఊరికి రోడ్డొచ్చింది. నల్లని నది వచ్చినట్టుగా వారం వారం కాళ్ళ భారం తగ్గించింది. వారం వారం అంగడి మోత బరువు తీరిపోయింది. రోడ్డంటే ఒక సమాచార ప్రవాహం. దొరల కొమ్ముల కేసే పగ్గం. తాతల ఆమడల దూరం గంటలకు తగ్గించినందుకు రోడ్డుకు నేను దండం పెడుతున్నానంటున్న ఈ కవి –

"రోడ్లప్పటి నదులు / తాము కదలకుంటనే మనల్ని కదిలించే / కొత్త రకం నదులు / రోడ్లు ఇప్పటి మనుషుల జాతర / కొత్త ప్రపంచపు అనుసంధానం / నదులే అతి ప్రాచీన రోడ్డైనట్టు / అత్యాధునిక రోడ్లే కొత్త రకం నదులు / వాహనాలు పడవల్లెక్క వచ్చిపోతుంటై / నాల్కెల మీద కొత్త రుచుల రోడ్డుకు స్వాగతం / మల్లబద్ద నీళ్ళకు లాకులు తెరచినందుకు / రోడ్డుకు స్వాగతం / "

**– డా॥ సుంకిరెడ్డి నారాయణరెడ్డి**

రోడ్లు ప్రమాదాలకు నెలవులు. రోజు రోజుకూ పెరుగుతున్న ప్రమాదాలు అవినీతి స్థాయిని మించి సాగుతున్నాయి. యాంత్రిక జీవనబద్ధులైన మానవులకు లోహ విహంగాలు శాపంగా మారాయి. సెల్‌ఫోన్లతో సంభాషిస్తూ కళ్ళెం తిప్పుతున్నారు అంటున్న ఈ కవి –

"ప్రపంచ బ్యాంకు అప్పిచ్చి పెనుముప్పే తెచ్చింది / భద్రకాళి నాలుకల్లా విస్తరించిన రోడ్లు ప్రమాదాలతో నెత్తురోడుతున్నాయి / అడవి మదపుటేనుగులై విజృంభిస్తున్నాయి / జనాభా అదుపులో తామూ విలోమ పాత్రనే పోషిస్తున్నట్లు / సరికొత్త భాష్యం చెబుతున్నాయి /"

**– సంకేపల్లి నాగేంద్రశర్మ**

మా నగరానికి నడిబొడ్డు మహాత్మాగాంధీ రోడ్డు. అక్కడ నిత్యావసరాలకు కొరత లేదు. బారులు తీర్చినట్టు భోజనశాలలు నోరూరిస్తూ వుంటాయి. ఆంగ్ల భాష యాసలో యాచన చేస్తూ కొత్త బిచ్చగాడు దర్శనమిస్తాడు అంటున్న ఈ కవయిత్రి –

"అరవై దాటిన స్వాతంత్ర్యానికి / అచ్చమైన ఉనికిపట్టు / అలనాటి త్యాగాలకు / వెలలేని ముడుపు / దేశభక్తి చిత్రాలకు లభిస్తుంది / పన్ను మినహాయింపు / నాణేనికి ఒకవైపు చూపు / రెండు వైపులు కలసిన కూడలి మెట్టు మీద / జాతి పిత విగ్రహం / తప్పనిసరిగా ఆనవాలుగా చెప్పవలసిన చోటు / నగరానికి నడిబొడ్డు / నిజానికిది మహాత్మాగాంధీ రోడ్డు/"

**– రాజేశ్వరి దివాకర్ల**

మీ ప్రయాణంలో తోడును, మీ ప్రమాదంలో గోడును మీ విలాసాలకు భూమికను మీ నిశ్శబ్దంగా రోదించే మౌనికను. ప్రగతి లక్ష్యంగా సాగే మనిషి ప్రయాణంలో కొండల్ని ఢీకొన్నాను, బండల్ని ఛేదించాను – అడవుల్ని అణచివేశాను. నన్ను నేను చెక్కుకుంటూ నిలువెత్తు గాయమవుతూ మీ గమ్యానికి వెన్నునిచ్చాను. రోడ్డు తన ఆత్మగీతిని వివరిస్తూ ఉంది –

"పల్లెగా స్థిరపడటానికి / పాటగా నన్ను తడుముకుంటూ / వెళ్ళిన దృశ్యం / ఇంకా నా కళ్ళముందు నుండి / చెదరిపోలేదు / ఇంటి ముందు నుండి / ప్రవహించే నన్ను పట్టుకొని / పేడ నీళ్ళతో ప్రేమగా తడిపి / ముగ్గుల బుట్టలతో / ముద్దుల పాపాయిలా / ముస్తాబు చేసిన / ఆ చల్లని పల్లె తల్లుల స్పర్శ / యింకా నన్ను వెంటాడుతూనే వుంది / నాకు మీ అభివృద్ధి మీద / ఆక్షేపణ లేదు / మీ అధిక వేగం మీద అసంతృప్తి ఉంది /"

**– కాసర్ల నరేశ్‌రావు**

ఒక్కక్షణం ప్రవహించడం మానేసిన నదిలా ఉంటుంది రోడ్డు. తెరిచిన దోసిళ్ళతో ఇక్కడ ఒక క్రీస్తు నాణేల్ని వెతుక్కుంటాడు. పిడికెడు గింజల కోసం ఒక వీధి మహర్షి చేతులు చూస్తాడు. పొడవాటి వాలుజడలా వుంటుంది రోడ్డు. ఎండమావుల వెనక నిరంతరంగా ప్రవహించిన పాదాలకి విశ్రాంతినిస్తుంది. ఈ రోడ్డు గుండా జలపాతాలు ప్రవహిస్తాయి. కలలు ప్రవహిస్తాయి. మనిషి ప్రవహిస్తాడు. ఆలోచనలు ప్రవహిస్తాయి అంటున్న ఈ కవి –

"రోడ్డుకి ఒక హృదయం వుంది / ఒక స్పర్శ వుంది / ఇక్కడ రోడ్లకి / వేల లక్షల కుటుంబాలకి ఆకాశం కప్పు కింద / ఆశ్రయమిచ్చే మనసు ఉంది / దయచేసి రోడ్లమీంచి / మనుషుల్ని బహిష్కరించవద్దు / మనిషిని రోడ్ల మీంచి తరిమేసిన రోజున / ఇక్కడి రోడ్లు పిడికిళ్ళవుతాయి / చాచిన చేతులన్నీ ఏకమవుతాయి / రోడ్డుకి నలుగుర్నీ కూడదీసే గుణం ఉంది / రోడ్లకీ ఒక భాష ఉంది / ఒక సంకేతం ఉంది /"

**– ఆకెళ్ళ రవిప్రకాష్**

నేను ఈ రోడ్డు పైనే 'అ ఆ'లు దిద్దుకున్నాను. ఇప్పుడు కూడా ఈ రోడ్డుపైనే అక్షరాలు ఏరుకొంటున్నాను. ఈ రోడ్డు ఒక పరిషత్తు. ఒక సాంస్కృతిక సంస్థ. ఈ రోడ్డుపై నేను నడుస్తుంటాను. నాతోపాటు ఆలోచనలూ నడుస్తుంటాయి. రోడ్డున పడ్డ మనిషిని నేను 'కవి' అని పిలుస్తాను అంటున్న ఈ కవి –

"ఇక్కడే ఈ రోడ్డు పైనే / స్నేహం ముసుగులోంచి / నవ్వే కత్తులు నడవడం చూశాను / కుష్టు మనిషి, కుంటి మనిషి / ఈ రోడ్డునే నన్ను 'బుద్ధున్ని' చేశారు / ఎన్ని కవితలు ఇక్కడ శ్రీకారం చుట్టుకున్నాయి / ఎన్నో గాయాల గేయాలు / గుండె బరువును దించుకొని / ఊపిరి పీల్చుకొన్నాయి / అందుకే ఈ రోడ్డు నాకు / నిరుపహతి స్థలం / ఎన్నెన్నో 'గీత'లను పలికించే కురుక్షేత్రం/"

**– కనపర్తి రామచంద్రాచార్యులు**

# సజీవ దహనం

- గుర్రాల రమణయ్య
సెల్ : 9963921943



అమ్మడానికేం మిగిలింది
చారెడు కన్నీరు తప్ప!
ఆరుగాలం చెమట చిందిరాని
రెప్పలతో రాత్రిళ్ళని బహిష్కరించి
పగటిని రాత్రిని ఏకం చేసిన
కండరాల సత్తువై కాసిన ధాన్యం
అడవికొచ్చిన అమ్మకమై పోయింది!
నేలతల్లి కడుపు చించుకొని
పైరై పులకరించిన ప్రసాదం
రోడ్డుపై విసిరేసిన కసువైపోయింది

దిక్కు చూపాల్సిన వాడే దిక్కూచి పగులగొట్టి
నమ్మకం మీద కొడవలి గాటు పెట్టాక
సేద్యమే బతుకు శ్వాసై పోయిన రైతు
గొడ్డలి పట్టుకు తిరుగలేదు కదా!

కుక్క కరిస్తే సూదికి దిక్కులేని చోట
మృత్యువు మాత్రమే పలుకరించినట్టు
దుక్కులు దున్ని తూర్పార పట్టిన పొలంలో
దారిద్ర్యమే దర్శన తాండవం చేస్తుంది
చెమట మడవ కట్టి ప్రవహించిన దేహం
బీడై పొడై తనే వల్లకాడై పోతుంది!
వెన్నెల నిప్పులు చెరిగే దేశంలో
ఎన్ని నదులు పారితేనేం
ఎన్ని వానలు కురిస్తేనేం
మనిషి సజీవంగా దహనమై పోతున్నాడు

---

ఈ రోడ్డు నాకు దేశ చరిత్ర. ఈ రోడ్డు నాకు మనిషి చరిత్ర. ఈ రోడ్డు నాకు నా ముఖం తెలిసినంత బాగా తెలుసు. ఇది నాకు అమ్మతోనో, ఆమెతోనో సమానం. రోడ్డు పరుగుతీస్తుంటే అడవులూ, కొండలూ దారిచ్చాయి. నీళ్ళు నమస్కరించి తప్పుకున్నాయి. నదులు బ్రిడ్జిలు కట్టాయి. ఈ రోడ్డు నాకు ఈ దేశం అంత బాగా తెలుసు. ఇది నాకు మా ఊరితోనో నా దేశంతోనో సమానం అంటున్న కవి –

"ఈ రోడ్డు నాశ్రయించి బ్రహ్మ రాక్షసి లాంటి చెట్లు / చుట్టూ వరి చెరకు మిరప కంది రాగులు వేరుశెనగలు / అబ్బో పంట పొలాలన్నీ వంటగదుల్లా వుండేవి / పచ్చని మడి చెక్కలు చూస్తుంటే / విస్తళ్ళు పరిచినట్టు నోరూరుతుండేవి / అజ్ఞాత భూతకాలంలోకి వేళ్ళు తన్నుకున్న చెట్లు / వీరబ్రహ్మాన్నో, వేమననో, డొక్కా సీతమ్మనో తలపిస్తాయి / ఇప్పుడీ రోడ్లు నాకు తెలిసినవి కావు / వాన కురిస్తే మట్టి వాసన వెయ్యవు / ఈ రోడ్డు ఆరోగ్యంగా వుందో లేదో తెలీదు / గ్లోబలైజేషన్ సోకిన రోడ్డును గురించి ఏం చెబుతాం / బలిసిందో, బ్రతికిందో, కుంగిందో, వంగిందో / రోడ్డు చరిత్ర దేశ చరిత్ర / రోడ్డు చరిత్ర మనిషి చరిత్ర/"

**– మానేపల్లి సత్యనారాయణ**

ఈ కవి విజయవాడలోని బీసెంట్ రోడ్డును గురించి చెబుతున్నాడు. ఏదీ సరళరేఖలా ఉండదు. ఈ రోడ్డు కూడా అంతే కదా. రెండు జాతీయ రహదారులను కలిపే ప్రాంతీయ రహదారి ఇది. ఫుట్‌పాత్ మీద నిల్చుని కలల వస్త్రాలు అమ్ముతున్న మానవ విగ్రహాలు ఇక్కడ దర్శనమిస్తాయంటున్న ఈ కవి –

"నీటిలో ఫలించే సూర్యకిరణాల ఛాయలే / నది ప్రమిదలో జీవ వత్తయినట్టు / ఈ రోడ్డు / నడిచే వాళ్ళని నడిపిస్తూ / శతాబ్దాలుగా ఈ రోడ్లోనే నడుస్తుంది / చాలా వంతెనల మీద రోడ్లుంటాయి / కానీ రోడ్లన్నీ వంతెనలు కాలేవు / మన ముఖంలోని రెండు కనుబొమలు / ఎప్పుడూ కలవకపోయినా / నగర వదనంలోని రెండు కనుబొమ్మలని కలిపే / ఈ రోడ్డును చూసినప్పుడు / చిన్నప్పుడెప్పుడో తెంచి పారేసిన / నా బొడ్డు పేగు / ఫుట్‌పాత్ మీద రాత్రి దుప్పటిలో / కదులుతూ కనబడింది /"

**– కె. ఆంజనేయకుమార్**

ఆ రోడ్డు భూమి శిరస్సుపై పాపిటలా ఉంది. గుండెలు మోసే దుఃఖంలోని వెచ్చని పద్యాలకి భౌతికంగా ప్రేరణ నిస్తుంది. ప్రపంచ ప్రయాణ గీతానికి ఇది వేదిక. జీవిస్తున్న శవాలు మరిచిపోయిన చైతన్యం. మనిషి స్వార్థ అగాధాలలో జారవిడుచుకున్న త్యాగం జీర ఈ రోడ్డు అంటున్న ఈ కవి –

"పట్టణం కృత్రిమ పారిశుధ్యం / పల్లె కుంపటి మీద కప్పిన నివురు / అరణ్యాల గుండెల్లోని ఆకాశ స్వప్నాలు / పెట్రోలు పోయని వాహనాల ప్రయాణ కాంక్షలు / ఎన్ని చూసిందీ రోడ్డు / తానొక చరిత్ర ఎలా ప్రవహిస్తుందీ రోడ్డు / అవ్యక్త స్థితిలో నా దేహం ముక్కలై / బాధే నా మనోకవచమైనపుడూ / ఈ రోడ్డంతా నాలో విస్తరిస్తుంది / చివరికి నేనే ఒక రోడ్డై / జీవచైతన్యం ప్రయాణానికి నన్ను పరుచుకుంటాను /"

**– కాంచనపల్లి**

ఇదీ రోడ్డు మీద విరబూసి పరిమళించిన కవిత్వం. మనలో, మన గుండెల్లో మోసే దుఃఖాలకీ, సంతోషాలకీ భౌతిక ప్రేరణగా నిలిచింది రోడ్డు. అందుకేనేమో ఈ రోడ్డుకు నమస్కరిస్తూ కవితా యాత్ర సాగించి ముగించారు 'అజంతా'. మనిషీ రోడ్డులాగే జీవించాలంటాడు సినారే. మన మనసు కోల్పోతున్న మహత్తరమైన దృశ్యాలు మనకు రోడ్డు మీద దర్శనమిస్తుంటాయంటాడు 'గోపి'. ఈ రోడ్డు చరిత్రే దేశ చరిత్రగా మనిషి చరిత్రగా చాటిన ఈ కవుల్ని అక్కున జేర్చుకుందాం! రండి!

సెల్ : 9985171411

- సౌభాగ్య
సెల్ : 9848157909



# మారియో లూజి
## (Mario Luzi)
### 1914 - 2005




మారియో లూజీ కెస్టెల్లీలో జన్మించాడు. అతని ప్రాథమిక విద్యాభ్యాసమంతా అక్కడే గడిచింది. తరువాత ఫ్లోరెన్స్ నగరం చేరి అక్కడ డిగ్రీ చదివాడు. ఫ్రెంచి సాహిత్యం అధ్యయనం చేశాడు. ఫ్రెంచి సాహిత్యంలోనే డిగ్రీ అందుకున్నాడు. అదే సాహిత్యంపై పరిశోధన చేశాడు.

సుప్రసిద్ధులైన ఇటలీ కవులతో స్నేహం సంపాదించాడు. 1935లో La barca అన్న మొదటి కవితా సంకలనం తెచ్చాడు. 1938 మొదలు పర్మా, శాన్‌మినియాటో, రోం నగరాల్లో హైస్కూళ్ళలో ఉపాధ్యాయుడుగా పనిచేశాడు.

1945లో ఫ్లోరెన్స్ నగరం చేరి కొన్ని సంస్థల్లో ఉద్యోగాలు చేశాడు. ఎన్నో రచనలు చేశాడు. 1955లో ఫ్లోరెన్స్ యూనివర్శిటీలో ఫ్రెంచి సాహిత్యాన్ని బోధించాడు.

1963-83 మధ్య ఎన్నో గ్రంథాలు రాశాడు.

1978లో 'At Fuoco dello contraoversion' అన్న గ్రంథానికి 'Viaraggio' ప్రైజు పొందాడు. 1991లో అరిస్టియోన్‌ప్రైజ్ అందుకున్నాడు. అదే సంవత్సరం నోబుల్ అవార్డుకు నామినేట్ చేయబడ్డాడు.

2004 అక్టోబర్ నెలలో ఇటలీ సెనేట్‌కు జీవితకాల సభ్యుడుగా నియమింపబడ్డాడు. తరువాత కొన్ని నెలలకే కన్నుమూశాడు.

## నలభై సమీపిస్తున్నప్పుడు

ఈ చీకటి నగరంలో, గాలి స్తంభించిన ఈ పీఠభూమిలో
ఆలోచన నన్ను అనుసరిస్తోంది, భుజం తడుతోంది
దూరతీరాల్లోని కొండల్ని చుట్టిన కోకిల పాట సగంలో తెగిపోయింది
వెంటనే ఆ నిశ్శబ్దంలో నలభై సంవత్సరాల కష్టం, విసుగు, ఆనందం
తుఫానులా ముంచుకొచ్చాయి. కాంతి, వర్షం కమ్ముకొచ్చాయి.
ఏదో ఆలస్యం, ఏదో కోల్పోవడం ఎదను కలతపెట్టాయి.
ఏవో కాంక్షలు ఎగిసెగసి పడ్డాయి
కోల్పోవడాలలో కొట్టుకుపోయాను
నేను ప్రేమించిన నాటి నించీ, నన్ను వెంబడించిన నాటి నించీ
సంవత్సరాల తరబడి నన్ను వదిలి పెట్టని అలవాట్ల నించీ
హఠాత్తుగా గాయపడ్డాను, కలతపడ్డాను.
వాటిని నేను అర్థం చేసుకునే ఆలోచనలో వున్నాను.
బాధల చెట్టు దాని కొమ్మల్ని కదిలిస్తోంది.
సంవత్సరాలు నా భుజాల మీద చీమల పుట్టల్లా పెరుగుతున్నాయి
అవేవీ నిష్ఫలంగా పెరుగుతున్నట్లు కాదు
అవి ఒంటరిగా, సామూహికంగా
ఏవో పనుల్ని నెరవేరుస్తూ వున్నాయి
అవి సజీవంగా, లేదా నిర్జీవంగా
సాదా సీదా మార్గాల్లో అజ్ఞాత ప్రపంచంలో సాగుతాయి
భూగర్భంలోకి వెళతాయి
దట్టంగా దండయాత్ర చేసే సైన్యంలా,
ఓడల గుంపులా ప్రయాణిస్తాయి
ప్రేమ నించీ, ప్రేమకు సాగే మార్గంలోనో, ఒంటరితనంలోనో
క్షతగాత్రులు ఎందరో! తండ్రులో కొడుకులో తరచి చూడాలి
ఇదంతా పునస్సమీక్షించుకున్నాకా
బతికి వున్న, మరణించిన అన్నిటితో నేను
స్వేచ్ఛగా, అనంత బాంధవ్యాన్ని ఏర్పరచుకుంటాను
వీటిని దుమ్ములో కానీ, మంటల్లో కానీ వొదిలిపెడతాను
జ్వాలల్ని దాటి మంట వీటిని ఓర్చుకోగలిగితే!




- మారియో లూజీ

# బా రహమతుల్లా కథలు 'అనుబంధాల స్పర్శ'







**బా రహమతుల్లా కథలను గురించి నలుగురు ప్రముఖ కథా రచయితల ప్రతిస్పందనలు.**

**'బందీ... పింజరేకేబినా' కథ గురించి పొట్లపల్లి రామారావు.**

నా హృదయంలో నుండి వచ్చిన భావాన్ని యధాతథంగా నీకు పంపుతున్నాను. అది నీకు ఎంతవరకు సమాజ పరిస్థితులను అర్థం చేసుకోవడానికి తోడ్పడుతుందో తెలియదు. ఇది సత్యములోని ఒక భాగం మాత్రమే. సంపూర్ణ సత్యాన్ని ప్రకటించడం కష్టం. ఏదో కొంత సత్యం, కొంత భ్రాంతి, కొంత కల్పన, ఊహ ఇన్ని చోటు చేసుకుంటాయి ఈ కథలో.

'స్త్రీ గొప్ప అనుభవమే! దానిలో సందేహమేమీ లేదు. కాని దానిని అనుభవం వరకే పరిమితం చేసుకోవడం, కేవలం అనుభవమే అనుకోవడం, దానిలో ఉన్న పెద్ద లోటు. దాని పరిధి కేవలం అనుభవం వరకే పరిమితమైతే ఈనాడు భూతలం మీద ఒక్క ప్రాణి కూడా కనిపించకపోయేది. స్త్రీ పునఃసృష్టి!

అసలు మగవాడికి స్త్రీ యొక్క గహనోద్దేశాన్ని అర్థము చేసుకోలేనంత కామంధత, కన్నులు కప్పి ఉంటుంది. అందుకే స్త్రీ అనేది ఎన్నో విపరీత సమస్యలకు పుట్టినిల్లు అయింది.

ద్రౌపదికి ఐదుగురు భర్తలైనా ఎలాంటి వైరుధ్యాలు లేకుండా వారితో తన స్త్రీ ధర్మాన్ని నిర్వర్తించింది. కాని కీచకుడిని కాలబెట్టి నేలరాచింది. లైంగిక వ్యవహారాల్లో నీతి నియమాలు ఎంతో ప్రాధాన్యత వహిస్తాయి. స్త్రీ పురుష సంబంధాలు శారీరక వాంఛల వరకే పరిమితం కావడమంత దురదృష్ట మింకోటి లేదు. దీనిలో విచ్చలవిడితనము చోటు చేసుకుంటే మరి వెగటు కలుగుతుంది.

ఈ అద్భుత ఆకర్షణను, ఈ సమ్మోహన శక్తిని వాంఛలు తీర్చుకోవడం వరకే పరిమితం చేయక, ఆకాశ వీధులకెత్తాలి.

స్త్రీలో పురుషుడు అలౌకిక అపురూప సౌందర్యాన్ని, పురుషునిలో స్త్రీ జగన్మోహనాకారాన్ని దర్శించ కలగాలి. కలవటం జరిగాక దానిలో ఎడబాటు చోటు చేసుకోవాలి. శరీరం ఒక్కటే కాక, వలపు లోకాన్ని విస్తృతము చేయాలి. అప్పుడే స్త్రీ పురుష సంబంధాలకు సఫలత.

అర్ధాంగిగా పురుషుని ఇంట పాదం మోపే స్త్రీని ముద్దుబిడ్డగా ఆదరించాలె అన్నాడు ఒక మహాకవి. భార్యను బిడ్డగా ఆదరించడము కొంత అసమంజసంగా కనిపించినా, దానిలో గంభీర సత్యము యిమిడి వున్నది. స్వగృహం, తల్లిదండ్రులు, ఇరుగు పొరుగు సర్వము విడిచిపెట్టి ఒక అపరిచితుని ఇంట పాదం మోపే స్త్రీ అంతరంగం, ఆమె కన్నుల నుండి జారే భాష్ప బిందువులే నిదర్శనం.

కన్నీటి చుక్కలు కేవలం స్వజనానికి దూరం పోతున్నాననే భావమే గాక లోతైన అర్థముంది. అపరిచిత రెండో తీర వ్యామోహంలో సుపరిచిత తీరం వదిలి, కన్నీటి ధారల్లో అడుగులు వేస్తున్న ఆఙ్జూరాలు ఆమె. సుపరిచిత తీరం వదిలిన వాళ్ళకు, ఏ రూపంగా చూసినా అపరిచిత రెండో తీరమే కదా శరణ్యం. అపరిచిత భావం, దుఃఖరూపం.

**'బుచ్చిగాని భాగోతం' కథ గురించి : పోరంకి దక్షిణామూర్తి**

సహజమైన ప్రకృతి పరిసరాల్లో మానవ సహజమైన రీతిలో జీవించే వ్యక్తి. కృత్రిమమైన కొత్త పరిసరాల్లో బతకడం ఎంత కష్టమవుతుందో, అతని మనస్సు ఎంత వికలమవుతుందో తెలిపే విషయాన్ని చిత్రించిన కథానిక 'బుచ్చిగాని భాగోతం'. పుట్టిన ప్రదేశం ఏదైనా, పెరిగిన వర్గం ఏదైనా, మతాచారాలు ఏవైనా, ఏది వున్నా లేకపోయినా మనిషికి మనస్సనేది ఎప్పుడూ ఉంటుంది. ఆ మనస్సు దానికి అలవాటైన రీతిలో సహజంగా వ్యవహరిస్తుంది.

ఒకచోట మొలకెత్తిన విత్తు అక్కడే పెరగడం వేరు. దాన్ని పీకి మరొక చోట నాటితే పెరిగే తీరు వేరు. ఆ మరొక చోటు మొక్క మనుగడకు, పెరుగుదలకు అనుకూలంగా లేనప్పుడు అది వాడిపోతుంది. తలవాలిపోతుంది. ఎండ మాడిపోతుంది. బుచ్చయ్య బతుకు అలా అవుతున్న స్థితిలో అతని తల్లి నాచమ్మ మొక్కిన మొక్కులు ఫలించాయి. అతని మనసులోని కోరిక తీరింది. గుండె నిండింది. కృత్రిమ వాతావరణంలో సైతం నిటారుగా నిలిచే ఆత్మవిశ్వాసం కలిగింది.

పేరు ఏది పెట్టినా, ఒక మానవాతీత దైవశక్తి మీద విశ్వాసం ఆత్మవిశ్వాసం బలపడటానికి తోడుపడింది. ఆనందం కలిగించింది.

# అత్యవసరం

- పాయల మురళీకృష్ణ

గానుగు చెట్టు మీద తేనెపట్టు రేగింది
ఒక ఐక్యత ఝుమ్మంటోంది
ముళ్ళ తీగె అయితేనేం
విడిపోయిన తూనీగల దండుని కలుపుతోంది

గుడిశిఖరం మీద ఆ పావురాల గుంపు
ఎప్పుడూ ఒక్కొక్కటిగా కనిపించలేదు..
అరుస్తున్న ఆ కాకికి ఎంత నేర్పు!?..
క్షణంలోనే తనవాళ్ళను కలుపుకుంది

స్తబ్దంగా ఉన్న కొండలన్నీ
చేయి చేయి కలుపుకుంటూ
మౌనంగానే ఒక సామూహికతను ప్రదర్శిస్తున్నాయి



ప్రపంచం ఒక కుటుంబమవుతుంటే
మనిషి మాత్రం ఒంటరిగా చీలిపోతున్నాడు
ఒకప్పుడు హృదయాలను కలిపిన సాయంకాలాలు
ఇప్పటి ఏకాంతాలై శోకిస్తున్నాయి

ఇలా అక్షరాలను క్రమబద్ధంగా చేర్చగలిగే శక్తి ఉన్నట్లు
మనుష్యుల్నీ కలపగలిగితే బాగుణ్ణు...

తెల్లని కాగితంలాంటి
రేపటి సంధ్యా సమయాల్ని
కవిత్వం లాంటి జీవితంతో అలంకరించవచ్చు...

విడిపోదామనుకుంటున్న చాలావాటిని
కలపాల్సిన సందర్భం ఇప్పుడత్యవసరం

---

'మా అమ్మీజాన్, నర్గీస్, ఖైసరున్నీసా' వంటి చక్కని కథానికలు రచించి బా రహమతుల్లా 'బుచ్చిగాని భాగోతం'లో పీర్ల జాతర ఊరివాళ్ళందరికీ ఎలా పండుగ కళ తెచ్చిందో సహజంగా చిత్రించారు. ఇక్కడ మతాల 'మందు చీటీ'లతో పనిలేదు. మనిషితనమన్న మందు ఒక్కటే అందరికీ ఆనందప్రదమయింది. రహమతుల్లా అభినందనీయులు.

### 'ఫుట్‌పాత్' కథ గురించి : కేశవరెడ్డి

రాజు దైవాంశ సంభూతుడని భావించినట్టుగానే ఉదాత్త పాత్రలు ఉన్నత వర్గాలలోనే ఉంటారనీ, ఉదాత్త ఇతివృత్తాలు రాజప్రాసాదాలలోను, బంగళాలలోను మాత్రమే దొరుకుతాయని భావించే సాహిత్యకారులు ఇప్పటికీ ఉన్నారు. అయితే ఉదాత్త పాత్రలు 'అలగా' జనంలో కూడా ఉంటారనీ, ఉదాత్త ఇతివృత్తాలు గ్రామాలలోని గుడిసెలలోను, గొడ్ల కొట్టాలలోను, పట్టణాలలోని సందుగొందుల లోను, ఫుట్‌పాత్‌ల మీద గూడా దొరుకుతాయనే ఎరుక కలిగిన రచయితలు చెప్పుకోదగినంత పెద్ద సంఖ్యలోనే ఉన్నారు. అలాంటి ఎరుక కలగడానికి చాల సంస్కారం ఉండాలి. ఆ సంస్కారాన్ని రహమతుల్లా ఏనాడో సంతరించుకున్నాడని అతడు రాసిన ఏ కథ చదివినా అర్థమవుతుంది.

ఫుట్‌పాత్ కథలో 'టీ బండినే పగటి పూట వ్యాపారానికీ, రాత్రి పూట పడుకోవడానికి వాడుకునే ఎక్బాల్ ఉన్నాడు. పాన్ డబ్బాలోనే వండుకుని తిని, రాత్రిపూట అందులోనే పడుకునే కుంటి రాజన్న ఉన్నాడు. స్నానం చేయడానికి చెంబు, బక్కెట్ లేకపోవడంతో ఎత్తుగా ఉండే నల్లా కిందనే స్నానం చేసే స్వామి ఉన్నాడు. వీళ్ళను ఫుట్‌పాత్ మనుష్యులని, అధోజగత్తు మనుషులని, అలగా జనమని శిష్టులు వ్యవహరిస్తుంటారు.

ఈ మార్జినల్ పీపుల్ గురించి చదవటం నాకిష్టమైన పని. అలాంటి అవకాశాన్ని 'బా' కథల ద్వారా కలిగించిన రహమతుల్లాకు థాంక్స్.

### 'బడేంకి ఈద్' కథ గురించి : ఎ.వి. రెడ్డి శాస్త్రి

రహమతుల్లా రాసిన "బడేంకి ఈద్" కథా రూపాన్ని సంతరించుకున్న విషాద కావ్యం. ఎలెజీ పద్యరూపంలోనే ఎందుకుండాలి? అది కథగా కూడా రూపుదిద్దుకోవచ్చు కదా! అవును – అదే చేశారు రహమతుల్లా. కథ చదువుతూ వుంటే భరించలేనంత హృదయం బరువెక్కిపోతుంది. కరీమున్ మనముందే నవ్వుతున్నట్టు, మనముందే అనురాగమూర్తిగా తిరుగాడుతున్నట్టు, తను అమితంగా ప్రేమించిన ఈ ప్రపంచాన్ని వదలలేక, వదలలేక వదిలి వెళ్ళిపోతున్నట్లు – ఇవన్నీ దృశ్యాలుగా మన కళ్ళ ముందు నిలవ్వా? కరీమున్నీసా నా తల్లి అయితే ఎంత బాగుండును, కరీమున్నీసా నా చెల్లి అయితే ఎంత బాగుండును, కరీమున్నీసా నా బిడ్డ అయితే ఎంత బాగుండును అని అనుకోకుండా వుండగలమా – మనం ఫీలయ్యే పాఠకులమైతే? ఇది నిశ్చయంగా గొప్ప కథ. ఇందులో – జీవితం వుంది. జీవితాన్ని గాఢంగా ప్రేమించాలనే వాంఛ వుంది. మధురమైన జీవితాన్ని వదలలేక వదలలేక వెళ్ళిపోతున్నప్పుడు కలిగే అంతులేని వేదన వుంది. తెలుగులో ఇంత మంచి కథని చదివాక – మనం నిజంగా గర్వపడవచ్చు. మాకూ సమస్త మానవాళి హృదయాల్నీ ద్రవింపచేసే గొప్ప కథ వుంది అని రహమతుల్లా రచనా వైశిష్ట్యం అడుగడుగునా గుండె లోతుల్ని స్పృశిస్తుంది. ఎన్ని నవ్వులు, ఎన్ని నవ్వులు! ప్రపంచంలో నిజంగా యిన్ని నవ్వులుంటాయా అని ఆశ్చర్యపోమూ? ఇది గొప్ప ఎలెజీ – కథారూపంలోని ఎలిజీ. టెన్నిసన్లు, బైరన్లు – అంతా రాశారు ఎలిజీలు. అవన్నీ చదివి ఓ అనుకున్నాం. కాని ఈ రహమతుల్లా 'ఎలిజీ' చదివి – తెలుగు పాఠక ప్రపంచానికంతా వినిపించేంత గొప్పగా "ఒహో! ఏం కథ" అంటున్నాను.

కథ



# భిన్న ధృవాలు

- తమ్మెర రాధిక

**"నాన్నకు జ్వరం వస్తున్నది... ఇక్కడ చూపించాను... మన డాక్టరు గారు అన్నారు ఒకసారి పెద్ద హాస్పటల్లో చూపిస్తే బావుంటుందని. నువ్వోసారి వచ్చి నాన్నను తీసుకుపోయి చూపించు." ఫోన్లో తల్లి చెప్తోంటే "నేను తెల్లారు జామున బైల్దేరి వస్తాను యిద్దరూ బట్టలు సర్దుకుని వుండండి" అన్నాడు బోసు ఇవతల నించి.**

ఆ మాటలు మధ్యలోనే ఆపివేస్తూ –

"నాన్న ఒక్కడే వస్తారు." అంది వనజమ్మ అవతలి నుంచి

"నువ్వు కూడా రామ్మా! నువ్వు రాకపోతే నాన్నకు ఇక్కడ ఇబ్బంది అవుతుంది." అన్నాడు. అటు నుంచి ఏం సమాధానం వచ్చిందో గానీ ఫోన్ పెట్టేసాడు.

"ఏమంటోంది మీ అమ్మ!" టీ కప్పు తెచ్చుకుని టీ పాయ్ మీద పెట్టి కూర్చుంటూ అడిగింది రమ.

ఒకసారి ఆమెని నిశితంగా చూసాడు. ఇబ్బందిగా కదిలి కప్పు అందుకుంది రమ. అతని చూపు వాళ్ళిద్దరి మధ్యా మంచు దిమ్మెను నిలబెట్టింది.

"నాన్నకు జ్వరం వస్తున్నది. నేను రేపు ఇంటికి పోతున్నాను."

"పోయి!!" నొసలు ముడివేసింది.

"వారం రోజులు ఇక్కడ వుంచి పరీక్షలూ అవీ చేయించాలి ఆయనకు."

"ఆమె వాస్తోందా!"

బోసు జవాబివ్వకుండా గదిలోకి వెళ్ళిపోయాడు నిరసనగా.

తన ప్రశ్న తన సంస్కారాన్ని ఎత్తి చూపిస్తున్నట్టుగా బీరు పోయిందొక్క సారి.

అత్తగార్ని చూస్తే అదో రకమైన భయం, ఎలర్జీ రమకు. ఒక రకంగా తిరస్కార భావం. అత్తగారు ఏ భావాన్నైనా పూర్తిగా అనుభవిస్తున్నట్టుగా, స్థిరమైందిగా, హక్కుగా చెప్పడం రమ భరించలేదు.

'మొండిఘటం' అనుకుంటూ విసురుగా లేచెళ్ళి పిల్లల గదిలోకి పోయింది. ఆడ పిల్లలిద్దరిలో ఒకరు చదువుకుంటుంటే, ఇంకొకరు కిటికి దగ్గర నిలబడి ఆకాశంలోకి నిండు చంద్రుణ్ణి చూస్తూ ఫోన్లో మాట్లాడుతోంది. తల్లి వచ్చిన అలికిడికి, కిటికీ దగ్గర నుంచి వెనుతిరిగి కళ్ళెగరేసింది. విశాల ఏమైందన్నట్టు.

మానస ఒకసారి కళ్ళెత్తి తల్లిని చూసి మళ్ళీ పుస్తకంలోకి తలదూర్చింది. 'అబ్బ పోలిక' మానసను చూస్తూ కూర్చీ లాక్కుంది. "ఏమయింది?" ఫోన్ ఆఫ్ చేస్తూ అడిగింది విశాల.

"తాతని తీసుకు వస్తున్నాడు నాన్న." అక్కసుగా అంది.

"రానీ! అయినా ఎందుకట!" విశాల ప్రశ్నించింది.

"జబ్బు చేసిందట... అందుకని వొస్తున్నాడు." రమ గొంతులో అదే విసురు.

"అమ్మా ఏంటి నీ బాధ!"

"ఊర్కోవే ఏం తెలియనట్టు. "కూతురి మీద విసుక్కుంది. పోయిన సారి వచ్చినప్పుడు నానీకీ తల్లికీ జరిగిన కోల్డువార్ వాళ్ళకు తెల్సు, అయినా దాన్ని అధిగమిస్తూ

"నానీ తాతతో ఇక్కడికి రావడం లేదు. అది నాన్నకు బాధేస్తోంది."

మానస మాటలకు ఆశ్చర్యపోయి –

"నీకు ముందే తెల్సా ఆవిడ రావట్లేదనీ?" అడిగింది రమ.

"నాన్నకు తెలియదా మీరిద్దరూ ఒకరికొకరూ సర్దుకుపోరని! అత్తకు ఆయాసం ఎక్కువ, కోడలికి కోపమెక్కువా" సామెత చెప్తూ నవ్వింది మానస.

ఎవ్వరి ఆలోచనలూ లెక్కలేనట్లు బోసు తెల్లారుజామున లేచి కార్లో వరంగల్ బైల్దేరాడు.



ఎనిమిది గంటలకల్లా పర్వతగిరి చేరుకున్నాడు. బోసు వెళ్ళేసరికి తల్లి వంటింట్లో ఎర్రమట్టితో పొయ్యి అలుకుతున్నది. తండ్రి మనసాల్లో ఉయ్యాల బల్లమీద పండుకొని టీ.వి. చూస్తున్నాడు. దొడ్లో లేగ అరుస్తోంది. వరండాలో బూట్లు విప్పి లోపలికొస్తుంటే ఆ అలికిడికి రాజారావు చూసి పలకరింపుగా నవ్వి లేచి కూర్చున్నాడు.

"ఏమేవ్ బోసు వచ్చాడు ఇటురా!" లోపలికి కేకవేస్తూ –

"ఒక్కడివే వచ్చావా?" అనడిగాడు. అవునన్నట్టు తలవూపి, తల్లి కోసం వంటింటి వేపు చూసాడు బోసు.

చేతులు కడుక్కుని ఇవతలి కొస్తూ చిన్న కూజా తెచ్చి కొడుక్కు ఇస్తూ "బాగున్నావా కన్నా?" ప్రేమగా అడిగింది.

తండ్రీ కొడుకులు మాట్లాడుకుంటుంటే కాఫీ కలుపు కొచ్చింది. అది త్రాగేలోపే పేపర్ తెచ్చిచ్చాడు పనివాడు. దాన్ని అటూ ఇటూ తిప్పి తండ్రి కిచ్చి లోపలికెళ్ళాడు.

"నువ్వుల నూనె కొద్దిగా వేడిచేసి గిన్నెలో పొయ్యి. అట్లానే చెట్టుకు ఒక నిమ్మకాయ తెంపుకురా, బాబు తలకాయ మర్దనా చేద్దువు." తల్లి హడావిడి చూసి –

"ఏంటమ్మా వచ్చినప్పుడల్లా మాలీషంటావు నేనేం చిన్న పిల్లాడినా ఇంకా!" తల్లి భుజం చుట్టూ చేతులేసి నవ్వాడు.

"నీకలాగే వుంటుంది లేరా! ఆరోగ్యంగా వుండొద్దు మరీ!" అంది.

ఇంటి వెనుక నారింజ చెట్టు క్రింద కుర్చీలో కూర్చుని ఒళ్ళంతా నూనె మాలిష్ చేయించుకున్నాడు. మధ్య మధ్యలో నల్లమచ్చలావు లేగ చుట్టూ చుట్టూ తిరుగుతూ చేతులు నాకుతుంటే నవ్వొచ్చింది. కొట్టంలోని ఎడ్లు దేనికో అంబా అంటూ అరుస్తుంటే జీతగాడు వాటి ముందర గడ్డి వేస్తూ అదిలిస్తున్నాడు. చెట్ల మీద పిట్టలు నిర్భయంగా అరుచుకుంటున్నాయి. చల్లని గాలి స్వేచ్ఛగా వంటిని చుట్టుకు పోతుంటే ఆ వాతావరణంలో తనను తాను మైమరచిపోయాడు.

"ఏమానందం వుందిక్కడ చుట్టూ పేడకంపూ, చెట్ల మీద కాకుల గోలా! ఇంటి ముందు వచ్చే పోయే బస్సులూ, లారీలూ వాటి వల్ల రేగిన దుమ్ములో ఉక్కిరి బిక్కిరి చేసే ఎర్రదుబ్బా. ఇదేనా పల్లెటూరి అందాలు." మూతి తిప్పుతూ చిరాకుగా అందొకసారి పండగకు ఇక్కడికి వచ్చినప్పుడు రమ.

పనివాడు కొప్పెరతో నీళ్ళు బావి గట్టు (నూతి పళ్ళెం) మీద పెడితే బోసు స్నానం చేసి వంట గదిలోకి వచ్చాడు. దేవుడి మందిరం అందులోనే వుంటుంది. వంటిల్లు చాలా పెద్దగా, నల్లని నునుపు బండలతో, గోడకు అలమారాలతో వుంటుంది. ఆగ్నేయం మూలగా కట్టెల పొయ్యి, కాస్త ఇవతలకి కిటికీ వారగా గ్యాసు గద్దె, దాని ఎదురుగా గోడకు ఆన్చి కట్టిన బొగ్గుల పొయ్యి వుంటాయి. పూలబుట్ట నిండుగా మల్లెపువ్వులు, తెల్ల చామంతులూ, సంపెంగలూ కోసుకొచ్చి పెట్టాడు పనివాడు. పీటమీద కూర్చుని చాలా సేపు పూజ చేసాడు పువ్వులతో, మధ్య మధ్యలో కుంపట్లోని ఫిల్టర్ కాఫీ వాసనా, కుక్కర్‌లోని ఇడ్లీ వాసనా అతనికి హాయిగా వుంది. పూజ కానిచ్చి లుంగీ కట్టుకుని వచ్చేసరికి వూళ్ళోనే వున్న బాబాయి, అతని కొడుకూ వచ్చి వున్నారు.

"ఇంటి ముందు కారు వుంటేనూ... చూసి పోదామని వచ్చాం." బాబాయి పేపరు చదువుతూ అన్నాడు.

"ఆс... నాన్నకు ఆరోగ్యం సరిగా లేదని అమ్మ ఫోన్ చేసింది... తీసుకుపోదామనుకుంటున్నాను." అన్నాడు బోసు.

"వదిన ఇక్కడ చూపిస్తూనే వున్నది కదా! కొద్దిపాటి జ్వరమే అనుకుంటా!"

"చెప్తే వింటాడా మీ అన్న... ఏం లేదన్నా ఏదో వుందన్న అనుమానమేనాయె." వనజమ్మ మాట పూర్తి కానేలేదు విశాలరావు నవ్వుతూ–

"అట్ల చెప్పు .. మనవరాళ్ళను చూడాలనిపించిందేమో!" అన్నాడు విశాలరావు. వాళ్ళు టిఫిను చేసి వెళ్ళిపోయినాక బోసు తల్లిని కూడా తమతో పాటు వస్తే తండ్రికి సహాయంగా వుంటుందని సూచించాడు. వనజమ్మ గూట్లో వున్న కాగితాల బొత్తికి నంబర్లు సరిగా వున్నాయా లేవా అని సరి చూసుకుంటూ కొడుక్కు జవాబివ్వలేదు.

"అమ్మా!" చిన్నపిల్లాడి మాదిరి పిల్చాడు.

"అమ్మకు రాయడమే సరిపోతున్నది. ఏదో పత్రికకు కథ రాయాల్నట. అందుకని మన పల్లెలో వున్న పేదోళ్ళ జీవన విధానం

ఎట్లా వుంటుందో తెలుసుకోవాలని రోజూ ఎవర్నో ఒకర్ని పిలిచి మాట్లాడుతుంటుంది." రాజారావు మాటలకు వనజమ్మ –

"మీకన్నీ తెలుసు.. కేవలం చెకప్‌కు పోవడానికి నేనెందుకు చెప్పండి? అక్కడ కోడలున్నది.. పిల్లలున్నారు. వాళ్ళే చూసుకుంటారు. జ్వరందేవున్నది మీరు లేచి తిరుగుతూనే వున్నారు కదా!" అంది నిరాసక్తిగా. బోసు మనసులోనే ఆశ్చర్యపడ్డాడు. తల్లి అంత నిర్లిప్తతగా ఎందుకుందో అతనికి అర్థమయ్యింది. పోయినసారి తల్లీ తండ్రి వచ్చినప్పుడు ఎప్పుడూ తలుపులు వేసుంచద్దు అని ఇంటి ముందు తలుపులు తీసుంచేది వనజమ్మ. ఆడపిల్లలున్నారు ఇది అపార్టుమెంట్ అలా తలుపు తీసుంచొద్దు అని రమా వాదించుకునే వారు. ఇంట్లో అందరూ ఎవరి పనులు వాళ్ళు చేసుకుని పోతూ మాటామంతీ లేకుండా వుండటం ఆమెకస్సలు నచ్చలేదు. ఆమె మాట్లాడబోయినా పక్కవారు వింటారు, ఎదుటివారు వింటారు అని విసుక్కోవడం బాగనిపించలేదు. వాళ్ళు నలుగురూ తామిద్దరూ తప్ప వేరే పురుగు రాదాయింట్లో! ఎలాంటి కాలక్షేపం జరక్క నానా బాధలు పడింది. ఎంతసేపూ గాజు సామాను తుడుచుకోవడం, టీవీలు చూడ్డం, పడుకోవడం, సెలవు రోజయితే పది గంటల దాకా లేవకపోవడం చాలా గిజాటు పడింది వనజమ్మ.



పదిరోజులు వుంటే పదిసార్లు దిగులు పడింది. పదిసార్లు చిరాకు పడింది. తల్లి ఏదయిన అంటే రమ దానికి వ్యతిరేకం చేస్తుంది. చాటుగా రమతో ఎంతో మొత్తుకునేవాడు బోసు, అమ్మ వెళ్ళేదాకా కాస్త నిదానంగా వుండమని. పిల్లలు నానీ వైపు వత్తాసు పలకడం రమకు చాలా అసహనంగా వుండేది. మొత్తానికి వాళ్ళు ఉన్న పది రోజులూ కత్తి మీద సాములానే గడిచిందనవచ్చు. అందుకే రానంటోందా అమ్మ! తను అమ్మ దగ్గరికి వస్తున్నాననగానే ఎంతో ఆరాటంతో ఏమేమో చేసి పెట్టే అమ్మ తీరా తన యింటికి రమ్మనగానే ఇష్టపడనట్టు మౌనంగా వుండిపోతుంది. ఏదో వంకతో తప్పించుకోవాలని చూస్తుంటుంది.

"నీకక్కడ ఇబ్బంది ఏంటి చెప్పమ్మా! అక్కడ నీ కోడలు ఆఫీసుకు వెళ్ళాక, పిల్లలు కాలేజీకి వెళ్ళాక పగలంతా నాన్న ఒక్కడే ఇంట్లో వుండాల్సి వస్తుంది మరి..." నచ్చ చెబుతున్నట్టు అన్నాడు బోసు.

కొడుకు దగ్గర కూర్చుని భుజంమీద చెయ్యి వేసి – "అనవసరంగా ఎందుకు వర్రీ అవుతావు! నా గురించి ఇంట్లో రాద్ధాంతం చేసుకోవద్దు. వాళ్ళకు నన్ను శత్రువుగా మార్చొద్దు" అంది వనజమ్మ.

"అదేంటమ్మా!" ఆశ్చర్యపోయాడు బోసు.

"అవున్రా... నాకు మరీ చేతగానప్పుడు చూద్దాం గానీ, ఇప్పుడు అక్కడేం వుందనిపిస్తోంది. తుడిచిన వస్తువులే తుడవడం, డైనింగ్ టేబుల్ని జాగ్రత్తగా నీటుగా సర్దడం, గ్యాసూ, ఓవెన్నూ పొందిగ్గా వుంచడం, కట్లెరీ సామాగ్రిని అందంగా అమర్చడం... ప్చ్... నా వల్ల కాదురా... అట్లా ఎవరన్నా చేస్తున్నా చూడాలన్నా నావల్ల కాదు. పిల్లలకు కూడా వేరే యావగేషన్స్ లేవు. ఎంతసేపు కాలేజీకి వెళ్ళి రావడం, వాళ్ళకు తోచిన సామాన్లు తుడవడం, సర్దడం, ఎవరైనా వస్తే అవి చూసి వాళ్ళను మెచ్చుకోవడం.." తల్లి మాటలకడ్డొస్తూ...

"మరేం చెయ్యాలి వాళ్ళందరూ!" ఏం పాలుపోక అడిగాడు.

"వాళ్ళేం చెయ్యాలి అని కాదురా, నేనక్కడ ఇమడలేనంతే.' ఇక్కడ ప్రొద్దున్నే పాలు పిండించీ, బావి నూతిపళ్ళెం మీద హాయిగా స్నానం చేసి, చెట్లకున్న పూలు తెంపుకుని పూజ చేసుకుని, కుంపట్లో కాఫీ కాచుకొని తాగుతామిద్దరం. దొడ్లో కూరగాయలు తెంపుకొచ్చుకుని వంట చేసుకుంటుంటే ఎవరో ఒకరు వస్తూనే వుంటారు. వాళ్ళ కష్టం సుఖం వింటూ భోంచేసాక మీ నాన్న పొలాల వైపు పోతే నేను నా రాతపని కొనసాగిస్తాను. అవ్వన్నీ అక్కడ జరగవు. ఓ చెట్టూ చేమా వుండదు. ధారాళంగా వెలుతురూ వుండదు... వచ్చేపోయే జనం వుండరు."

"ఏంటమ్మా నువ్వు? నాలుగు రోజులు వచ్చిపోయే దానికి ఇన్ని కారణాలు చెప్తున్నావు?" నిష్ఠూరంగా అన్నాడు బోసు.

"నాలుగు రోజులైనా నిర్బంధ జైలురా అది... ఎప్పుడూ తలుపు లేసి వుంచాలి యింటికి... మనుషుల హృదయాలకీనూ.."

"నీ కోడలు గురించి నువ్వు పెద్దగా పట్టించుకోవాల్సింది లేదమ్మా! ఆమె పెరిగిందా సంస్కృతిలో, నువ్వు పెరిగిందీ వాతావరణంలో. నువ్వు ఆరు బయల్లో పెరిగితే, ఆమె మూసిన తలుపుల వెనుక పెరిగింది అంతే తేడా?" తల్లి భారాన్ని తేలిక చేసే ఉద్దేశ్యంతో అన్నాడు బోసు.

వనజమ్మ లేచి వంటింటిలోకి వెళ్ళింది భోజనం తయారు చెయ్యడానికి.

"మీ అమ్మకు ఇక్కడ చాలా బాధ్యత వుందిలే. పట్టుదలగా నవల రాస్తోంది. అది పూర్తయ్యేవరకూ ఎక్కడికి రాదు" అన్నాడు రాజారావు వాతావరణం తేలిక చేస్తూ.

సాయంకాలం తల్లి చేసిచ్చిన సున్నుండలూ, మొక్కజొన్న గారెలూ తీసుకుని తండ్రితో పాటు వెళ్ళిపోయాడు బోసు.

వారం రోజుల తరువాత భర్తతో పాటు కారు దిగుతున్న మనవరాళ్ళని చూసి నవ్వుకుంది వనజమ్మ. ముచ్చట్లయ్యాక ఊళ్ళో వున్న బంధువుల ఇళ్ళకు నానీతో కల్సి వెళ్ళొచ్చారు. రెండ్రోజులు వరుసగా ఇంట్లో ఆమె చేసే పనులలో సాయపడుతూ పాత పెట్టెలో వున్న అల్లికలూ, కుట్లూ వున్న బట్టలు చూసి ఆశ్చర్యపోయారు.

"నానీ.. ఈ డిజైన్లు ఇప్పటి చుడీదార్లకు అప్లయ్ చేస్తే ఎలా వుంటుందంటావూ?" మానస ఆలోచనకు భుజం తట్టి –

"రెండు రోజుల్లో నేర్పిస్తాను" అంది వనజమ్మ. పనివాళ్ళ చేత అవన్నీ ఉతికించి పట్టుకుపోతానన్నది మానస. దొడ్లో వేసిన ఆకుకూరల మళ్ళూ, కాయకూరల మళ్ళూ చూసి కేరింతలు కొట్టారు.

వేపచెట్టుకు ఉయ్యాల కట్టిస్తే సంతోషంగా ఊగారు.

పౌర్ణమి వెన్నెల రోజు తులసి కోట దగ్గర కంచాలు పెట్టుకుని తాతతో సహా క్రింద కూర్చుని వేడి వేడి భోజనం తింటూ బాగుందన్నారు.

# నానీలు

## - సోమిశెట్టి వేణుగోపాల్



బోసి నవ్వులకు
విరామం
పాపాయి
పవళిస్తోంది

గట్టుమీద
చేప పిల్ల
కమనీయ భావంకై
కవి తపన

పురుగుల్లో
మిస్ ఇండియా
ఆరుద్ర పైన
క్యాట్ వాక్

'చెడు'కి
చికిత్స చెయ్యాలి
'మంచి'కి టీకా
వేయించలేదు

శతాబ్దాల వృక్షం
క్షణంలో మాయం
మట్టి నిర్మించింది
మనిషి నిర్మూలించాడు

ముత్యాల జల్లు
మెరిసింది
వర్షం వెనకాలే
నీరెండ

హరివిల్లును
సంధించి వదిలాడు
సూర్యుడు భుజాన
మేఘం అమ్ముల పొది

పడవలో
నిండు సూర్యుడు
సింధూర సింధువులో
పడమటి తీరం

గ్రామం, నగరం
సంధి చేసుకున్నాయి
గొప్పతనాల గొడవలు
ముగిసాయి

అతివృష్టి అని
ఆడిపోసుకోకు
సృష్టికి వృష్టే
మూలాధారం

నిజానికి
అన్నదాతే
నైజానికి మాత్రం
ఆకలి దూత

రావోయి
అనుకోని అతిథి
చైత్రమాసంలో
చిరుజల్లు

పుకారు మేఘం
ఉరిమింది
అనుమానపు బీజం
మొలకెత్తింది

చెట్టుకు తోడు
గూడుకు నీడ
ప్రకృతి నుండి
పరస్పర సహకారం

నా అనుమానం
అమ్మ తీర్చింది
బాల్య స్మృతులకు
డిక్షనరీ

---

రాత్రి చంద్రుడి వెలుగుల క్రింద మంచాల మీద పడుకుని ఆకాశంలోని చుక్కలు లెక్కబెడుతూ పడుకోవడం చాలా నచ్చింది వాళ్ళకు.

వాళ్ళు వెళ్ళే రోజున –

"అసలు ఇక్కడుంటే టైమే తెలియలేదు నానీ, అక్కడ కాలేజీకి వెళ్ళొచ్చి ఇంట్లో ఏ పని చేసినా బోర్ కొడుతుండేది" అన్నారు ఇద్దరక్క చెల్లెళ్ళు.

ఆ మాట వాళ్ళ నోటిమీంచి ఎప్పుడు వస్తుందాని ఎదురు చూసిన వనజమ్మ విజృంభించింది.

"నిజమేనే ఈ బోర్ అనేది ఎంత భయంకరమంటే మన జీవితాల్లో విషాదం మనం మరణించడం కాదు, మనం బ్రతికుండగానే మనలోని సృజనాత్మకత నశించిపోవడం చావుతో సమానం. మనలో ఎన్నో నైపుణ్యాలు వున్నా కూడా వాటిని గమనించం. ఉన్న టైమంతా టీవీలు చూడ్డంలో వృధా చేసుకుంటాము. మనలో ఏదైనా శక్తివంతమైన ప్రతిభ వుంటే దాన్ని పదును పెడితే అసాధారణ ప్రతిభావంతులం అవుతాం. దానివల్ల మనకే కాదు మన చుట్టూ వున్న పదిమందికి ఉపయోగం వుంటుంది. ఆ ఏం చేస్తాం లెద్దు అనుకుంటే మనకంటే పనికిమాలిన వాళ్ళు ఎవరూ వుండరు" అంది వనజమ్మ.

"ఇన్ని ఆలోచనలున్న దానివి అమ్మకెందుకు దగ్గర కాలేకపోయావు? మీరిద్దరూ పరస్పరం మారలేదెందుకూ?" విశాల సూటిగా అడిగింది నానీ భుజం చుట్టూ చేతులేసి కౌగలించుకుంటూ.

"అమ్మ ఏ లక్ష్యాలతో పని చేస్తోందో నాకెలాంటి అయిడియా లేదు. ఆ బస్తీలో ఆమె లోకం ఆమెది. కడిగిందే కడుగుతూ, తుడిచిందే తుడుస్తూ, శ్రద్ధగా టీవీ చూస్తూ ఆచీ, తూచీ మాట్లాడుతూ కొలతల ప్రకారం తింటూ .. అబ్బబ్బా.. ఒక నేలా లేదూ.. ఎండా రాదూ. పూలమీంచి వచ్చేటి చల్లని గాలులూ లేవు. పక్షుల అరుపులూ లేవు. మధ్యాహ్నాలు వాకిట్లోని చెట్టు క్రింద ఎండకు కళ్ళు చికిలిస్తూ వేడి వేడి టీ త్రాగుతుంటే వున్న మజా నాకెందులోనూ కన్పించదు తెల్సా! నా లోకాన్ని విడిచి నేనుండలేనట్టే, ఈ పల్లెటూర్లో మీ అమ్మా ఇమడలేకపోయింది. అందుకే పండగలకూ రావడం మానుకుంది. ఆమె లోకాన్ని నేను ప్రశ్నించకూడదని కొన్నాళ్ళు నేనే అక్కడికి వచ్చేదాన్ని, ఆ వాతావరణం నాలోని అసహనాన్ని మరింత పెంచిందే తప్ప నాలో మాత్రం మార్పురాలేదు. అప్పుడే నిర్ణయించుకున్నాను మావి రెండూ భిన్న ధృవాలని. అయితే మీ అమ్మ ఇక్కడకు రాకపోవడాన్ని నేనర్థం చేసుకున్నా, నేను అక్కడకు వచ్చి వుండనని మీ అమ్మ కోపం తెచ్చుకోవడంలో ఏ మాత్రం న్యాయం లేదని నా అభిప్రాయం." వనజమ్మ మాటలకు మనవరాళ్ళిద్దరూ కరెక్టు... కరెక్టు.. అంటూ చప్పట్లు కొట్టి నానీని ముద్దు పెట్టుకున్నారు. కార్లో సామాను సర్దుతున్న పనివాళ్ళు అది చూసి నవ్వుకున్నారు.

బోసు పిల్లల్ని తీసుకుపోవడానికి వస్తూ వారం రోజులు ఇక్కడ వున్నందుకు మొహాలు వేళ్ళాడేసుకుని అసహనంగా వుంటారు అనుకున్నాడు. తీరా ఇక్కడ చూస్తే ఇలా సంతోషంగా వున్నారు.

బోసు తల్లితండ్రులకు టాటా చెబుతూ కారెక్కాడు. ■

# మనిషొక్కడే విడిగా మనలేడు

# కావ్యం - పర్యావరణతత్వం

- మోకా ప్రతాప్




మనిషొక్కడే విడిగా మనలేడు కావ్యకర్త అంగళకుర్తి విద్యాసాగర్. వీరు రాష్ట్రంలో సీనియర్ ఐ.ఎ.ఎస్. అధికారి. వీరు తెలుగు కవితా లోకంలో తనదైన రీతిలో గుర్తింపు పొందారు. మనిషొక్కడే విడిగా మనలేడు, విశాఖ... నా విశాఖ! నగరానికొచ్చిన నాగళ్ళు, దీగుడు కింద అద్దప్పెంకు, అనే వచన కవితా సంకలనాలు, భద్రాచలం మన్నెం కథలు అనే రచనలు వీరి కలం నుంచి జాలువారాయి. 'మనిషొక్కడే విడిగా మనలేడు' అని రచయిత ఈ కావ్యానికి శీర్షిక పెట్టడంలోనే అతని ప్రతిభ వ్యక్తమవుతుంది. ఈ కావ్యంలోని తొమ్మిది అధ్యాయాల్లో వీరు ప్రబోధించిన పర్యావరణతత్వం ఎంతో విలువైంది. విలక్షణమైంది. ప్రకృతిలోని సమతుల్యాన్ని కాపాడటం కోసం విభిన్న దృక్కోణాల్ని ఆవిష్కరించారు.

నేడు పల్లెల్లో, పట్టణాల్లో, వాతావరణ కాలుష్యం వల్ల అనేక వ్యాధులతో మానవులు అస్వస్థతకు లోనవుతున్నారని వివరిస్తూ 'బందీ' అనే కవితలో....

"పైన పొగల విషం - కింద నీళ్ళు విషం
నలుమూలల గాలివిషం - మధ్యన ఊపిరి పీల్చే
నా ఎద నిండా విషం విషం - గరళకంఠుణ్ణై పోయాను
గంగావతరణం మాత్రం - కనుచూపు మేరలో కన్పించడం లేదు"

అంటూ భారతదేశంలోని ప్రముఖ నదులు ఎండిపోతూ... కలుషితం కావడం వల్ల నదుల నాశ్రయించి వుండే జీవావరణ వ్యవస్థ తీవ్ర విఘాతానికి గురికావడమే కాక కోట్లాది మనుషుల ఆరోగ్యాన్ని కడతేర్చుతుందంటారు రచయిత.

"నీ పక్కను నువ్వే మలినం చేస్తే" అనే కవితలో ధ్వని కాలుష్యాన్ని గూర్చి వివరిస్తూ...

"మీ జీవితమంతా వికృతమైంది
పట్టణాల్లో నిశ్శబ్దమేది?
వసంత వేళల చిగురుల శబ్దం
ఎగిరే పురుగుల రెక్కల సవ్వడి
మీ నగరాల్లో కానరావు
రణ గణ ధ్వనులతో ఆవాసాలు
కఠోర నిలయాలవుతున్నాయి
నీ పక్కను నువ్వే మలినం చేస్తే
ఊపిరి దక్కక చస్తావు..." అంటూ

మానవుడి తన స్వార్థం కోసం తన వినాశనానికి తానే కారణమవుతున్నాడని చెప్పాడు. ఈ విషయాన్ని గుర్తించి పర్యావరణాన్ని కాపాడుకోవాల్సిన అవసరాన్ని గుర్తు చేస్తున్నాడు కవి.

ప్రకృతి సమతౌల్యానికి ప్రతి జీవరాశి మనుగడ అవసరం. "వానపాము" అనే కవితలో వానపాము ఉపయోగాన్ని గూర్చి -

"పేరు వానపాము - ఊరు మట్టి లోపల మౌన శిలల పక్కన
పామునని మీరవతలుంచి - కొనవేలితోటి తాకకున్నా
మీ మైల కడిగి - మట్టిని మహా ప్రసాదంగా
నేలతల్లికి పూజ చేసే - పర్యావరణపు పూజారి నేను"

అని వానపాము ప్రాశస్త్యాన్ని వివరించారు.

మానవ మనుగడకు జీవనాధారం నీరు "వర్షమా! వర్షమా" అనే కవితలో -

"వర్షమా! వర్షమా! విశ్వాత్వ హర్షమా
భూమాత సుగతికై ఆనంద భాష్పమా
నేలకు నింగికీ జలతారు వారధీ
జీవికీ ఈవికీ నువ్వు పార్థసారధీ!

నీ వెండి ధారలు మంత్రదండంలాగ
నేలతల్లిని లేపి నవజీవనం చూపి
నవ్వుతూ వెళతాయి నింగి అంచుల్లోకి

. . .

గాలికీ నేలకు చెట్ల వారధి కట్టి

ఆకులో జీవమై పువ్వులో కాంతివై

నీ బొట్టుతో జగతి రాసేవు.."

అని పంచభూతాల్ని ఏ క్రమంలో చెప్పుకున్నా, మనిషి ఉనికికి మాత్రం గాలి తర్వాత ఆధారభూతమైనది నీరే. నీరు లేకుండా భూగోళం లేదు. జీవరాశి లేదని, నీటి అవసరాన్ని తెలియజేశారు.

చెట్ల ఔన్నత్యాన్ని గూర్చి "పిచ్చి మొక్క మంచి మనసూ" అనే కవితలో -

"పిచ్చి మొక్కా గొప్ప మనసూ - రెండు మహా నేస్తాలు

ఎవరి చేయి పడని - ఆ మొక్క పిచ్చిది

ఎవరికీ అందని - ఆ మనస్సు గొప్పది

పిచ్చి మొక్క తన దారిన - ప్రపంచాన్ని కాస్తుంది

గొప్ప మనసు ప్రతివారిని - తనవారిగ చూస్తుంది" అంటూ

మానవాళికి ఉపకరించే వృక్ష సంపదను సంహరిస్తుంటే పిచ్చి మొక్కే తనవంతు కర్తవ్యంగా మానవ మనుగడకు ఆధారమవుతుందని వివరించారు కవి.

ప్రకృతిలో మట్టికీ, మట్టిలోని సారానికీ, అది అందించే ఫలసాయానికీ ఎంతో ప్రాముఖ్యం ఉంది. మట్టికి, మనిషికి విడదీయరాని అవినాభావ సంబంధం వుంది "మట్టి" అనే కవితలో

"ఈ మట్టికి పాకే శక్తి

ఎగిరే రెక్కలు - పాడే గొంతు

పసిడి రంగులూ - గుబగుబలాడే గుండె

దారి చూపగల మేధస్సూ - నింగిని కడలిని రెండు చేతులా

కౌగిలించుకొనే సరసోద్వేగం ఉన్నాయి" అంటూ మట్టిని మానవ జీవనానికి మార్గదర్శిగా అభివర్ణించారు.

మానవ సమాజంలో కుల, మత, వర్గ ప్రాంతీయ భేదాలు సామాజిక కాలుష్యమేనని "మేధా దౌష్ట్యం" అనే కవితలో -

"మేధా దౌష్ట్యం ప్రగతి సూత్రమని

దురాక్రమణలే విజయగాథలని

అనర్గళంగా సిద్ధాంతించిన

పాలకుల వక్రం - వెయ్యేళ్ళ చక్రం

అమానుషంగా పరిభ్రమిస్తే

వాసం గ్రాసం కృశించిపోయి

ఆశ వలయపు పీటముడుల్లో

చిక్కి లయించే బహుజనజాతులు

ఊరువాడల - చేద బావిలో నీరు నిషిద్ధం..."

అంటూ తరతరాలుగా పాటించే కుల వివక్షతల్ని వారి సంకుచిత స్వభావాల్ని ఎత్తిచూపారు. ఈ వివక్షతలు వారి వారి సామాజిక కాలుష్యమని కవి భావన.

సామాజిక సహజీవనానికి, సుఖ జీవనానికి భావజాలం అందించిన మహానుభావుల్ని స్మరించడం, స్తుతించడం, స్మృత్యాంజలి ఘటించడం ప్రపంచవ్యాప్తంగా ఏ సాహిత్యంలోనైనా కన్పించే ధోరణే. ఆఫ్రికా ఖండంలో నైజీరియా దేశానికి చెందిన కెన్‌సారోవివా నోబుల్ బహుమతి పొందిన గొప్ప కవి రచయిత. మానవ చరిత్రలో పర్యావరణ పరిరక్షణ కోసం పోరాడిన గొప్ప పోరాట యోధుడు. షెల్ ఆయిల్ కంపెనీ వల్ల కలుగుతున్న అపార నష్టానికీ, జీవావరణ కాలుష్యానికి, తీవ్ర ప్రతిఘటనా పోరాటం చేసినందుకు ప్రభుత్వం ఈయన్ను ఉరి తీసింది.

ఈయన్ని స్మరిస్తూ విద్యాసాగర్ పదకొండు కవితలు రాశారు.
:

"కవీ కెన్ సారోవివా! పర్యావరణ పోరాటరవీ

నా గుండెకు నీ స్వరమివ్వవా! ఆదిమానవుని కాయువు పోసిన

ఆఫ్రికా ఖండం వనసీమల్లో ఒకటై వెలిగిన ఒగొనీ రాజ్యం

భావి మానవుని కాటపట్టుగా విలసిల్లాలని పర్యావరణం ప్రజల సొత్తనీ

స్వజాతి జనులే నిర్ణాయకులని నిర్ద్వంద్వంగా చాటినవాడా!"

అంటూ కెన్ సారోవివా పర్యావరణ పరిరక్షణ కోసం చేసిన సేవల్ని శ్లాఘించారు.

ఆ విధంగానే కెనడా దేశం క్విబెక్కు ప్రాంతంలో ప్రభుత్వం చేపట్టిన జలవిద్యుత్ ప్రాజెక్టు వల్ల ఆ ప్రాంతానికి తీరని నష్టం జరుగుతుందని ముత్తయ్ కూన్‌కోం ఉద్యమించాడు. ఫలితంగా ప్రభుత్వం ఆ ప్రాజెక్టు నిర్మాణాన్ని విరమించుకుంది. "ముత్తయ్ కూన్‌కోం" అనే కవితలో ఆయన చేసిన పర్యావరణ ప్రబోధాన్ని ప్రస్తావిస్తూ -

"సహజీవనం సంతోషంగా

పరిసర రక్షణ పరమావధిగా

పంచభూతాల ప్రాణమిత్రుడై

పర్యావరణపు సమరవీరుడై

గొలియాత్ అంతటి కెనడా ప్రభుతకు

దావీదువలె ఎదురు నిలిచిన

ముత్తయ్ కూన్‌కోం జనమణియే' అంటూ బైబిల్‌లో గొలియాత్ దురంతరాల్ని దావీదు ఏ విధంగా ఎదుర్కొన్నాడో అదే విధంగా కెనడా ప్రభుత్వ పర్యావరణ పరిరక్షణకు విరుద్ధంగా చేపట్టిన చర్యల్ని ముత్తయె కూన్‌కోం సమర్థవంతంగా ఎదిరించాడని కవి ప్రశంసించారు.

నానాటికీ పరిణతి చెందుతున్న శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం మనల్ని ఎప్పుడూ అన్ని సంక్షోభాల నుండి రక్షిస్తుందనే గుడ్డి నమ్మకం మనకు వుండకూడదు. అలాగే కర్మ సిద్ధాంతాన్ని నమ్ముతూ పర్యావరణ సమస్యల్ని లెక్క చేయకుండా ప్రపంచ వనరుల్ని విచక్షణారహితంగా వినియోగించుకోవడం అహేతుకం అనర్థదాయకం.

అందుకే ప్రతి వ్యక్తి ఓ రుషిగా మారి పరమవేదమైన పరిసర వేదాన్ని గానం చేయడం, పావనంగా అవధరించడం, ఆచరించడం చేయకపోతే మానవ జాతికి నిష్కృతి లేదు. ఇంతవరకూ తల్లి ప్రకృతికి చేసిన కొడుకు క్షమాపణ చెప్పి, ప్రతి రక్షణలో మనమంతా భాగస్వాములమవుదాం.



## సమానత్వం

- లలితా భీమయ్య

తలరాత అనుకుంటు
తల ఎత్తనందుకు
ఆంక్షల్లో ఇన్నాళ్ళు
అణిగి ఉన్నందుకు
బాధలెన్ని ఉన్నా
బదులివ్వనందుకు
బాధ తొలిగె బాట
తెలియకున్నందుకు
నాలాగ నలిగేటి
నలుగురిని కూడదీయనందుకు
సమానత్వం కొరకు
సంఘాన్ని నిలదీయనందుకు
హక్కుల్ని సాధించ
ముందడుగు వేయనందుకు
జగతికి వెలుగులు
పంచేదెవరో అనుకున్నందుకు
సూర్యచంద్రులే లేకుంటే
చిమ్మచీకటి క్రమ్మేది లోకం
అందుకే మనమంతా చిరుదివ్వెలౌదాం
జగతికి వెలుగులు పంచుదాం
సమస్యలు లేని సమాజం కోసం
సంఘటితమై సంఘంగా
సాధిద్దాం సమానత్వం

## చిరుజీవులు



- డా॥ సి. భవానీదేవి

సినిమా రిలీజవుతోంది...
హడావుడికి ఫాన్స్ కావాలి
టి.వి. చచ్చు సీరియల్స్‌కి...
పిచ్చి ప్రేక్షకులు కావాలి
అతను పోయాడు... పిల్లలు అమెరికాలో
ఏడవడానికి పాడె మోసేందుకు
కిరాయి బంధువులు కావాలి
సాహిత్య సభల్లో ఆ కవిత్వానికి
చప్పట్లు కురిపించే వెంగళప్పలు కావాలి
పెళ్ళి జరుగుతోంది
సిల్కు లాల్చీ ధోవతితో
బడాబాబులు కావాలి
బోనాలు, బతుకమ్మలకి
వేషగాళ్ళు కావాలి
శిధిల స్వప్నాలతో
మొండిగోడల మాటునుంచి
కలల బండి లాగేవాళ్ళు
బుగ్గల మీది కన్నీటి చారికల్ని
దాచుకుని నటించే కిరాయి మనుషులు
కలర్స్ వెలిసిపోయినా కాలానికి ఎదురీదే
శిశిర పత్రాల్లాంటి బతుకు చిత్రాలు
అడిగినంత మంది... ఎక్కడబడితే అక్కడే...

## నానీలు

- మల్లవరపు విజయ
సెల్ : 9989326248



ఆలుమగల మధ్య
యుద్ధాన్ని చూసి
అనురాగం
అబద్ధమనగలమా?

కెరటం
లేచిందని మురిసిపోకు
అంతే అందంగా
తూలిపడొచ్చు

చెక్కిలి ఎర్రగా
బుర్రగా ఉండొచ్చు
కాని మనసు వాకిట్లో
స్వార్థం పొక్కిలి

సృష్టికి
మూలం ఎవరు?
ప్రకృతిలోని
స్త్రీ పురుషుల పవరు

ఆమెలో కరుణ
మళ్ళీ మూర్తీభవించింది
పురిటి నొప్పులు
మరిచినట్లు

## నాలా ...

- కె. చింతలరాయుడు
సెల్ : 7396147875



నేను కఠిన మనస్కున్నో..
కసాయివాన్నో కాను!
అప్పిచ్చి రైతన్నల బ్రతుకులు కూల్చే
వడ్డీల జలగను అసలే కాను!
నేనో ఆశావాదిని
కనికరించునో లేదో తెలియని
ఆ హతవిధినే ఆర్థిస్తూ
నా శతకోటి జనవాళికి
పిడికెడు మెతుకులు
గొంతుకు కూర్చాలనుకునే
బాధ్యతాయుత నిరుపేద రైతు నేను!
ఎండిన నా యద గుండెల్ని మరోసారి
కన్నీటితో పులిమి తడిపి
అది అప్పో, సొప్పో, ఆనక ఏ ఉరితాడో
లేదా ఏ విషగుళికో
అయినా ఆశావాదినేగా!
నమ్మినవారినీ, నమ్ముకున్న వారినీ
ఫణం చేసి ఎలాగయితేనేం
పంటనయితే పెట్టేశా...
పుచ్చిపోయిన సచ్చుగింజలు
మట్టిచాటునే మరుగైనాయి
అక్కడక్కడ మొలిచిన మొక్కలు
మండుటెండలకు చిక్కొండాయి
ఎండిన మట్టి పగుళ్ళలా
నా గుండె కూడా పగుల్లువారె!
ఇక ఏముంది
ఏడ్వలేని నా కన్నుల్లో నీరింకినట్లుగా
ఎండిన నా భూమి గుండె
పాయలుగా చీలినట్లుగా
నే వేసిన పంటలా
అది పండిన తీరులా
మా రైతు బ్రతుకుల్లా
నాలా!

# తెలుగు సాహిత్యంలో శిల్ప పర విమర్శ



- డా॥ కె. ఆశాజ్యోతి

**సాహిత్య విమర్శ సిద్ధాంతపరంగా ఆధునికమే. అంతేకాదు కేవలం వ్యాఖ్యాన సహితం మాత్రమే కాదని అవగతమవుతోంది. అలంకార శాస్త్ర రూపేణా సాగిన చర్చలో వస్తువు - శిల్పమూ ప్రాధాన్యతను సంతరించుకున్న సందర్భాలు రెండు కనబడతాయి. భరతుని నాట్య శాస్త్రంలో "విభావానుభావ వ్యభిచారీ సంయోగాద్రస నిష్పత్తి" అని రస నిష్పత్తిని చర్చించినపుడు రసం వస్తుగత అంశంగా భావించబడింది.**

"విమర్శ సంపూర్ణమైన కళా కాదు. శాస్త్రమూ కాదు. కళగా ప్రారంభమై శాస్త్ర లక్షణాలను సంతరించుకుంటూ ఉన్న సాహిత్య ప్రక్రియ.. ఒక ప్రాపంచిక దృక్పథాన్ని కలిగిన విమర్శకుడు నిర్వహించే సామాజిక బాధ్యత సాహిత్య విమర్శ" అంటారు. వల్లంపాటి వెంకట సుబ్బయ్య (జీవితం - సాహిత్యం - సాహిత్య విమర్శ, విమర్శా శిల్పం - పుట : 21) ఈ నిర్వచనం విమర్శ కళగానూ, శాస్త్రంగానూ కూడా సంచరిస్తూ, సంచలిస్తూ సాగుతూ వుంటుందని తెలుపుతోంది. కేవలం కళ మాత్రమే అయితే భౌతికానందం, కేవలం శాస్త్రమే అయితే మేధోమథనం మాత్రమే అవగలిగే స్థితీ - పరిస్థితినీ దాటి రెండందాలా రసాస్వాదన కలిగించే సౌందర్య శాస్త్రమే సాహిత్య విమర్శగా భావించవచ్చు.

సాహిత్య విమర్శ ప్రాచీన కాలంలో ఉందా? అని ప్రశ్నించుకుంటే ఆధునిక కాలంలో అంటే 19వ శతాబ్దంలో చర్చించుకుంటున్న లేదా భావిస్తున్న పద్ధతిలో లేదనీ సాహిత్య విమర్శ ఆధునిక ఆలోచనా ధోరణి అనీ, ప్రాచీన కాలంలో సాహిత్యం భారతీయ సాహిత్య మీమాంస లేదా అలంకార శాస్త్ర రూపేణా ప్రధానంగా సాహిత్య సిద్ధాంత చర్చగా సాగిందనీ అంగీకరించే అంశం. భరతుని "నాట్యశాస్త్రం"తో ప్రారంభమైన భారతీయ అలంకార శాస్త్రంలో సాహిత్య సంబంధ సూత్రంగా రస సిద్ధాంతం ప్రస్తావించబడింది మొదటిసారిగా అని విమర్శకులు భావించారు. క్రీ.పూ. ఒకటవ శతాబ్దానికీ, క్రీ.శ. ఒకటవ శతాబ్దానికీ మధ్య కాలంలోని నాట్యశాస్త్రం తరువాత భామహుడు, క్రీ.శ. 5-7 శతాబ్దాల మధ్య తన "కావ్యాలంకారం"లో ప్రతిపాదించిన ప్రతిభ, క్రీ.శ. 6-7 శతాబ్దాల మధ్య కాలంలో దండి "కావ్యాదర్శం"లో చేసిన పద్య - గద్య విభాగం, "రీతి" సిద్ధాంతాన్ని (గుణానికీ - రీతికీ మధ్య సంబంధ నిరూపణ, గుణ విశిష్ట రచనే రీతి అన్న ప్రతిపాదన) ప్రతిపాదించిన వామనుడు, "ధ్వని"ని ప్రతిపాదించిన ఆనందవర్ధనుడు, అభినవగుప్తుని అభివ్యక్తివాదం, కుంతక, క్షేమేంద్రుల వక్రోక్తి, ఔచిత్య సిద్ధాంతాలు, చమత్కార ప్రాధాన్యాన్ని చర్చించిన జగన్నాథ పండిత రాయలు శతాబ్దాల సాహిత్య తత్వానికి సిద్ధాంత చర్చ చేసిన గీటురాళ్ళు.

సాహిత్య విమర్శ సిద్ధాంతపరంగా ఆధునికమే. అంతేకాదు కేవలం వ్యాఖ్యాన సహితం మాత్రమే కాదని అవగతమవుతోంది. అలంకార శాస్త్ర రూపేణా సాగిన చర్చలో వస్తువు - శిల్పమూ ప్రాధాన్యతను సంతరించుకున్న సందర్భాలు రెండు కనబడతాయి. భరతుని నాట్య శాస్త్రంలో "విభావానుభావ వ్యభిచారీ సంయోగాద్రస నిష్పత్తి" అని రస నిష్పత్తిని చర్చించినపుడు రసం వస్తుగత అంశంగా భావించబడింది. రసలక్షణం నాయకుడు, నాయికలతో పాటు ఇతరత్రా పాత్రలు ధరించే వేషాలతో పాటు వస్తుగతమైన రసపోషణకు సంసిద్ధులుగా ఉంటారు. అభిర, లక్షణ వ్యంజనలను ప్రతిపాదించిన ఆనందవర్ధనుడు ధ్వని రూపేణా శిల్ప ప్రాధాన్యతను స్పృశించాడు.

అలంకార శాస్త్రం సాహిత్య సిద్ధాంతంగానే చరిత్రలో మిగిలి పోవడానికి గల కారణం వల్లంపాటి ఇలా వివరించారు. "చారిత్రక సిద్ధాంతాలు అభివృద్ధి చెందటానికే కాకుండా సాహిత్య సిద్ధాంతాలు అభివృద్ధి చెందడానికి విస్తారమైన ప్రజా సమూహాలు, భావ వైవిధ్యమూ ఉండాలి. ప్రాచీన భారతదేశంలో అలాంటి వాతావరణం ఏర్పడలేదు. దాదాపు కవులందరూ తమ కథా వస్తువులను రామాయణ, భారత, భాగవతాల నుంచీ గ్రహించారు. వాటిని ధర్మశాస్త్ర విహితమైన పద్ధతిలో ఆవిష్కరించారు. సమకాలీన జీవితాన్ని నిరాదరించారు. ప్రతిభ నవనవోన్మేషశాలిని అని చెబుతూనే అలంకార శాస్త్రం రచయితల ప్రతిభ బహుముఖంగా వికసించడానికి ప్రతిబంధకంగా నిలిచింది... శతాబ్దాల పాటు సంస్కృత ధోరణే అనువాదాల రూపంలో కొనసాగింది" (విమర్శా శిల్పం - పుట : 68 - 69)

వల్లంపాటి మాటల్లో ముఖ్యంగా గమనించవలసినది "సమకాలీన జీవితాన్ని నిరాకరించారు" అన్న మాటను! విలువల నేపథ్యంలో మూల్యాంకనం - పునర్మూల్యాంకనం ప్రముఖాంశాలుగా సాహిత్య విమర్శ సాగుతున్న సందర్భంలో సమకాలీన జీవితం ఆధారంగా సాహిత్య శాస్త్రం సాహిత్య విమర్శగా మారవలసిన ఆవశ్యకతను విస్మరించి గతానుగతికత్వం ప్రాధాన్యత కారణంగా భారతీయ అలంకార శాస్త్రం చాపచుట్టలా ఉండిపోయింది. సాహిత్య విమర్శగా రూపాంతరం చెందే ప్రయత్నం ప్రారంభించలేకపోయింది.

**శిల్ప విమర్శ**

ఆధునిక కాలంలో తెలుగు సాహిత్య విమర్శ "శిల్ప విమర్శ" వివేచన విపుల చర్చకు, పరిశీలనకు అవకాశం కలిగించింది. కావ్య యుగంలో తిక్కన తనది కావ్య శిల్పమని చెప్పుకున్నాడు. శారదా తనయుడు "ఒకే పదార్థమునకు వాఙ్మనః కర్మల చేత నానారూప ప్రకల్పనము శిల్పము" అంటూ కళా సృష్టి మూలాన్ని తెలిపేదిగా శిల్పాన్ని సిద్ధాంతీకరించాడు. అలంకార శాస్త్రం చర్చించే విషయాలను పరిశీలిస్తూ విశ్వనాథ సత్యనారాయణ "శిల్పం" ఆనుపానాలను శబ్ద పరిధిలోనికి తీసుకురావడానికి కృషి చేశారు. కావ్య వస్తు నిర్మాణం, కావ్య ప్రయోజనం శిల్పం ద్వారా సిద్ధిస్తాయని విశ్వనాథ అభిప్రాయం. ఏకవాక్యత, భావాల ఏకత్ర సమాయోజన, హేతు నిరూపణం, కావ్య గ్రథన కౌశలం శిల్పాంశాలుగా విశ్వనాథ భావించాడు.

"శిల్పం వ్యూహాత్మకమైనది. కథా లక్ష్యాన్ని సాధించేది శిల్పం. పాత్రలు, సన్నివేశ కల్పన, సంఘటనల మధ్య కార్యకారణ సంబంధాలు, ఘటనలకీ పాత్రోన్మీలనానికి మధ్య గల సంబంధం, సంఘటనలు - వైరుధ్యాలు నవ్యంగా, ఆసక్తికరంగా జీవిత గతి తర్కానికనుగుణంగా బహిర్గతం కావడం, కథా గమనానికి వెనుక గల సాంఘిక, ఆర్థిక, రాజకీయ, తాత్విక, నైతిక జీవిత నేపథ్యం, భౌగోళిక పరిసరాల వాతావరణం - వీటిని తన లక్ష్యానికనుగుణంగా మలచడం ద్వారా రచనలోని సందేశం పాఠకునికి అనుభూతి గాఢతతో అర్థం కావాలి" (సాహిత్యం - సౌందర్యం, పుట : 52, 53) అంటూ సూర్యసాగర్ శిల్ప రచనలోని లోతులను వివరించారు.

"కథ, నవల, నాటక ప్రక్రియలకు సంబంధించి పాత్రలు, సన్నివేశాలు, కథా వికసనం వగైరాలు శిల్పజ్ఞతకు సంబంధించినవి. శిల్పం కళగా మారాలంటే పాత్రల హృదయాలను ఆవిష్కరించాలి. అలా అయితేనే పాఠకుల గుండెలను స్పృశించడం సాధ్యం. అది జరిగితే తప్ప కళావిష్కరణ అనూహ్యం. పాఠకుల గుండెలను స్పృశించడానికి రచయితలకు ప్రధానంగా రెండు pre requisites అవసరం అనిపిస్తుంది. ఒకటి మానవ సంబంధాలను, మానవ ప్రవృత్తి వైవిధ్యాన్ని లోతుగా పరిశీలించడం. రెండు "ప్రతి మాటకీ శక్తి ఉంది, పదును ఉంది, రూపం ఉంది అన్న అవగాహనతో సరైన మాటల ద్వారా వాటికి కళారూపం ఇవ్వగలిగే శక్తి వుండటం" (సాహిత్యంలో శిల్పం పుట : 2) అని తెలుపుతూ "శిల్పం కళగా మారడం" గురించి సొదుం రామ్మోహన్ వివరించారు. పాఠక హృదయ స్పర్శ శిల్పాంశాలలో ఒకటిని తెలిపాడు. అంతేకాదు - "ప్రతి అంగుళమూ ఎంతో మెలకువతో పేర్చుకుంటూ పోతే తప్ప, మాటలు ఆచి తూచి వాడితే తప్ప, అనవసర మైన పాత్రల ప్రవేశం రసభంగానికి దారి తీస్తుందన్న అవగాహన ఉంటే తప్ప, అనుభూతి సంపదే కళలకు ఆయువు పట్టు అన్న చైతన్యం వుంటే తప్ప, శిల్పం కళగా పరిణమించదు. శిల్పాన్ని కళగా మార్చ గలిగిన వారినే నిజమైన కళాకారులంటారు. కేవలం శిల్పమే గొప్పగా వుండి కళావిష్కరణ లేకపోతే మంచి పనివాడు అంటారు తప్ప కళాకారుడు అనరు" (సాహిత్యంలో శిల్పం, పుట : 4) అని కూడా అంటారు. అనుభూతి సంపద శిల్ప నిర్మాణానికి ముఖ్యమని తెలిపారు.

**సాహిత్య తత్వాన్ని తెలిపేది సాహిత్య విమర్శ అయితే సాహిత్య తత్వం రూపొందడానికి, సాహిత్య స్వరూపం కళాత్మకంగా ప్రతిఫలించడానికి సాహిత్య విలువలు వెలికితీతకు శిల్ప విమర్శ ప్రముఖ పాత్ర పోషిస్తుంది. శిల్ప విమర్శ పద్యకావ్యాలు, నవల, కథ వంటి ప్రక్రియలకు అనుసంధానించవచ్చు.**

"శిల్ప దృష్ట్యా పరమ హీనమైన రచనలో భావాలు అభ్యుదయకరంగా వున్నప్పుడు, రాజకీయ దృష్టి మాత్రమే గల రాజకీయ నాయకులు ఆ రచనను ఆకాశానికెత్తితే, అప్పుడు జరిగే నష్టం ఒక వ్యక్తికో, ఒక రచనకో కాదు, మొత్తం తెలుగు సాహిత్యానికీ, మొత్తం అభ్యుదయ సాహిత్యానికీ!... సోవియట్ సాహితీ చరిత్రను చూసైనా మన అభ్యుదయ సాహిత్య ఉద్యమకారులు సాహిత్యంలో శిల్పానికి గల విలువనూ, స్థానాన్నీ గుర్తిస్తారని ఆశిస్తున్నాను" (సాహిత్యంలో శిల్పం, పుట : 5) అని రాచమల్లు రామచంద్రారెడ్డి భావించారు. శిల్ప దృష్టి లేని సాహిత్యం ఎంత అభ్యుదయగామి అయినా ప్రజాదరణ పొందలేదని రారా అభిప్రాయం.

"ఇతివృత్తం నుంచి శిల్పాన్ని వేరు చేయటం సాధ్యం కాదని అనుకున్న తరువాత, శిల్పంతో ప్రమేయం లేకుండా ఇతివృత్తంలోని ఒక పాత్ర గానీ, ఒక సన్నివేశం గానీ యధార్థం అనుకోవడంలో అర్థం లేదు. నా ఉద్దేశంలో అనేకమంది రచయితలు శిల్పాన్ని పోగొట్టుకొనేది జీవితంలో తాము గమనించిన కొన్ని విషయాలు తీసుకుని వాటికి బలాత్కారంగా తమ ప్రయోజనాలను జోడించడం వల్లనే" (సాహిత్యం - సౌందర్యం, పుట : 53) అంటాడు. కొడవటిగంటి కుటుంబరావు. వస్తువు - శిల్పం మమేకమై ఉంటాయని, ఉండాలని భావించాడు.

"శైలి ప్రధానంగా భాషా సంబంధమైనది. అయితే అది శిల్పాన్ని పోషించేదిగా రచయిత వ్యక్తిత్వాన్ని, రచన విశిష్టతను ప్రకటిస్తుంది. విషయాన్నీ, రూపాన్నీ రెంటినీ తీర్చిదిద్దుతుంది" (సాహిత్యం - సౌందర్యం, పుట : 53) శిల్పానికి అనుగుణంగా శైలి సాగాలనీ, సాగుతుందనీ సూర్యసాగర్ తెలిపాడు.

సాహిత్య తత్వాన్ని తెలిపేది సాహిత్య విమర్శ అయితే సాహిత్య తత్వం రూపొందడానికి, సాహిత్య స్వరూపం కళాత్మకంగా ప్రతిఫలించడానికి సాహిత్య విలువలు వెలికితీతకు శిల్ప విమర్శ ప్రముఖ పాత్ర పోషిస్తుంది. శిల్ప విమర్శ పద్యకావ్యాలు, నవల, కథ వంటి ప్రక్రియలకు అనుసంధానించవచ్చు. "శిల్ప విమర్శ లేకపోతే విమర్శకు పరిపూర్ణత కలగదు" అని శిల్ప విమర్శ గురించి ముదిగొండ వీరభద్రయ్య అంటారు. సమకాలీన సమాజగత ఆర్థిక, రాజకీయ, సాంఘిక అంశాలను సామాజిక ప్రయోజనం కోసమై, కళా విలువల ప్రాధాన్యంతో భావి తరాలకు అందజేసేది శిల్ప విమర్శ. దీనిని "విలువల శాస్త్రమంటారు" ముదిగొండ వీరభద్రయ్య. విలువల శాస్త్రమని అంటున్నపుడు అవి సాహిత్య విలువలుగా భావించి పరిగణనలోకి తీసుకున్నపుడే శిల్ప విమర్శ సాహిత్యాన్ని పరీక్షిస్తుంది, పరిరక్షిస్తుంది.

విశ్వనాథ సత్యనారాయణ శిల్ప విమర్శ ప్రారంభకులనీ, ఒకరు నాచన సోమన, అల్లసాని వాని అల్లిక జిగిబిగి వంటి వ్యాసాలు ఈ ధోరణికి ఆద్య రచనలనీ విమర్శకాభిప్రాయం. రస నిర్వహణ, నిర్మాణ మార్మికత శిల్ప విమర్శ కోణాలుగా విమర్శకులు భావించారు. మహా కావ్య గుణాలుగా భోజుడు పేర్కొన్న పదిహేనింటిలో శిల్ప విమర్శ బీజాలున్నాయని ముదిగొండ వీరభద్రయ్య అభిప్రాయం. కవిత్వతత్వ విచారంలో కట్టమంచి రామలింగారెడ్డి ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధం

# గెలుపు అంటే...

- పి. లక్ష్మణరావ్
సెల్ : 9441215989



ఎదుగుతున్న వ్యక్తిని
ఎగతాళి చేసే కుట్రలు
జరుగుతూనే ఉంటాయి
పురోగతిని పతనం చేసే
కుతంత్రాలు
రగులుతూనే ఉంటాయి
మనోస్థైర్యాన్ని దెబ్బతీస్తే
ప్రత్యర్థి కుప్పకూలిపోతాడని
దుర్భాషల తూటాల్ని
సంధిస్తూనే ఉంటారు
గేలిచేసి అవమానిస్తే
పోటీదారు వెనుదిరిగిపోతాడని
విద్వేషాల బాణాల్ని
ప్రయోగిస్తూనే ఉంటారు
కాని
ఆత్మవిశ్వాసపు జ్యోతిని
ఆరనీకు సుమా!
సూర్యుడవై
నిత్యం జ్వలిస్తూనే ఉండాలి
ఎదుగుతున్న
నిన్ను ఎగతాళి చేస్తే
జవాబు విజయంతోనే చెప్పాలి
పురోగతిని అడ్డుకునే
కుతంత్రాలు రగిలిస్తే
సమాధానం ప్రయోజకుడవై చూపాలి
దుర్భాషల తూటాల్ని
విద్వేషపు బాణాల్ని
విజయుడవై ఎదుర్కొని
విరోధుల నోరు మూయించాలి
గెలుపు అంటే...
వైరి వర్గం ఎత్తుల్ని
గుండె నిబ్బరంతో చిత్తుచేయడమే!
శిఖరమంత ఎత్తు ఎదిగి
శత్రు శిరస్సులు మోకరిల్లేటట్లు చేయడమే

---

పచ్చి శృంగారమని వ్యతిరేకిస్తే అది జీవనానుభవమంటూ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి శిల్ప పర విమర్శ కోణంలో పరిశీలించారు. వీరి "శిల్ప ప్రభావతి" పరిశోధనాత్మక దృష్టితో వచ్చిన గ్రంథం. ఈ గ్రంథం ప్రభావతీ ప్రద్యుమ్నాన్ని శిల్ప పరంగా పరిశీలిస్తూ కథా శిల్పం, కథన శిల్పం, రస శిల్పం, పాత్ర చిత్రణ శిల్పం, వర్ణనాలంకార శిల్పం, శైలీ శిల్పం, తులనాత్మక శిల్పంగా వింగడిస్తూ శిల్పపరంగా సాహిత్య వివేచన సాగవలసిన ఆవశ్యకతను గుర్తు చేశారు. వీరి కన్యాశుల్క నాటక కళ, మార్క్సిస్టు సాహిత్య విమర్శ లోతైన పరిశోధనాత్మక విమర్శ తత్వానికి మచ్చుతునకలు.

నవల - నవలా విమర్శకులు, సాహిత్య విమర్శ సూత్రం - అన్వయం, కళాతత్వ శాస్త్రం, సంపత్కుమార విమర్శ దేశీయతా భూమిక, వందేమాతరం (వస్తు శిల్పాల విమర్శ) వంటి విమర్శనా గ్రంథాలు విమర్శ అభ్యుదయాన్ని ఆకాంక్షించాయి. వల్లంపాటి వెంకట సుబ్బయ్య కథా శిల్పం, నవలా శిల్పం, విమర్శా శిల్పం గ్రంథాల ద్వారా సైద్ధాంతిక రచనా విధానాన్ని సూత్రీకరించారు. విమర్శకు గల చారిత్రక, సామాజిక అవసరాలను పరిశీలించారు. సాహిత్యాధ్యయనం చేయవలసిన అవసరాన్ని "సాహిత్య దృక్పథం" ద్వారా వి. చెంచయ్య, "సాహిత్యంలో శిల్పం" ద్వారా సొదుం రామ్మోహన్ శిల్ప పర పరిశోధనా ధోరణి, "ఆధునిక సాహిత్య విమర్శకులు - ప్రస్థానాలు" ప్రసిద్ధ విమర్శకుల భావ, రూప, సిద్ధాంత, చారిత్రక, సామాజిక దృక్పథాల విమర్శనాత్మక తత్వాలు "తెలుగులో సాహిత్య విమర్శ" ద్వారా ప్రాచీన కాలం నుండి ఆధునిక కాలం వరకు సాగిన విమర్శ ధోరణిని డా॥ ఎస్.వి. రామారావు, "సాహిత్యం - సౌందర్యం" ద్వారా మార్క్సిస్టు సౌందర్య శాస్త్రం చర్చించిన డా॥ బి. సూర్యసాగర్, వడలి మందేశ్వరరావు "పాశ్చాత్య సాహిత్య విమర్శ చరిత్ర - సిద్ధాంతాలు" శిల్ప విమర్శను, పాశ్చాత్య విమర్శ ధోరణులను చర్చిస్తూ, వివరిస్తూ సాగాయి.

కథనం, కథాశిల్పం, శిల్ప ప్రయోజనం, కథా శిల్ప మర్మజ్ఞత, ప్రయోగ శిల్పం, ప్రయోజనాత్మక శిల్పం ఉటంకిస్తూ, కథ శిల్పం కోసమా - జీవితం కోసమా అని పరిశీలిస్తూ, రెండింటి కోసమూనని అంగీకరిస్తూ, శైలి ద్వారా శిల్పం సాధించే లక్షణం ఏకవాక్యత, మాండలికం, సంభాషణ, రచయిత కంఠస్వరం, వస్తు విశ్లేషణ రూపంలో ప్రదర్శిస్తూ కథా నిర్మాణ రీతులు, శిల్ప చిత్రణం వంటి అంశాలన్నీ కొలకలూరి ఇనాక్ కథల్లో ప్రదర్శితమవుతున్నాయని తెలుపుతూ శిల్ప విమర్శను పరిశీలించి "వీక్షణం" ద్వారా తెలిపిన విహారి లోతైన శిల్ప విమర్శకు తెరతీశారు. "ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం" ద్వారా కేవలం నిబద్ధత (Commitment), నిమగ్నత (Involvement) లే కాదు నిభిడత (Inclusiveness) కూడా అవసరమని తెలిపి, శిల్ప విమర్శకు పై త్రిగుణాలు ఆవశ్యకం అన్న ఆచార్య కొలకలూరి ఇనాక్ ప్రతిపాదన ఆధునిక సాహిత్య విమర్శకు కొత్త కోణాన్ని ఆవిష్కరించినట్టయింది. "కథల బడి - కథ సాహిత్య అలంకార శాస్త్రం" ద్వారా కథా వస్తు శిల్ప పరిచయం, జీవిత పరిశీలన - కథన శిల్పం, పరిసరాల పరిశీలన - కథన శైలి శిల్పం, కథా చిత్రణా - కథన శిల్పం శైలి, కథల్లో రసం - ధ్వని, కథల్లో చరిత్ర - సంస్కృతి దృక్పథం వంటి అంశాలను విపులంగా చర్చించిన బి.ఎస్. రాములు శిల్పాన్ని సాహిత్యంలో సామాజిక అవసరంగా ఉండవలసిన, ఉంచవలసిన తీరును ప్రతిపాదించారు.

శిల్ప విమర్శ పరిణామాత్మకం. ఇతివృత్తం తన లక్ష్యాన్నీ, ప్రయోజనాన్నీ, సాధించే తీరును పరిశీలిస్తుంది. పాత్రలు, సన్నివేశ కల్పన, సంఘటనల మధ్య సాగే కార్యకారణ సంబంధాలు - మానవ సంబంధాలలోని వైరుధ్యాలు - వర్గ, వర్ణ వైషమ్యాలు - చారిత్రక, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, తాత్విక, నైతిక తత్వాల భిత్తిక పైన సాగే మానవ జీవిత నేపథ్యం - వంటి అంశాలను రచయిత తన ధ్యేయానికి, లక్ష్యానికి అనుగుణంగా సాగిస్తూ పాఠకుణ్ణి తన ఆలోచనలకు అనుగుణంగా అనుభూతి సాంద్రతను అందజేసే విధానాన్ని పరిశీలించేది శిల్ప విమర్శ. ఈ శిల్ప విమర్శ విమర్శకుడి మేధో అభిరుచిని అనుసరించి సాగుతూ - మేధో వికసన క్రమ పరిణామంలో కాలగతిలో స్థిరపడుతుంది.

ఆయా కాలాలను అనుసరిస్తూ పఠనానుభూతి సాంద్రత, ఆలోచనల తీక్షణతను కేంద్రీకృత, నిబిడీకృత రూపం ద్వారా సూచించే అంశాలు శిల్ప విమర్శను పదును పెడతాయి. సాహిత్య సంపదలోని సంపన్నత, భాష, వాక్య నిర్మాణం, శిల్ప విమర్శను పరిపోషిస్తాయి. ఆధునిక ప్రక్రియలన్నింటిలోనూ శిల్పతత్వాన్ని వెలికి తీసే శిల్ప విమర్శ నేటి సాహిత్య విమర్శను అత్యున్నతంగా నిలిపే నికషోపలం.

# అక్షరాలను అల్లుకున్న అనుభూతులు




- వీరప్రసాద్

ప్రతీ మనిషీ సృజనకారుడే. తన చుట్టూ నెలకొన్న పరిసరాల నుండి అనేకం నేర్చుకుంటూనే కొత్త ఆలోచనలు చేస్తాడు. దశలు దశలుగా అనేక అభిప్రాయాలను వ్యక్తీకరిస్తాడు. కాలగమనంలో జీవితానుభవాన్ని సంతరించుకునే కొలదీ అవగాహనను పరిపుష్టం చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. క్రమంగా తన జీవితాచరణలో అనుభవసారాన్ని ఇముడ్చుకుంటూ కొనసాగుతాడు. అయితే అక్షరశక్తిని కలిగి ఉండే కవి మాత్రం తన భావాలను అక్షరాలతో అలంకరించి పాఠకుల ముందుంచగలుగుతాడు. సినీ రచయితగా, దర్శకుడుగా తన ప్రతిభను చాటుతూనే కవిగా రూపుదిద్దుకున్నారు జనార్ధన మహర్షి. గతంలో వెన్నముద్దలు, గుడి, పంచామృతం, నాకు నేను రాసుకున్న ప్రేమలేఖ పుస్తకాలు తీసుకొచ్చిన ఆయన తాజాగా 'కవిగానే కన్నుమూస్తా' అనే పుస్తకాన్ని వెలువరించారు. జీవిత ప్రయాణంలో శ్రమిస్తూ సంతృప్తికరమైన స్థాయికి చేరిన మనిషి ఒకసారి చుట్టూ వున్న సమాజాన్ని పరికించి వాటిని వ్యక్తం చేస్తే ఎలా ఉంటుందో జనార్ధన మహర్షి కవిత్వం అలా అన్పిస్తుంది.

'ఉద్ధరించడానికా నేనీ ప్రపంచానికి రాలేదు/కానీ నువ్విలా నాశనం చేస్తే మాత్రం ఆగబోను' అని ఒకచోట వ్యక్తీకరిస్తాడు కవి. ఈ వాక్యాలు చదివిన పాఠకుడికి అనేక అంశాలు స్ఫురిస్తాయి. మనిషి ఒంటరిగా సమాజంలో తన జీవితాన్ని తను జీవించలేడు. ఒక అనివార్యమైన సామూహిక వ్యవస్థలో కొనసాగుతూ ఆ వ్యవస్థ పట్ల జాగురూకత కలిగి ఉండాల్సిన అవసరం ఈ వాక్యాలు మనకు తెలియజేస్తాయి. ఎవరైనా సమాజానికి నష్టం కలిగించే చర్యలు చేసినప్పుడు మేలుకోవడం ఒక అవసరం. కానీ వ్యవస్థ వాస్తవిక స్వరూపాన్ని అర్థం చేసుకొని మానవ సమాజానికి అత్యంత అనుకూలంగా రూపొందించడానికి వ్యక్తి పాత్ర ఒక నిరంతర అవసరం అనే స్పృహ ఉండటం ఒక దశ. ఇటువంటి ఆలోచనలను రేకెత్తించే శక్తివంతమైన వాక్యాలు ఈ పుస్తకంలో మరికొన్ని ఉన్నాయి.

సరళమైన భాషతో సూటిగా, మృధువుగా తన భావాన్ని చెప్పే ప్రయత్నం చేసారు. దానికోసం పదాల, వాక్యాల విన్యాసాలు ఎక్కడా చేయకుండా మామూలు వాడుక వచనంతో కవిత్వం రూపం తీసుకొస్తారు. సామాజికస్పృహను వ్యక్తం చేస్తూ సాగే చరణాలు పాఠకుడిలో ఆలోచనలను రేపుతాయి. 'అడవుల్ని, సముద్రాల్ని ఆక్రమించారు/అయ్యా మా గుడిసెల్ని వదిలేయండి/ పద్మశ్రీలు, పదవులు మీరే తీసుకోండి/ పిడికెడు గోధుమపిండి ఇప్పించండి...'/ వంటి వాక్యాలు కవి వేదనను పదునుగా వ్యక్తం చేస్తాయి. సమాజంలోని అసమానతల వల్ల ఏర్పడే ఇటువంటి వైరుధ్యాలను ఆవిష్కరించే పని నిజాయితీగా చేస్తారు. మానవ జీవితంలో విషాదాన్ని ప్రశ్నిస్తున్నట్లుగా కవితా చరణాలను నిర్మిస్తారు జనార్ధన మహర్షి.

కవితా పుస్తకం రూపుదిద్దిన తీరు కూడా వినూత్నంగా కన్పిస్తుంది. పుస్తక శీర్షికతో పాటు లోపలి భాగాలకు పెట్టిన పేర్లుకూడా ప్రత్యేకంగా ఉంటాయి. ప్రతీ కవితకూ శీర్షిక ఉండదు. కవితలను భాగాలుగా విడదీసి ఆయా భాగాలకు 'వెన్నముద్దలు', ప్రేయసి, అతను చెప్పిన రెండు మాటలు, ఆమె చెప్పిన కొన్ని మాటలు, గంధర్వగానం అని పేర్లు పెట్టారు. ప్రేయసి విభాగంలో కవితలకు శీర్షికలు ఉన్నాయి. ఆమె చెప్పిన కొన్ని మాటలు విభాగంలో తొలిమాట, రెండవమాట అంటూ పదోమాట దాకా కొనసాగి మరోమాట, ఇంకోమాట, చివరిమాట అంటూ రాసిన కవితలతో ఆ భాగాన్ని ముగిస్తాడు. మిగతా భాగాలకు శీర్షికలకు బదులు అంకెలు ఉంటాయి. ఈ విషయాలు ఎందుకంటే కవి తన భావాలను వ్యక్తం చేయడానికి పుస్తక రూపకల్పనలో కూడా ప్రయత్నించాడనేది చెప్పడం కోసం.

175 పేజీల పుస్తకంలో కవితలు చాలావరకూ నాలుగైదు చరణాలతోనే ఉంటాయి. అక్కడక్కడా కొన్ని రెండు మూడు పేజీల కవితలు మాత్రమే. ఒక గంటలోపు కవితలన్నీ చదివేయవచ్చు. కానీ వీటిలో కొన్ని కవితలు పాఠకుడిని ఆపేస్తాయి. కవి చెప్పిన భావాన్ని లోతుగా పరిశీలించేలా చేస్తాయి. కొన్ని అస్పష్టంగా ఉంటాయి. కొన్ని ఉత్సాహాన్ని ఇస్తాయి. 'వేల అడుగుల/ నాధైర్యం-సాహసం-జాగ్రత్తలే/ ఈ ఎత్తులోకి చేర్చింది/ ఒక్క అడుగు నా 'నిర్లక్ష్యమే'/ ఈ అగాథంలోకి పడేసింది' వంటి కవితలు పాఠకుడిలోకి చొచ్చుకుపోతాయి. జీవితం

# జాగ్రత్తరా కన్నా!

- జంధ్యాల రఘుబాబు
సెల్ : 9849753298



కన్నా!
బండి చూసుకుని నడపరా
నీవెప్పుడొస్తావోనని ఇంట్లో అందరం
ఎదురుచూస్తుంటామురా
జాగ్రత్తరా కన్నా! జాగ్రత్త

నీవు చిన్ని చిన్ని అడుగులేస్తూ వుంటే
ముచ్చటపడి మూడు చక్రాల బండీ
ఇంకొంచెం పెద్దవాడవయ్యావని
ఓ చిన్ని సైకిలూ!
ఇలా నీవు ఏది అడిగితే
అది కొనిచ్చాము నాన్నా!

నీవు బడి నుండి వచ్చేటప్పుడు
సైకిలు నుంచి పడిపోయి
మోకాలు దోక్కుపోతేనే
మీ అమ్మ విలవిలలాడిందిరా!

కాలేజీకి మోటార్ సైకిల్‌పైనే
వెళ్తానని భీష్మిస్తే
లోను పెట్టి మరీ కొన్నాము
నాన్నా నీకు కొత్త బండి

పేపర్లో టీవీల్లో వార్తలు చూస్తుంటే
గుండె జలదరిస్తుందిరా
నిద్రలో కూడా ఉలిక్కిపడి
లేస్తున్నామురా! జాగ్రత్త కన్నా!

ఈ ప్రపంచీకరణ యుగంలో
ఎన్నో వస్తువులు మన చేతికందాయని
మురిసి ముచ్చటపడేలోపు
యముని మహిషాల్లా వచ్చిన
ఈ వాహనాలు గాల్లో తేలుతుంటే
మా ప్రాణాలు పైపైనే పోతున్నాయిరా

ఇంటి దగ్గర నేనూ మీ అమ్మేకాదు
నీ ముద్దుల చెల్లి నీ గారాల తమ్ముడు
గోముగా చూసే అక్క
కేకలేసినా ప్రాణమిచ్చే అన్న
ఇలా నీ రాక కోసం వేచి చూసేవారు
నీకేమైనా జరిగితే తట్టుకోలేరురా

పదుగురికీ నీవు సాయపడాలన్న
మా ఆశయాన్ని త్రుంచివేసి
నలుగురూ నిన్ను మోస్తుంటే
చూసే నరకాన్ని మాకు చూపకురా!

అనుకోనిదేదైనా జరిగితే
మాకే కాదు
ఈ భరతమాతకు కూడా కడుపుకోతరా
జాగ్రత్తరా కన్నా! జాగ్రత్త!!

---

పట్ల ఎంతటి జాగ్రత్తను కలిగి ఉండాలో, ఏదైనా సాధించాలంటే ఎంత ధైర్యాన్ని కలిగి ఉండాలో, సాధించినదాన్ని నిలబెట్టుకోవడానికి ఇంకెంత జాగ్రత్తగా ఉండాలో అనే విషయాలన్నీ చదువుతున్న వారిలో మెదులుతాయి. జీవితం పట్ల ఇలా మెలుకువ కలిగించే కవితలు ఈ పుస్తకంలో జనార్దన మహర్షి అందంగా అమర్చారు.

అయితే ఇన్ని ప్రత్యేకతలు పుస్తకం నిండా కనిపిస్తున్నా అవసరం లేదు అనిపించే వాక్యాలు, పదాలు కూడా చాలానే ఉన్నాయి. అవి మధ్యలో గులకరాళ్ళలా తగులుతాయి. ఒక మంచి ఆలోచనను అందించే ప్రయత్నానికి ఈ లోపాలు నష్టం కలిగిస్తాయి. ఈ పుస్తకంలో చక్కటి మానవ విలువలను, ప్రేమను, అనుబంధాలను వ్యక్తం చేసే వాటితో పాటు, తాత్విక చింతనకు సంబంధించి కూడా కనబడతాయి. చివరి భాగం గంధర్వగానం లో సృష్టికర్తను ఉద్దేశిస్తూ కవిత్వం రాయడం ఉంది. ఆధ్యాత్మికత చింతన, దైవభక్తి కూడా చాలా చోట్ల ఉంటుంది. ఎవరి విశ్వాసాలు వారివైనా ఇలాంటి వాటి వల్ల మానవ చైతన్యంతో జీవన సమస్యలకు పరిష్కారాలను సాధించడం పక్కదారి పడుతుంది. ఈ పరిమితులు ఈ కవిత్వంలో వ్యక్తమవుతాయి.

'సోదరా... నక్సలైట్ తమ్ముడా!/అడవిలో నీ ఆరోగ్యం ఎలా ఉంది?/ఆయుధాల బరువు నీ భుజాన్ని వంచిందా?/అన్నీ విడిచి ఎన్నాళ్ళిలా వుంటావు?/నన్నో సలహా చెప్పమంటావా?/ మీరంతా ఇటు వచ్చేయండి/ వీళ్ళనంతా అటు పంపించేస్తా!' వంటి చమత్కారాలలో రాజకీయ అవగాహన లోపం కనిపిస్తుంది.

మహిళల వ్యక్తిత్వాన్ని గుర్తించడం నాగరిక సమాజం వేగంగా వంటబట్టించుకుంటున్నది. ఈనాటి సామాజిక నేపథ్యంలో స్త్రీల వ్యక్తిత్వస్థాయిని తగ్గించే భావాలు చెల్లుబాటు కావు. ఆ జాగ్రత్తలు గమనించకపోతే పొరపాటు భావాలు వ్యక్తమవుతాయి. 'సహస్ర ముఖాలలో స్త్రీ/ అనిబిసెంట్‌గా/సహస్ర అన్వేషణలో పురుషుడు/ ఆర్కిమెడిస్‌గా/తత్వకావ్యాన్ని/తరిస్తూ పరిస్తారు–/ప్రకృతిని/ పులకరింపజేస్తున్న/పూల రసాలతో చేసిన/ 'పన్నీటి సరస్సు/ఆడదాని మనస్సు' అని కవిత్వీకరించడంలో స్త్రీ సున్నితత్వాన్ని గ్లోరిఫై చేయడం కన్పిస్తుంది. అదే కవిత చివరలో 'పద్మినిజాతిని' అని ముక్తాయింపునిస్తాడు కవి. స్త్రీల చుట్టూ అల్లుకున్న అనేక పాతభావాల నుండి సమాజం ఎంత తొందరగా విడగొట్టుకుంటే అంత మంచిది.

'తోటి ప్రయాణికా!/మనది సందర్శనా యోగం/కలిసి ఈ యాత్రని ఆస్వాదిద్దాం/నేను చూసినవి నీకు తెలియచేస్తాను/నువ్వు అనుభూతి పొందినవి నాకూ అందివ్వు/ రవి గాంచని చోటకి సైతం మన పాదాలు సాగాలి/ చంద్రుని వెన్నెల వెళ్ళలేని చోటుని కూడా మనం చేరుకోవాలి/సముద్రం అడుగున ఉన్న ముత్యాల్ని ముట్టుకుందాం/ ఆకాశం అంచున ఉన్న నక్షత్రాల్ని తాకివద్దాం/ ఈ 'సందర్శనం'లో సృష్టి అద్భుతాల్ని ఆస్వాదిద్దాం" అంటాడు. సమాన ప్రయాణీకురాలిలా భావిస్తూ మమేకతతో ఆమె పట్ల ఆరాధన వ్యక్తం చేస్తాడు. ఇద్దరం సమానంగా జీవిత ప్రయాణాన్ని చేద్దాం అంటూ సాగిన ఈ కవిత అలరిస్తుంది. కవి భావాన్ని పాఠకుడికి హాయిగా చేరవేస్తుంది. స్త్రీల పట్ల గౌరవభావంతో రాసిన కవితా చరణాలు ఈ పుస్తకంలో చాలానే ఉన్నాయి.

జనార్దన మహర్షి మరికొన్ని జాగ్రత్తలతో ముందు ముందు మరింత కవిత్వాన్ని పండించాలని ఆశిద్దాం.

# 'నా వయసు వారు బాగా చదువుతున్నారు'

- బి. వరలక్ష్మి సుందరేశమ్

1. చదివిన నవలలు :
(1) అమృత / కవి శార్వాణి
(2) కథలు - దాదాపు 20
(3) నచ్చినవి : అన్నీ నచ్చాయి. గత నెల ప్రస్థానంలో కథ - భూతవైద్యం : డా॥ రోశయ్యగారు, ఈ కథ ఆడవాళ్ళకు జరిగే అన్యాయాలకు అద్దం పట్టేలా వుంది.
2. కవిత్వము చదివాను. కావ్యాలు చదివాను. ప్రస్తుత సామాజిక సమస్యల్ని ప్రతిబింబించే విధంగా వున్నాయి.
3. విమర్శలు పుస్తకాల్లో చదివాను. పాలుపంచుకున్నాను. మా కుటుంబ సభ్యులు - స్నేహితులు - మానవ విలువల్ని పెంచే విధంగా రచనలు యింకా ఎక్కువగా రావాలనిపిస్తుంది. సరైన మానవ సంబంధాలతో సమస్యలు కొంతవరకు తీరగలవనిపిస్తుంది.
4. దినపత్రికలు, సాహిత్య పత్రికలు చదువుతుంటాను. కవుల జీవితాలను గురించిన విషయాలను - వారి రచనా శైలిని యిష్టంగా తెలుసుకుంటాను. "సాహిత్య ప్రస్థానం" నాకు నచ్చిన పత్రిక.
5. నా సాహిత్య పఠనం పెరిగిందనే చెప్పాలి.
6 కుటుంబ సభ్యులు, బంధుమిత్రులు, సన్నిహితులు అందరూ సాహిత్య ప్రియులే. అప్పుడప్పుడు సాహిత్యంపై విమర్శలు చేస్తుంటాము.
7. సాహిత్యాభిరుచి బాగా పెరిగిందనే చెప్పాలి. ప్రతి వ్యక్తి సెల్‌ఫోన్లలో పాటలు రికార్డు చేసుకుని వింటుంటే అందులోని సాహిత్యాన్ని కూడా ఆస్వాదిస్తూ ఆనందిస్తున్నామనిపిస్తుంది.
8. ఇంగ్లీషులో షేక్‌స్పియర్, జీన్ ఆస్టిన్, పెరిల్‌బక్, థామస్ హార్డీల వంటి వారి రచనలు చదివాను. ఎక్కువగా కాలేజీ చదివే రోజుల్లో
9. ఇంగ్లీషులో రాయలేదు.
10. వేదాంతము, దైవభక్తికి సంబంధించిన పుస్తకాలు, రామాయణ, భాగవతాలు, శతకాలు చదివాను. వాటిలో పూర్తిగా అవగాహన లేదు.
11. నా వయసు వారు పుస్తకాలు బాగా చదువుతున్నారు. చిన్నవారికి ఉద్యోగం, సంసారం, బాధ్యతలు కారణం అనుకుంటాను. పెద్దవారికి అనారోగ్య కారణాలు.
12. సాహిత్య గ్రంథం "సాహిత్య శిల్ప సమీక్ష" పింగళి లక్ష్మీకాంతంగారు, కొన్ని ఇతర పుస్తకాలు (1) జూపల్లి ప్రేమ్‌చంద్‌గారి కవితలు.
(1) నిచ్చెన మెట్లలోలకం (2) అవిధి (కవితలు) ఈ రెండు పుస్తకాలు శాలువతో పాటు నేను సన్మానింపబడినప్పుడు పొందినవి.
(3) కవితావాణి - శార్వాణి (4) ధర్మసందేహాలు (5) ఆకాశ దీపాలు (కవిత) ఇంకా కొన్ని పుస్తకాలు గిఫ్ట్‌గా పొందాను.
13. చదవాలనుకున్న పుస్తకాల్ని గ్రంథాలయాల ద్వారా చదువుతున్నాను.
14. ఆడపిల్లలకు అన్యాయం జరిగినప్పుడు వారికి న్యాయం చేకూరే విధంగా, వారికి అవగాహన కలిగే విధంగా వారిని జాగృతం చేస్తూ కవితలు, కథానికలు రావాలని అనుకుంటున్నాను. అనేక సందర్భాలలో పేపర్లలోను, టీవీలలోను చూస్తున్నా ప్రత్యక్షంగా సమాజంలో జరుగుతున్న సంఘటనలు మనసును కలచివేస్తాయి.
15. నేను జిల్లా రచయితల సంఘం సభ్యురాల్ని ఈ ఏడాది కొన్ని కథలు, కవితలు రాశాను. కవితల్ని సభలలో చదివాను. సన్మానాలు జరిగాయి. ఆదరణ బాగుంది. జిల్లా రచయితల సంఘం రచయితల కవితల్ని, కథల్ని పుస్తక రూపంలో తెస్తున్నారు. అందులో నేను రాసిన రచనలకు స్థానం వుందని తెలిసింది.
16. సభలు, సమావేశాలు యింకా ఎక్కువగా జరగాలి. మీ పత్రిక "డైరీ" కాలంలో అలాంటి వార్తలు తెలిసికొంటున్నాను.
17. కొత్తగా రచనలు మొదలు పెట్టినవారు అనుభవమున్న రచయితలను సంప్రదిస్తున్నారు. వారిని ప్రోత్సహించాలి. పత్రికలలో వారి రచనల్ని ప్రచురించాలి.
18. టి.వి. ఛానళ్ళలో ఇతర భాషా చిత్రాలను, గీతాలను చూస్తున్నప్పుడు వింటున్నప్పుడు ఆ భాషల గొప్పతనం తెలుసుకున్నారు. ఉదాహరణకు ఒక హిందీ పాటలో "నీవు ఆకాశంలో చంద్రుడివైతే నేను నేలపై ధూళిని" అన్న భావన చక్కగా వుంది.
19. ఇంకా గొప్ప రచనలు రావాలి. సభలు కార్యక్రమాల్ని గుర్చి బాగా ప్రచారం కావాలి. అందరికి తెలిసేలా వాటిని గురించిన విశేషాలను దినపత్రికలలో ప్రచురించాలి.
20. స్థానిక సంఘాల కార్యక్రమాలు కొన్ని ఎప్పుడు, ఎక్కడ జరుగుతాయో ముందుగా తెలియడం లేదు. అలా ముందుగా తెలిస్తే చాలామంది రచయితలు కార్యక్రమాలలో పాల్గొనే అవకాశం లభిస్తుంది.
21. నేటి పరిస్థితులను ప్రతిబింబిస్తున్న కవితలు, కథలు వస్తున్నాయి. రైతులు, నేతన్నల బాధలు గుర్చిన రచనలు ప్రసారమవుతున్నాయి. కాని అవినీతికి సంబంధించిన కవితలు, కథలు ప్రసారం చేస్తే సమాజం జాగృతం అవుతుందని ఆశ.
22. సాహిత్య ప్రస్థానం, దినపత్రికలు - ఆంధ్రజ్యోతి, ఈనాడు, వార్త, సాక్షి ఆదివారం పత్రికలు. నచ్చే పత్రిక సాహిత్య ప్రస్థానం. నారీ - భేరీ.
23. సాహిత్య ప్రస్థానం - సెప్టెంబర్ నుంచీ చదువుతున్నాను. ఇలాటి పుస్తకం ఇంతకుమునుపు నుండీ చదవడం వుంటే బాగుండేదనిపించింది. ఇప్పటికైనా ఈ పుస్తకం చదవగల్గుతున్నందుకు అనంతపురం జిల్లా కార్యకర్తలకు ధన్యవాదాలు. ఆయన ఈ పుస్తకాన్ని పరిచయం చేశారు.
24. అవినీతిని అంతమొందించే విధంగా చిన్నపిల్లల మనసులో ఆ విషయాల విత్తుల్ని నాటే విధంగా మంచి నీతికథలు మీ పుస్తకంలో రావాలని కోరుతున్నాను.
25. ప్రస్థానం కోసం, సాహిత్యం కోసం మంచి కథల్ని కవితల్ని నేను రాయాలని, వాటిని మీరు ప్రచురిస్తారని కోరుకుంటున్నాను.

# సాహిత్యరంగం తీరుతెన్నులపై మీరేమంటారు?

**2012 ప్రవేశించింది. వివిధ రంగాలలో గడిచిపోయిన ఏడాదికి సంబంధించిన సమీక్షా వీక్షణాలు జరుగుతున్నట్టే సాహిత్య సాంస్కృతిక రంగాలలోనూ సింహావలోకనం జరుగుతున్నది. అయితే సృజనశీలమైన సాహిత్య రంగంలో గతావలోకనంతో పాటు భవిష్యత్తులోకి తేరిపార చూడవలసిన అవసరం కూడా వుంది. సాహిత్య జీవులుగా మీరు ఆ విషయంలో ఏమనుకుంటున్నారో తెలుసుకోవడానికి ప్రస్థానం ఈ ప్రశ్నావళిని ప్రచురిస్తున్నాం. మీ సమాధానాలు, మరికొందరు ప్రముఖులు భావాలతో పాటు మా స్పందనను కూడా ఫిబ్రవరి సంచికలో ప్రచురించగలం.**

1. 2011లో మీరు ఏయే నవలలు చదివారు? కథలెన్ని చదివారు? ఏమైనా నచ్చాయా? ఎందుకు? మరీ ఎక్కువగా నచ్చిన వాటి పేర్లు, నచ్చని వాటి పేర్లు?
2. కవిత్వమూ, కావ్యాలు చదివారా? కవిత్వం పట్ల మీ స్పందన ఎలా వుంది?
3. సాహిత్య విమర్శలు గమనించారా? పాలుపంచుకున్నారా? వాటిపై మీ ఆలోచనలు ఎలా వున్నాయి?
4. దినపత్రికల సాహిత్య పేజీలు, ఆదివారం అనుబంధాలు, సాహిత్య పత్రికలు ఏవి ఎక్కువగా అనుసరించారు? ఏవి ఎక్కువగా నచ్చాయి?
5. మొత్తంగా మీ సాహిత్య పఠనం పెరిగిందా? తగ్గిందా? యథాతథమేనా?
6. మీ కుటుంబ సభ్యులు బంధు మిత్రులు సన్నిహితుల విషయమేమిటి?
7. నేడున్న సాహిత్యాభిరుచిపై మీ అంచనా ఏమిటి? చూసిన దాన్ని బట్టి చెప్పండి. (కేవలం మీ అభిప్రాయం కాదు)
8. ఇంగ్లీషులో ఎక్కువగా చదివారా?
9. మీరూ ఏమైనా రాశారా?
10. సాహిత్యేతర పుస్తకాల పఠనం ఏ మేరకు చేయగలిగారు?
11. మీకు తెలిసి వివిధ తరాలు (మీకంటే పెద్దవారు, మీ సమకాలికులు, మీకంటే చిన్నవారు) చదువు పట్ల చూపిస్తున్న ఆసక్తి ఎలా వుంటున్నది?
12. మీరు ఈ ఏడాది ఎన్ని పుస్తకాలు కొన్నారు? అందులో సాహిత్య గ్రంథాలెన్ని?
13. మీరు చదవాలనుకుని చదవలేకపోతున్న దొరకని పుస్తకాలేమైనా వున్నాయా?
14. ఫలానా అంశం ఎవరైనా రాస్తే బాగుంటుందని మీరు అనుకున్న సందర్భాలున్నాయా? ఉంటే ఏమిటి?
15. మీరూ కవులు, రచయితలైతే ఈ ఏడాది మీ రచనానుభవాలు ఎలా వున్నాయి? ఎలాంటి స్పందనలు వచ్చాయి? మీ రచనా ప్రణాళికలు నెరవేరాయా?
16. ఈ కాలంలో సాహిత్య రంగంపై రచయితలుగా మీ అభిప్రాయాలేమిటి?
17. కొత్తగా రచనలు మొదలు పెట్టినవారి అనుభవాలేమిటి?
18. ఇంగ్లీషు తెలుగు గాక ఇతర భాషా సాహిత్యాలతో పరిచయం వున్నవారు చెప్పగలిగిన అంశాలేమిటి? వాటితో పోల్చితే తెలుగు సాహిత్యం పరిస్థితి ఎలా వుంది?
19. సాహిత్య సభలు కార్యక్రమాల తీరుతెన్నులు ఎలా వున్నాయి?
20. స్థానిక సాహిత్య సంఘాల గురించి మీ అనుభవాలేమిటి?
21. మొత్తంపైన తెలుగు సాహిత్యం నేటి పరిస్థితులను సమగ్రంగా సవ్యంగా ప్రతిబింబిస్తున్నదని మీరనుకుంటున్నారా?
22. మీరు చదివే సాహిత్య పత్రికలేమిటి? నచ్చే పత్రికలు లేదా శీర్షికలు ఏమిటి?
23. ప్రస్థానం మీరు ఎప్పటి నుంచి చదువుతున్నారు? ఈ కాలంలో దానిపై మీ అభిప్రాయం ఏమిటి?
24. ప్రస్థానంలో ఇంకా ఏయే మార్పులు ఆశిస్తున్నారు?
25. ప్రస్థానం కోసం లేదా సాహిత్యం కోసం మీరేం చేయగలరు?

---



# దగా చేసిందెవరు

- మేరెడ్డి యాదగిరిరెడ్డి
సెల్ : 9949415796

దగా చేసిందెవరు
మాయ చేసిందెవరు
కల్తీ చేసిందెవరు
కన్నతల్లిని కష్టపెట్టిందెవరు
నేలతల్లిని గుల్ల చేసిందెవరు
నేలతల్లి దగా చేసిందా!
రైతును అప్పులపాలు చేసిందా!
బిడ్డ కోసం ప్రాణమిచ్చే కన్నతల్లి
రైతుకోసం తపించే నేలతల్లి
బిడ్డే ప్రాణంగా బ్రతికే కన్నతల్లి
మొలకనుంచి పంట దాకా
తన సారాన్నంతా పంటగా మార్చే నేలతల్లి

ఒక్క చినుకు కోసం
వేయి కళ్ళతో చూసే నేలతల్లి
చెట్టునిచ్చి, గాలినిచ్చి, పంటనిచ్చి
ప్రాణాలు నిలుపుతున్న నేలతల్లి
దగా చేసిందా
రైతుల ఆత్మ హత్యలకు కారణమయిందా?

నేల తల్లి కడుపున మంట పెట్టిందెవరు
పచ్చని పంట చేలలో చిచ్చు పెట్టిందెవరు
మసిబూసి మారేడుకాయలు అమ్మిందెవరు
నేలతల్లికి విషం పెట్టిందెవరు
వ్యవసాయాన్ని
మాయాజూదం చేసిందెవరు..
రైతన్నను పద్మవ్యూహంలోకి తోసిందెవరు
మాయదారి మందులిచ్చి
కొంపలు కూల్చే విత్తనాలిచ్చి
కల్తీ ఎరువులిచ్చి
రైతును అప్పుల ఊబిలో దింపి
మభ్యపెట్టి మాయ చేసే
బహుళ జాతి కంపెనీలు కావా!

# కొత్త బానిస

- ముకుందాపురం పెద్దన్న
సెల్ : 9052964771



అతను
ఎంత గంభీరంగా వుండేవాడు
ఓ మహాసముద్రంలా
చీకటి గడ్డపై
సుద్దముక్క కరవాలంతో
అక్షరయోధుడై విజృంభించేవాడు
తన బాహువుల కోటలో
శిష్యుల కత్తుల్ని పదును పెట్టేవాడు
తన గుండె భుజం మీద
ఆత్మగౌరవం కండువా వేసుకొని
ఎంత హుందాగా వుండేవాడు

ఓ జాతీయ పతాకంలా
త్రిమూర్త్యాత్మక స్వరూపంగా
పాతాల వనాంతరాల్లో
పారిజాత వృక్షమై
నిత్యం గుభాళించేవాడు నిండుగా...

ఆ వృక్షాన్ని
ఏ గునపాలు పెకిలించాయో!
ఆ సముద్రాన్ని
ఏ అగస్త్యులు పొట్టన పెట్టుకున్నారో!
ఎండమావుల చేతిలో
మంత్రదండమైపోయాడు
ఇప్పుడతను
ఒక కార్పొరేట్ ఉపాధ్యాయుడు
చేతులు కట్టుకుని నిలబడే
ఓ కొత్త బానిస

# నివాళి

## రాళ్లబండి నర్సింహరాజు



ప్రజానాట్యమండలి రచయిత, కవి రాళ్ళబండి నర్సింహరాజు జనవరి 3న గుండెపోటుతో హఠాన్మరణం చెందారు. నల్గొండ జిల్లా హుజూర్‌నగర్‌కు చెందిన రాళ్లబండి ఉపాధ్యాయులుగా పనిచేస్తూ రచయితగా మంచి సాహిత్యాన్ని రాశారు. చిన్నతనం నుండే ప్రజానాట్యమండలి కార్యక్రమాల్లో చురుకైన పాత్ర పోషించారు. ప్రజా సమస్యలపై ఎన్నో పాటలు రాసి, పాడి అందరి మన్ననలూ పొందారు. 'నడిచే గాయమా నారీ లోకమా/ శోకపు రూపమా నీ వొక శాపమా' అంటూ మహిళలపై రాసిన గీతం, భూమి గుంజుకుంద్రు బువ్వ గుంజుకుంద్రు/మట్టి పేగు నుండి నన్నేరు చేసింద్రు/కుట్రచేసి నన్ను కూలోన్ని చేసింద్రు' అంటూ కష్టజీవులపై రాసిన పాట, 'వేదం చేసిన గాయాన్ని/ శ్లోకం పెంచిన శోకాన్ని/ శంభూక న్యాయాన్ని/ఏకలవ్యుడి త్యాగాన్ని/యుగాల దగాల చరితుడ్ని' అంటూ రాసిన పలు గేయాలు మంచి ప్రాచుర్యం పొందాయి. అనేక రంగాలపై పాటలు రాసిన రాళ్ళబండి ప్రజా ఉద్యమాలతో మమేకమై కష్టజీవుల కోసం తన కలాన్ని ఎక్కుపెట్టారు.

## ఆరెట్టి నారాయణ



నిజామాబాద్ జిల్లా సాహితీస్రవంతి కన్వీనర్ ఆరెట్టి నారాయణ జనవరి 12 హఠాన్మరణం చెందారు. నిజామాబాద్ జిల్లాలో అభ్యుదయ, ప్రగతిశీల సాహిత్య, సామాజిక ఉద్యమాల్లో కృషిచేసిన తొలితరానికి చెందినవారు. సామాజిక నిబద్ధత కలిగిన రచయిత. నిజామాబాద్ జిల్లాలో తొలి లిఖిత మాసపత్రిక 'వెలుగు'ను వెలువరించారు. జిల్లాలో పలు సంస్థలను స్థాపించి ప్రజాసాహిత్య వ్యాప్తికి కృషిచేశారు. సాహితీస్రవంతి కార్యక్రమాలను నిర్వహిస్తూ ఔత్సాహిక రచయితలను ప్రోత్సహిస్తూ వచ్చారు. పలు నాటకాల్లో నటించడమే కాకుండా గుట్కా నాంది, కుట్ర వంటి నాటికలు రచించారు. ఎవరూ పెద్దగా గుర్తించని కాలంలోనే జోగిని దురాచారాన్ని సమాజం దృష్టికి తేవాలని 'ప్రత్యూష' అనే చలనచిత్రాన్ని నిర్మించి, సహాయదర్శకత్వం వహించారు. ప్రజాచైతన్యం కోసం విస్తృతంగా సాహిత్యసృజన జరగాలని తీవ్రంగా కాంక్షించేవారు. సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ అర్సపల్లిలో జరిగిన ఆరెట్టి నారాయణ అంత్యక్రియలలో పాల్గొని నివాళి అర్పించారు.

## విరియాల లక్ష్మీపతి



ప్రముఖ సాహితీవేత్త విరియాల లక్ష్మీపతి (69) జనవరి 18నగుండెపోటుతో కన్నుమూశారు. ఆయనకు భార్య, ఇద్దరు కుమారులు వున్నారు. అభ్యుదయ రచయితల సంఘం (అరసం) రాష్ట్ర కార్యదర్శిగా, విశాఖ శాఖ అధ్యక్షునిగా, ఎపి ప్రజానాట్యమండలి జిల్లా అధ్యక్షునిగా ఆయన సేవలందించారు. లక్ష్మీపతి 1943 అక్టోబర్ 24న పెందుర్తి మండలం, పినగాడి గ్రామంలో జన్మించారు. విశాఖ పోర్టు ట్రస్టులోని మెకానికల్ విభాగంలో పనిచేస్తూ స్వచ్ఛంద ఉద్యోగ విరమణ చేశారు. సాహితీవేత్తగా ఎనలేని సేవలందించిన ఆయనకు అనేక పురస్కారాలు లభించాయి. 'పంచమవేదం' అనే నాటకానికి అనేక అవార్డులు దక్కాయి. సామాజిక మార్పు కోసం అనేక నవలలు, వ్యాసాలు రాశారు. 1992లో రాసిన 'అతడు అడవిని జయించాడు' అనే నాటికకు ఉత్తమ పురస్కారం లభించింది. 2011లో రాసిన 'శంకర విజయం' నాటకానికి నంది అవార్డు సొంతం చేసుకున్నారు. శ్రీశ్రీ, పురిపండ అప్పలస్వామి పేరిట యువ రచయితలను ప్రోత్సహిస్తూ సాహితీ రంగానికి విశేష సేవలందించారు. స్త్రీవాదం, దళిత వాదాన్ని ప్రోత్సహిస్తూ అనేక రచనలు, వ్యాసాలు రాశారు.

# కొత్త పుస్తకాలు




## నానీ లహరి

జె.ఎల్. నరశింహం

వెల : రూ.30/- పేజీలు : 38

**ప్రతులకు : 9440652042**

నరసింహం గారి 'నానీ'లు వస్తు వైవిధ్యభరితంగా ఉన్నాయి. ఆచార్య ఎన్.గోపిగారు ఆరంభించిన 'నానీ'ల ప్రక్రియలో గణనీయమైంది ఈ సంపుటి.

ఈ కవి 'గుట్కా' మీద చురుకెత్తే చిట్కా ఇలా వేశాడు.

"రోజూ వేసుకునే
గుట్కా
యమలోకానికి
ఎక్కిపోయే జట్కా"

ఇది 'గుట్కా'పైన మత్తెక్కించే విసురు.

**- డా॥ సి.నారాయణరెడ్డి**




## ఆమె చెప్పిన కథ

**- డా॥ కనుపర్తి విజయబక్ష్**

వెల : రూ.80/- పేజీలు : 247

**ప్రతులకు : 94413 29404**

వినీలాకాశంలో మిలమిల మెరిసే నక్షత్రాల్లాంటి చిన్ని కథల్ని రాయడం అంత సులభం కాదు. అందునా అరవై తొమ్మిది రకాల నక్షత్రాలను ఏరి దండగుచ్చడం మరీ కష్టం. ఆ కష్టమైన పనిని అతి సునాయాసంగా అలవోకగా చేసారు రచయిత్రి విజయలక్ష్మీ గారు. 'ఆమె'కు సంబంధించిన అనేక అవమానాలు, అసమానతలు, వివక్షలు, వేధింపులు, హింస,అత్యాచారాలు, మూఢ విశ్వాసాలు, స్త్రీకి ప్రతికూలంగా ఉన్న సంప్రదాయాలు, వీటన్నింటికీ వెన్నుదన్నుగా నిలుస్తూ అన్ని వ్యవస్థల్లోనూ అన్ని రంగాల్లోనూ లోతుగా పాతుకుపోయిన పురుషస్వామ్య భావజాలం, ఆచరణ ఈ కథల్లో ప్రతిబింబించాయి.

**- డా॥ ఆలూరి విజయలక్ష్మి**




## మా తొలినాటి కథలు సుప్రజ

**- సుబ్బమ్మ, ప్రతిమ, జయప్రద**

వెల : రూ.120/- పేజీలు : 208

**ప్రతులకు : 94402 79594**

సుబ్బమ్మగారు (దోర్నాదుల), ప్రతిమ, జయప్రద వీరి మొదటి అక్షరాలు కలిపితే 'సుప్రజ' అవుతుంది. వీరు ముగ్గురు నెల్లూరు జిల్లావారే. వీరు ముగ్గురూ కవిత్వమూ రాస్తారు. కథలూ రాస్తారు. ఇంతకుముందు చాలా సంపుటాలు విడివిడిగా తెచ్చారు. ఇప్పుడు ముగ్గురూ కలిసి, వారి వారి కథలతో ఒక సంపుటి తెస్తున్నారు.

**- డా॥ అద్దేపల్లి రామమోహనరావు**




## వాగర్థ ప్రతిపత్తి

**- డా॥ రాజేశ్వరి దివాకర్ల**

వెల : రూ.50/- పేజీలు : 160

**ప్రతులకు : 9848709776**

ప్రస్తుత గ్రంథంలో ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారికి 1951వ సంవత్సరం నుండి నిర్యాణకాలం వరకు (1986 వరకు) లభించిన ప్రశంసా పద్యాలను, సన్మాన పత్రాలను సంకలనం కావించాను. ఇవన్నీ వారి శిష్యులు, పండిత కవి మిత్రులు, సభా సదస్యులు, సమాజ ప్రముఖులు, పరిషద్వర్యుల ఆదరపూర్వకంగా అర్పించినవి. ఇవన్నీ ఒక విశిష్ట సాహితీమూర్తి తన జీవిత కాలంలో సాధించిన కీర్తి ప్రతిష్టలను గూర్చి సమగ్రంగా వివరిస్తాయి. ఇది భావితరాలకు తెలుగు భాషా సంస్కృతి సంప్రదాయాల పట్ల విలువనూ గౌరవాన్ని కలిగిస్తాయి.

**- రాజేశ్వరి దివాకర్ల**




## మంచుబిందువులు (నానీలు)

**- అవ్వారు శ్రీధర్‌బాబు**

వెల : రూ.30/- పేజీలు : 40

**ప్రతులకు : 98859 27045**

ప్రపంచీకరణను తడమకుండా నేటి కవిత్వం కనిపించదు అనడం అతిశయోక్తి కాదు. ఏదో ఒక రూపంలో ప్రపంచీకరణ దుష్పరిణామాలను ఎత్తి చూపడం నేటి కవులకు పరిపాటైపోయింది. శ్రీధర్ బాబు కూడా ఈ నానీలో.. "ప్రపంచీకరణ / చిందులు...!/ ప్రపంచం తలక్రిందులు..." అంటారు. ప్రపంచాన్ని ఏదో ఒక రీతిలోకి మార్చిన నేపథ్యం ప్రపంచీకరణకుంది. అనేది కవి భావన.

**- కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి**




## సుకన్య (నవల)

**- డా॥ కనుపర్తి విజయబక్ష్**

వెల : రూ.60/- పేజీలు : 122

**ప్రతులకు : 94413 29404**

'విలువలు దోసిళ్ళలో నిలువలేని నీళ్ళు' ఐన ఈ కాలంలో, మనుషులు వర్గాలుగా విడిపోయి భిన్న భిన్నవాదాల వివాదాలు కొనితెస్తున్న ఈ రోజుల్లో, మనసుల్ని ప్రేమ అనే అంతఃసూత్రాలతో కలవడానికి. మనిషి తోటి మనిషితో చేయి చేయి కలిపి నడవడానికి ఇటువంటి సాహిత్యం మనకి ఎంతో అవసరం.

**- దీప్తి**

# కొత్త పుస్తకాలు




**మరో పోరాటం** (కవితా కుంజము)

**– ఆచార్య నరేంద్ర**

వెల : రూ.75/- పేజీలు : 82

ప్రతులకు : 9247757957

ఈ సంపుటిలో అనేకానేక సమస్యలు, వైరుధ్యాలు, కవి, అభిప్రాయాలు విస్తృతంగా వెలువరించారు. అందువల్ల ఆయన ఆనంద ప్రభావమైన కవి కాకుండా, ప్రయోజనాభి లాషియైన కవి అవుతున్నారు. అది హర్షించ దగ్గ విషయమే.

ఎక్కువ కవితలో ఈయన ఆత్మాశ్రయ పద్ధతి అనుసరించారు. దీనివల్ల ఆవేదన ప్రస్ఫుటమవుతుంది. అంతేగాక కవి మనతో మాట్లాడుతున్నట్లు అనిపిస్తుంది.

**– డా॥ అద్దేపల్లి రామమోహనరావు**




**గ్రీష్మంలో వసంతం**

(కథానిక సంపుటి)

**– అమ్మిన శ్రీనివాసరాజు**

వెల : రూ.50/- పేజీలు : 79

ప్రతులకు : 9441317694

మనిషి మంచి – చెడుల మిశ్రమ, చెడుని పరిష్కరించే ప్రయత్నం చేస్తే ఎంత హాయిగా వుంటుంది. అని ఆలోచించ మంటుంది – 'అంత సీన్ లేదు' కథానిక. ఇలా మానవీయమైన సంబంధ బాంధవ్యాలు, పరిణతి చెందిన భావజాలం ఈ కథలకు తావి కూరుస్తున్నాయి. సమకాలీనత, సంభావ్యత కూర్చుకున్న కథల్ని శ్రీనివాసరాజుగారు మనకందించారు.

**– విహారి**




**పెన్నేటి పదాలు**

– మోపూరు పెంచల నరసింహం, గుండాల నరేంద్రబాబు, కె.ఎస్. రాఘవాచార్యులు, అవ్వారు శ్రీధర్‌బాబు

వెల : రూ.50/- పేజీలు : 40

ప్రతులకు : 9493235992

జీవితానికి సంబంధించి భౌతిక సత్యాలను ఎలాంటి వ్యాఖ్యానం లేకుండా సూటిగా, స్పష్టంగా అభివ్యక్తి చేయడం వీరి కవితాతత్వం. వీరి అనుభూతుల్లో అంతరంగ దర్శనం చేయడం ప్రదర్శితమవుతుంది.

**– రాధేయ**




**తెలుగు సాహిత్య చరిత్ర**

(దళిత సాహిత్య పీఠం)

**– ప్రొ॥ వెలమల సిమ్మన్న**

వెల : రూ.300/- పేజీలు :757

ప్రతులకు : 94406 41617

నన్నయ్యకు పూర్వమున్న 'నాగబు' నుంచి నేడు ఇప్పుడిప్పుడే విస్తృతంగా విచ్చు కొంటున్న 'రెక్కలు' వరకు సిమ్మన్నగారు రచించిన "తెలుగు సాహిత్య చరిత్ర"లో కనిపించటం అభినందనీయమైన అంశం. ప్రాచీన సాహిత్యం, ఆధునిక సాహిత్యంలో ఆయా కవుల వ్యక్తిగత వివరాల జోలికి పోకుండా ఆయా ఉద్యమాల నేపథ్యం, దృక్పథం, సాహిత్య పరిచయాలకు పరిమితం కావటం ఒక ప్రత్యేకత.

**– డా॥ గుమ్మా సాంబశివరావు**




**ఆకాశంలో సగం మాది అవకాశాల్లో చోటేది?** (వ్యాసాలు)

**– డా॥ కనుపర్తి విజయబక్ష్**

వెల : రూ.70/- పేజీలు : 101

ప్రతులకు : సిద్ధార్థ ప్రచురణలు 9441382303

విజయలక్ష్మిగారి వ్యాసాల్లో పూసల్లో దారంలాగ ఆమె శాస్త్రీయ దృక్పథం, అభ్యుదయ దృష్టి, సమగ్ర సామాజిక చేతన కనబడుతుంది. ఈ వ్యాసాలన్నీ సీరియస్ విషయాలు, అతి సులువైన సంభాషణా క్రమంలో మనతో మాట్లాడుతున్నట్లు ఉంటాయి. అవి చదివిన తరువాత సమస్యలింక ప్రశ్నార్థకంగా మిగలవు. వాటికి సమంజసమైన సమాధానాలు దొరుకుతాయి. విజయలక్ష్మిగారి ఈ నైపుణ్యతకి అభినందనలు చెప్పి తీరాలి.

**– డా॥ పి.చిరంజీవినీ కుమారి**




**సూది మొనలు** (మినీ కవితలు)

**– కిలపర్తి దాలినాయుడు (దా.నా)**

వెల : రూ.15/- పేజీలు : 52

ప్రతులకు : 9491763261

దాలినాయుడు, తన మినీ కవితలన్నిటికీ శీర్షికలు పెట్టాడు. కొందరు శీర్షిక లేకుండానే రాయవచ్చు. కాని శీర్షికను కూడా కవిత్వంలో భాగం చేసే నిర్మాణ వైఖరి మినీ కవితలో పరిణామం పొందింది. కవిత చదివి, తర్వాత శీర్షిక చూస్తే ఒక్కసారిగా వెలుగు వస్తుంది.

అతను రాసిన 162 మినీ కవితలు సామాజిక వస్తు ప్రధానంగానే ఉన్నై. నిర్మాణ శిల్పం బాగా అవగాహన చేసుకుని రాసిన రీతి కూడా ప్రబలంగానే ఉంది.

**– డా॥ అద్దేపల్లి రామమోహనరావు**

# నవీన్ సప్తతి ఉత్సవాలు



వరంగల్‌లో డిసెంబర్ 25న జరిగిన డా॥ అంపశయ్య నవీన్ సప్తతి ప్రత్యేక సంచిక "నిత్య నవీనుడు"ను పుస్తక ఆవిష్కరణ సభలో (ఎడమ నుండి కుడికి) బన్న అయిలయ్య, రమాదేవి, సి. రాఘవాచారి, కె. రామచంద్రమూర్తి, చుక్కా రామయ్య, నేరెళ్ళ వేణుమాధవ్, గిరిజా మనోహర్, నవీన్, శ్రీమతి నవీన్, బి. వెంకటేశ్వర్లు, శంకరమంచి శ్యామ్‌ప్రసాద్

తెలుగు నేలపై తనదైన ముద్రతో నవలలు, కథలు, వ్యాసాలు రచించి ఒక ప్రత్యేకతను సంతరించుకొని సాహిత్యలోకంలో లబ్ధప్రతిష్టులై కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీతగా నిలిచి వెలుగుతున్న డా॥ అంపశయ్య నవీన్ సప్తతి ఉత్సవాలు, రచనా స్వర్ణోత్సవాలు, వివాహ స్వర్ణోత్సవాలు కలిసి 2011 డిసెంబర్ 24న వరంగల్‌లో మయూరి గార్డెన్స్‌లో సభ జరిగింది. వారి అభిమానులు, ఆత్మీయులు పాలుపంచుకొని నిర్వహించిన ఆ సభకు ఎందరో అతిరథ మహారథులు విచ్చేశారు. సహృదయ, మిత్రమండలి, సృజనలోకం, నేరెళ్ళ వేణుమాధవ్ కల్చరల్ ట్రస్ట్, వరంగల్ ఫిల్మ్ సొసైటీ మొదలైన స్థానిక సంస్థలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించాయి. ప్రేమ్‌కుమార్, మల్లేష్ పాడిన పాటలతో, గుమ్మడి జనార్దన్‌గారి సితార వాద్య కచేరితో, కుమారి మైత్రి చేసిన కూచిపూడి నృత్యం మొదలైన సాంస్కృతిక కార్యక్రమాలతో ప్రారంభమైన ఈ సభకు స్థానిక సహృదయ సంస్థ ఉపాధ్యక్షులు జి. గిరిజా మనోహరబాబు అధ్యక్షత వహించారు. సుప్రసిద్ధ ధ్వన్యనుకరణ కళా ప్రవీణులు, పద్మశ్రీ, కళాప్రపూర్ణ నేరెళ్ళ వేణుమాధవ్ ప్రారంభోపన్యాసం చేసిన ఆ సభలో డా॥ అంపశయ్య నవీన్ సప్తతి ప్రత్యేక సంచిక "నిత్య నవీనుడు"ను నాటి ముఖ్య అతిథి, ప్రసిద్ధ విద్యావేత్త, ఎం.ఎల్.సి. చుక్కా రామయ్య ఆవిష్కరించి, డా॥నవీన్‌ను తెలంగాణా "జేమ్స్ జాయిస్"గా అభివర్ణించారు. తెలంగాణా సాంస్కృతిక జీవనాన్ని, పోరాటాలను తన ప్రత్యేక రచనల్లో చిత్రిస్తూ అపురూపమైన సాహిత్యాన్ని నవీన్ తెలుగు వాళ్ళకు అందించారని అభినందించారు. అందుకే పాశ్చాత్య సాహిత్యంలో జేమ్స్‌జాయిస్ ఎంత గొప్పవాడో మన నవీన్ కూడా అంత గొప్పవాడని ప్రశంసించారు. తెలంగాణా గడ్డ, ముఖ్యంగా వరంగల్ జిల్లా, అందులోనూ పాలకుర్తి పరిసర ప్రాంతాలన్నీ సాహితీ సువాసనలతో గుభాళించేవని, ఆ నేపథ్యం నుండి వచ్చిన నవీన్ సాహితీ సృష్టి నిరుపమానమని అభివర్ణించారు. మానసిక సంఘర్షణలకు, మానవ సంస్కృతులకు ఆయన రచనలు ప్రతిరూపాలే కనుక అది కలకాలం నిలిచేదని శ్లాఘించారు.

మరో ఆత్మీయ అతిథి, హన్స్ ఇండియా ఆంగ్ల దినపత్రిక సంపాదకులు, హెచ్.ఎం.టి.వి. సి.ఈ.వో. ప్రసిద్ధ పత్రిక సంపాదకులు కె. రామచంద్రమూర్తి నవీన్ రెండు నవలలైన 'అవాస్తవికుడు - ఇల్లు ఇల్లనియేవు' సంపుటాన్ని ఆవిష్కరిస్తూ, వాస్తవికతకు, సమకాలీన సామాజిక దృక్పథాలకు నవీన్ రచనలు పట్టుగొమ్మలని వర్ణించారు. తెలంగాణా సాయుధ పోరాటం జరిగిన నేలపై పుట్టిన నవీన్ తన రచనల్లో ఆ కాలపు విశేషాల్ని అద్భుతంగా గ్రంథస్థం చేయడం విశేషమన్నారు. సాహితీవేత్త, ఇంకొక ఆత్మీయ అతిథిగా విచ్చేసిన, ప్రముఖ పత్రికా సంపాదకులు, విశాలాంధ్ర పత్రిక పూర్వ సంపాదకులు సి.రాఘవాచారి అంపశయ్య నవీన్ కథా సంకలనం 'అస్మదీయులు - తస్మదీయులు' ఆవిష్కరించారు.

సమకాలీనుడైన మనిషి భావాలకు అక్షర రూపమే నవీన్ రచనలని కొనియాడారు. ఇప్పటిదాకా వారందించిన అన్ని రచనల్లోనూ మూలసూత్రం మానవ జీవితమే. సగటు మనిషి అంతరంగాన్ని లోతుల్లోకి వెళ్ళి పరిశీలించి తన రచనల్లో ప్రతిబింబింపచేసిన నవీన్ ఎంతో అభినందనీయుడన్నారు.

డా॥ నవీన్ "కాలరేఖలు" నవలకు కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం లభించిన సందర్భాన్ని పురస్కరించుకొని స్పందించి పలువురు సాహితీ ప్రముఖులు వెలువరించిన వ్యాసాలన్నీ క్రోడీకరించి "తెలంగాణా కాలరేఖలు - మూల్యాంకనం" అనే గ్రంథం వెలువరించారు. కాకతీయ విశ్వవిద్యాలయం, తెలుగుశాఖ ఆచార్యులు ఆచార్య బన్నా ఐలయ్య సంపాదకత్వం వహించిన ఈ గ్రంథాన్ని, ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగు శాఖాధ్యక్షులు, ప్రముఖ పరిశోధకుడు ఆచార్య ననుమాస స్వామి ఈ సభలో ఆవిష్కరించారు. జనజీవితాన్ని ప్రతిబింబింపచేసే రచనలే కాలానికి ఎదురొడ్డి నిలుస్తాయని, నవీన్ రచనలన్నీ ఆ కోవకు చెందినవని ముఖ్యంగా కాలరేఖలు, దానితోబాటు వచ్చిన మిగతా రెండు నవలలు వారి సాహిత్యంలో అద్భుతమైన రచనలుగా మిగిలిపోతాయని వివరించారు. డా॥ నవీన్ 'కాలరేఖలు' కాలాన్ని మించి నిలిచిపోయే గొప్ప తెలంగాణా నవల అని కీర్తించారు.

# గాంధీ సూక్తం

- యస్. మునిసుందరం



అటెండర్ యింట్లో వెదికినా
అరకోటి దొరికే రోజుల్లో
అధికారి యింటిపై దాడి చేస్తే
ఆరుకోట్లు దొరకడం గొప్పా?
టోపీల గొడవలే లేకుంటే
కడువాల సలవ మేడల్లో
గంగాళాల రొక్కం దొరకదా?
చెత్తపని చేసి అయినా
విత్తము సంపాదించుబిడ్డా!
ఆవు వెంటబడే ఆబోతుల్లా
అంతా అశాశ్వతమనే వోళ్లే
పైసలకెగబడతావుంటే
నువ్వేం ఎర్రిపిలగోనివిరా

విలువలు.. విలువలు అంటా
సుమతీ శతకం వల్లిస్తావ్?
ఎర్రి నాగన్నా!
ఏ కాలంలో వుండావురా?
మహాభారత కాలంలోనే
పరీక్షిత్తు మా రాజును
బతికించాలని బయలుదేరిన
తపోధనుడు

రొక్కంతో జోలెనింపగానే
తిరుగుటపా కట్టాడని సతికిన నాడే
అనుకుంటిని బిడ్డా! ఏ కాలమయినా
రూకలకే పొగురెక్కువని
సినబ్బా! సెప్పేది విను.
అవినీతి అన్యాయం అధర్మం
దేశ దేహసిరిపై రాచపుండ్లు
కోసిపారేద్దాం రండి అంటా
సందుగొందూ తిరిగినావో
ఏదోవొక రోజు నిన్ను చౌరస్తాలో
గాంధీతాత పక్కన నిలబెట్టేస్తార్రా సామీ!
అంతే సంగతులు
కాకి రెట్టలే గతి.

---

# ఆనందం

- జె. రామకృష్ణరాజు
సెల్ : 9440842663



నిప్పు కణికపై
ఉప్పు రవ్వలా నిరంతరం
చిటపటలాడుతూ
అకారణంగా అనుక్షణం
ఆగ్రహాన్ని ప్రదర్శిస్తే
అనర్థం దాపురించి
ఆనందం ఆవిరై

ఆప్యాయతలు కరువై
ఆత్మీయులు దూరమై

అంతులేని వ్యధకు లోనై
అందరిలో ఒంటరియై
అగచాట్లు పాలవదా జీవితం!
అద్వితీయం మనిషి!
సంయమనంతో
అధిగమించలేమా ఈ ఆక్రోశం
అందుకోలేమా ఆనంద నందనం

---

సభకు అధ్యక్షత వహించిన జి. గిరిజా మనోహరబాబు తమ అధ్యక్షోపన్యాసంలో కాలరేఖలను గురించి చెబుతూ డా॥ అంపశయ్య నవీన్ రచనా ప్రారంభం నుంచీ ప్రయోగశీలిగా కనిపిస్తారని, తెలంగాణా జనజీవితాన్ని, తెలంగాణా సాంస్కృతిక విలువల్ని తమ రచనలు అన్నింటిలోనూ విస్తృతంగా వివరించడం వారికి తెలంగాణ నిబద్ధత ఎంత గొప్పదో తెలుస్తున్నదన్నారు. కాలరేఖలు, దాని అనుబంధ నవలలు బాంధవ్యాలు, చెదిరిన స్వప్నాలు దాదాపు 1600 పేజీల బృహద్రచనం. ఏ నవలాకారుడూ ఇంత పెద్ద నేపథ్యం కలిగిన రచన చెయ్యలేదన్నారు.

ఈ సభలో ఆవిష్కరించిన నవీన్ నవలాద్వయాన్ని ప్రముఖ రచయిత్రి నెల్లుట్ల రమాదేవి, కథా సంకలనాన్ని, శంకరమంచి శ్యాంప్రసాద్, కాలరేఖలు – మూల్యాంకనం పుస్తకాన్ని ఆచార్య బన్న అయిలయ్య సమీక్షించారు.

సప్తతి సందర్భంగా నవీన్‌ని, మాజీ శాసనసభ్యులు కేతిరి శాయిరెడ్డి, ఆచార్య లక్ష్మణమూర్తి, డా॥ రామకృష్ణ లక్ష్మణమూర్తి, రామా చంద్రమౌళి, ఆచార్య వాసిరెడ్డి భాస్కరరావు, ఎన్. శ్రీనివాస్, ప్రసాద్, సతీశ్, మహేష్ మొదలైన మిత్రులు, శ్రేయోభిలాషులు, బంధువులు అభినందించారు.

చివర్లో నవీన్ మాట్లాడుతూ 2001 నుండి ప్రతి సంవత్సరం తన జన్మదినమైన డిసెంబర్ 24 నాడు రెండు, కొన్నిసార్లు మూడు పుస్తకాల్ని వెలువరించానని, ఈ పది సంవత్సరాల్లో 25 కొత్త పుస్తకాల్ని రచించి ఆవిష్కరింపజేశానని చెప్పారు. ఈ సప్తతి సందర్భంగా నాలుగు పుస్తకాల్ని వెలువరించటం ఎంతో ఆనందదాయకంగా ఉందని, తన సప్తతి ప్రత్యేక సంచికగా వెలువడిన "నిత్యనవీనుడు"లో 80 మంది మిత్రులు రచించిన వ్యాసాలు, అభినందన సందేశాలున్నాయని, ఈ ప్రత్యేక సంచికకు రచనలు పంపించిన వారికి, ప్రకటనలిచ్చిన వారికి నవీన్ కృతజ్ఞతలు తెలియజేశారు.

వచ్చే సంవత్సరం నుండి తన జన్మదినం రోజు ఒక రచయిత రచించిన మొదటి నవలకు గానీ, లేక మొదటి కథా సంకలనానికి గానీ ఒక పురస్కారం ప్రదానం చేయాలని సంకల్పించానని, దానికి విధి, విధానాలను త్వరలోనే రూపొందిస్తామని తెలియజేశారు. చాలాకాలంగా తను రాయాలనుకుంటున్న ఒక పెద్ద రచనను - 1991 నుండి భారతదేశ ఆర్థిక వ్యవస్థలో ప్రవేశపెట్టబడిన ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ ప్రభావాలను చిత్రిస్తూ రాయాలనుకున్న నవలను పూర్తి చేయడానికి ప్రయత్నిస్తానని, వచ్చే డిసెంబర్ 24నాడు ఆ నవల ఆవిష్కరణ జరగవచ్చునని నవీన్‌గారు చెప్పారు.

చివరగా నవీన్ దంపతులను సభలోని వారి బంధువులు, మిత్రులు, శ్రేయోభిలాషులు ఘనంగా సన్మానించారు. ■

# పశ్చిమగోదావరి, చింతలపూడిలో సాహితీ స్రవంతి సభ

పశ్చిమగోదావరిజిల్లా, చింతలపూడిలోని నవోదయ మహిళా మరియు బాలల గ్రంథాలయంలో "సాహితీ స్రవంతి" ప్రారంభోత్సవం జరిగింది. జనవరి 13వ తేదీన ప్రారంభమైన ఈ కార్యక్రమానికి జిల్లా "సాహితీ స్రవంతి" కన్వీనర్ చైతన్య ప్రసాద్ ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఆయన మాట్లాడుతూ రాష్ట్ర స్థాయిలోని "సాహితీ స్రవంతి"కి అనుబంధంగా చింతలపూడిలో ప్రారంభం చేయడం చాలా ఆనందదాయకమన్నారు. 1990వ దశకంలో ఆర్థిక సంస్కరణలు ప్రారంభమయినపుడే రాష్ట్ర స్థాయిలో సాహితీ స్రవంతి ప్రారంభమయిందన్నారు. ప్రజా దృక్పథంతో 'సాహితీ స్రవంతి' సభ్యులు కవితలు, కథలు రాస్తున్నారని అన్నారు. జిల్లాలో ఏలూరు, భీమవరం, పాలకొల్లు, నర్సాపురం, తణుకు తదితర ప్రాంతాల్లో సాహితీ స్రవంతి సభ్యులున్నారని వివరించారు. ప్రస్థానం పత్రికను మాసపత్రికగా నడుపుతున్నామని పత్రిక ప్రాధాన్యతను వివరించారు. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన సింగంశెట్టి సూర్యకుమార్ మాట్లాడుతూ ప్రపంచీకరణ నేపథ్యంలో 1990 తరువాత కవులు, రచయితలు మరింత పదునుగా తమ కవిత్వాన్ని, రచనల్ని కొనసాగిస్తున్నారన్నారు. రాజకీయాలతో నిమిత్తం లేకుండా తాము రాస్తున్నామని చెప్పేవారు పరోక్షంగా పెట్టుబడిదారీ వర్గ రాజకీయాలను సమర్థిస్తున్నట్లేనని మహాకవి శ్రీశ్రీ చాలాకాలం క్రిందటే చెప్పారని అన్నారు. "సాహితీ స్రవంతి"ని మేధావుల్లోనూ, అన్ని వర్గాల వారిలోని విస్తృత ప్రచారం చేయాలన్నారు.

జిల్లాలోని 'సాహితీ స్రవంతి' ఆధ్వర్యాన ఒక కవితా సంకలనం ప్రచురింపచేస్తే బాగుంటుందని నాగాస్త్రీ (నాగరాజు) అన్నారు. ప్రతి నెలా ఒక కార్యక్రమాన్ని నిర్వహించటం బాగుంటుందని, మాండలికాలకు సంబంధించి ఎస్.వి. రామశాస్త్రి చెప్పారు. జన విజ్ఞాన వేదిక కార్యదర్శి పి. పాండురంగారావు "సాహితీ స్రవంతి" ఆధ్వర్యాన రచనలతో పాటు పాటలు పాడే కార్యక్రమాలు కూడా నిర్వహించి ప్రోత్సహించాలన్నారు. ఎన్. అశోక్‌బాబు మాట్లాడుతూ కొత్తవారిని కూడా "సాహితీ స్రవంతి"లో ప్రోత్సహించాలన్నారు. కె. కృష్ణమూర్తి నా వంతు సహకారాన్ని తప్పనిసరిగా అందిస్తానన్నారు.



బి. కిరణ్‌కుమార్ శ్రామిక వర్గానికి దోహదపడే కార్యక్రమాలు నిర్వహించాలన్నారు.

ఎస్. రసూల్ ప్రతీ నెల ఒక కార్యక్రమం నిర్వహించటం ద్వారా 'సాహితీ స్రవంతి'ని అభివృద్ధి పరచాలని అన్నారు. ఎస్. జఫ్రుల్లా తన వంతు సహకారమందిస్తానన్నారు. కార్యక్రమం ప్రారంభంలో గురజాడ దేశభక్తి గేయాన్ని నవోదయ ట్యూషన్ సెంటర్ బాల, బాలికలు వెలుగు పవన్‌కుమార్, వెలుగు సాయి, ఉప్పు వెంకటేశ్వర్లు, నల్లమోలు రోహిణి, నల్లమోలు రోషిణిలు ఆలాపించారు. వేములపల్లి శ్రీకృష్ణ గేయం, చేయెత్తి జైకొట్టు తెలుగోడా – గతమెంతో ఘనకీర్తి గలవోడా గేయాన్ని పాడారు. సమావేశం జరుగుతుండగా మధ్య, మధ్యలో గేయాలాపనలు కూడా శ్రావ్యంగా జరిగాయి. సి. నారాయణరెడ్డి గేయం 'పరుల కోసం పాటుపడని నరుని బ్రతుకు దేనికని', 'మూగనేలకు నీరందించని వాగు పరుగు దేనికని' చైతన్య ప్రసాద్ పాడారు. ఒక శ్రామిక గేయాన్ని కిరణ్‌కుమార్ పాడారు. అశోక్ బాబు ఒక పాట పాడారు. శ్రీశ్రీ గేయం 'కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులు – పేర్లకి, పుకార్లకి, షికార్లకి నిబద్ధులు' సూర్యకుమార్ పాడారు. 'తెలుగు భాష గొప్పతనం తెలుసుకో' పాటను రవిచంద్ర పాడారు. భవిష్యత్‌లో 'సాహితీ స్రవంతి' కార్యక్రమాల నిర్వహణకై ఎస్.వి. రామశాస్త్రి, కన్వీనర్‌గా ఎస్. రసూల్, సహాయ కన్వీనర్‌గా మరో ఏడుగురితో కన్వీనింగ్ కమిటీని సమావేశం ఏకగ్రీవంగా ఎన్నుకున్నది. చింతలపూడి డివిజన్ స్థాయిలో కమిటీ ఇది. సూర్యకుమార్ వందన సమర్పణతో సమావేశం ముగిసింది.

# "జలగీతం" హిందీ అనువాదానికి ప్రొ॥ పి. మాణిక్యాంబకు పురస్కారం

భారత ప్రభుత్వం, మానవ వనరుల మంత్రిత్వ శాఖ యేటా హిందీ అనువాదాలను ప్రదానం చేసే పురస్కారాన్ని ఈ యేడు ఉస్మానియా విశ్వవిద్యాలయం, హిందీ ప్రొఫెసర్, ప్రముఖ అనువాదకురాలు డా॥ పి. మాణిక్యాంబకు ప్రకటించారు. ప్రముఖ తెలుగు కవి డా॥ గోపి రచించిన "జలగీతం" దీర్ఘకావ్యాన్ని ఆమె "జలగీత్" పేరుతో హిందీలోకి అనువదించారు. 2006 సంవత్సరానికి పరిశీలించిన ఈ గ్రంథాన్ని ఉత్తమ అనువాదంగా ఇటీవల ప్రకటించారు. ఈ పురస్కారం క్రింద లక్ష రూపాయల నగదు, ప్రశంసాపత్రం త్వరలో ఢిల్లీలో జరిగే ఒక కార్యక్రమంలో అందజేస్తారు.



**డిసెంబర్ 25న పెద్దాపురంలో మరిడమ్మ అమ్మవారి కాలక్షేప మండపంలో యాసలపు సూర్యారావు పుస్తకం 'పేగుబంధం' ఆవిష్కరిస్తున్న డి.వి.ఆర్. పూషా, డా. అద్దేపల్లి రామమోహనరావు., డి. జోస్యుల కృష్ణబాబు, పుస్తక రచయిత, పద్మనాభ శర్మ, యుటిఎఫ్ పట్టణ కార్యదర్శి జి. వెంకట్రావు, కవి చల్లా విశ్వనాథం, గద్దె పచ్చాల రావు.**

# స్ఫూర్తి ప్రదాత చేగువేరా

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట స్ఫూర్తి ప్రదాత, మరోప్రపంచ నిర్మాణానికి వేగుచుక్క చే గువేరా అని ప్రజాశక్తి బుక్‌హౌస్ సంపాదకులు, సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అన్నారు. విజయవాడలోని స్వరాజ్యమైదానంలో జరిగిన పుస్తక మహోత్సవ్ ప్రాంగణంలో 'సాహితీస్రవంతి-ప్రజాశక్తి బుక్‌హౌస్' రూపొందించిన పుస్తకాల ఆవిష్కరణ జనవరి 8న జరిగింది. 'చే' పుస్తకాన్ని తెలకపల్లి రవి 'ఎ జర్నీ విత్ ఐరన్ ఓర్' పుస్తకాన్ని శ్రీశ్రీ ప్రింటర్స్ అధినేత విశ్వేశ్వరరావు ఆవిష్కరించారు. 'నేటి సామ్రాజ్యవాదం', 'శ్రీశ్రీ జయభేరి' పుస్తకాలను ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ కార్యదర్శి గోళ్ళ నారాయణరావు ఆవిష్కరించారు. ఈ సందర్భంగా తెలకపల్లి రవి మాట్లాడారు. ప్రపంచంలో సామ్రాజ్యవాదాన్ని తుత్తునియలు చేసిన వ్యక్తి చేగువేరా అన్నారు. వైద్యవృత్తిలో ఉంటూ ప్రజలను చైతన్యపరచాలనే ఉద్దేశంతో పోరాట మార్గాన్ని ఎంచుకున్న గొప్ప వ్యక్తని అన్నారు. 45 ఏళ్ళ వయస్సులోనే ప్రపంచానికి మార్గం చూపారని కొనియాడారు. అలాగే 'ఎ జర్నీ విత్ ఐరన్ ఓర్' పుస్తకంలో అనంతపురం నుండి కృష్ణపట్నం ఓడరేవు వరకు ఓబులాపురం గనులకు చెందిన వేలాది లారీలు వెదజల్లే దుమ్మూ ధూళితో ఎంత మంది ఇబ్బందులు పడ్డారో చక్కగా వివరించారన్నారు. శ్రీశ్రీ జయభేరి పుస్తకం గురించి వివరిస్తూ శ్రీశ్రీ గురించి ఎంత చెప్పినా తక్కువేనన్నారు. కేవలం ఏడాది కాలంలో శ్రీశ్రీ జయభేరి మూడు ముద్రణలు రావడం గొప్పవిషయమన్నారు. వచ్చే పుస్తక మహోత్సవ్ నాటికి మరిన్ని ముద్రణలు రావాలని ఆకాంక్షించారు. ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ కార్యదర్శి గోళ్ళ నారాయణరావు మాట్లాడుతూ గనులను మింగిన ఘనులను గురించి 'ఎ జర్నీ విత్ ఐరన్ ఓర్' పుస్తకంలో చక్కగా వివరించారన్నారు. ప్రముఖ పాత్రికేయురాలు వడ్డమూడి పద్మ మాట్లాడుతూ ఓ సాహస యాత్రికుడు 'చేగువేరా' అన్నారు. నేటి యువత ఆయనను ఆదర్శంగా తీసుకుని ముందుకెళ్ళాలన్నారు. సభకు అధ్యక్షత వహించిన సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి ఎస్. వెంకట్రావు మాట్లాడుతూ 'ఎ జర్నీ విత్ ఐరన్ ఓర్' పుస్తకంలో వేల కోట్ల రూపాయల గనుల కుంభకోణం ఎలా జరిగిందో చక్కగా వివరించారన్నారు. గనులను మింగిన వారు ప్రస్తుతం అధికారం పోయి కటకటాల వెనుక ఉన్నారన్నారు. కార్యక్రమంలో సాహితీస్రవంతి నగర అధ్యక్షులు డాక్టర్ రావెళ్ళ శ్రీనివాసరావు, ప్రజాశక్తి బుక్‌హౌస్ విజయవాడ ఇన్‌ఛార్జ్ మారుతీ శ్రీనివాస్ పాల్గొన్నారు. తొలుత అతిథులను జి. నారాయణ వేదికపైకి ఆహ్వానించారు.




సాహితీస్రవంతి, ప్రజాశక్తి బుక్‌హౌస్ రూపొందించిన పుస్తకాల ఆవిష్కరణ సభ. చిత్రంలో ఎస్. వెంకట్రావు, విశ్వేశ్వరరావు, తెలకపల్లి రవి, గోళ్ళ నారాయణరావు, డా. రావెళ్ళ శ్రీనివాసరావు



విజయవాడ పుస్తక మహోత్సవ ప్రాంగణంలో ప్రతిభ వేదిక మీద జనవరి 8న జరిగిన సభలో టారంటినో రచించిన పుస్తకం 'నేలపై నిండు చంద్రుడు'ను ఆవిష్కరించిన ప్రముఖులు తుర్లపాటి కుటుంబరావు, వారి పక్కన ప్రజాసాహితీ పత్రిక సంపాదకులు కొత్తపల్లి రవిబాబు తదితరులు. మొదటి ప్రతిని అందుకుంటున్న ఆ పుస్తక అనువాదకులు బామేరాజ్



హైదరాబాద్ బుక్‌ఫెయిర్‌లో సభలో 'కరీంనగర్ కథలు'ను ఆవిష్కరించిన ఎ.కె. ఖాన్. తెలకపల్లి రవి, బి.ఎస్. రాములు, పి. రాజేశ్వరరావు, ఎస్. శ్రీనివాస్, ఆర్. హనుమంతరావు, రాజు తదితరులు



డిసెంబర్ 18న నరసాపురంలో 'రమ్యభారతి' ఆధ్వర్యంలో జరిగిన రాష్ట్ర స్థాయి చిన్న కథల పోటీలలో తృతీయ స్థాయి "సోమేపల్లి సాహితీ పురస్కారం'ను నరసాపురం మున్సిపల్ కమిషనర్ పి.ఎం. సత్యవేణి, ప్రముఖ కవి డా॥ అద్దేపల్లి రామ్మోహన్‌రావు నుండి అందుకుంటున్న పాతూరి అన్నపూర్ణ. చిత్రంలో సాహితీవేత్తలు చలపాక ప్రకాష్, చక్రవధానుల రెడ్డప్ప ధవేజీ, పాలపర్తి శ్రీధర్ తదితరులు



హైదరాబాద్ చిక్కడపల్లిలోని నగర కేంద్ర గ్రంథాలయంలో డిసెంబర్ 28న ప్రముఖ కవి సుధామ కవిత్వ గ్రంథాలు 'చిత్ర గ్రంథి', 'కవికాలం'లను కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి గ్రహీత, కె. శివారెడ్డి, రచయిత, చిత్రకారులు శీలా వీర్రాజులు ఆవిష్కరించారు. ఫొటోలో ఎడమ నుంచి కుడికి కవి, విమర్శకులు సౌభాగ్య, శీలా వీర్రాజు, సభాధ్యక్షులు, ఆంధ్రప్రభ సంపాదకులు పి. విజయబాబు, కె. శివారెడ్డి, కవి సుధామ, కవయిత్రి డాక్టర్ చిల్లర భవానీదేవి

## వి. సత్యవతికి మల్లెమాల సాహితీ పురస్కారం



డాక్టర్ మల్లెమాల వేణుగోపాల్ రెడ్డి ఏర్పాటుచేసిన మల్లెమాల సాహితీ పురస్కారం 2012 కు ప్రముఖ కథారచయిత్రి వి. సత్యవతిని ఎంపికచేసినట్లు కడపజిల్లా రచయితల సంఘం తరపున అబ్బిగారు రాజేంద్రప్రసాద్ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పురస్కారం క్రింద పదివేల రూపాయల నగదు, జ్ఞాపికతో సత్కరిస్తామని తెలిపారు.

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ నూతన కమిటీ



దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఐదేళ్ళకు గాను నూతన కమిటీని ఎన్నుకుంది. డిసెంబర్ 30న ఖైరతాబాద్‌లో ఉన్న సంస్థ ప్రాంగణంలో జరిగిన సమావేశంలో జరిగిన ఎన్నికకు న్యాయవాది పి. సాయినాథ్ ఎనికల అధికారిగా వ్యవహరించారని దక్షిణ భారత హిందీ ప్రచార సభ కార్యదర్శి ఎస్.కె. హళెమని తెలిపారు. ఆయన నూతన కార్యవర్గానికి శుభాకాంక్షలు తెలిపారు. నూతన కార్యవర్గం అధ్యక్షులు శ్రీమతి ఎం. సీతాలక్ష్మి, ఉపాధ్యక్షులు బోయినపల్లి వెంకట రామారావు, పరుచూరి ప్రభాకరరావు, కోశాధ్యక్షులు శ్రీమతి షేక్ జమీలా బేగం, ప్రబంధ నిధి పాలక మండలి, షేక్ మొహమ్మద్ ఖాసిం, సభ్యులుగా 18 మంది ఎంపికయినట్లు తెలిపారు. నిధి పాలక మండలి సభ్యులుగా ఎం. యల్లారావు, ఎం. రాధాకృష్ణయ్య, సిహెచ్. శేషగిరిరావు, డి. ప్రభాకరరెడ్డి, ఎ.ఆల్వార్, జి. అబ్దుల్‌మియాలు ఎన్నికయ్యారని ఎస్.కె. హళెమని తెలియజేశారు.

## వచన కవితా సంపుటాలకు ఆహ్వానం

గుంటూరు జిల్లా రచయితల సంఘం ఈ సంవత్సరం వచన కవితా ప్రక్రియకు పురస్కారం అందించనున్నట్లు అధ్యక్షులు సోమేపల్లి వెంకటసుబ్బయ్య ఒక ప్రకటనలో తెలిపారు. 2011 జనవరి నుండి డిసెంబర్31 లోపు ప్రచురించబడిన కవితా సంపుటాలను ఈ పురస్కారానికి ఆహ్వానిస్తున్నారు. ఎంపికైన రెండు కవితా సంపుటాలకు ఒక్కొక్క దానికి రూ. 5000/-ల చొప్పున అందజేయబడుతుందని ఆ ప్రకటనలో తెలిపారు. కవులు తమ పుస్తకాలు 4 ప్రతులను కోసూరి రవికుమార్, ప్రధాన కార్యదర్శి, గుంటూరు రచయితల సంఘం, నారాయణపురం, దాచేపల్లి-522 414, గుంటూరు జిల్లా చిరునామాకు ఫిబ్రవరి 29లోపుగా పంపాలి. ఇతర వివరాలకు ఎస్.ఎం. సుభాని-9490776184ను సంప్రదించవచ్చు.

## "క్రిస్టమస్" కవి సమ్మేళనం

సాహితీ స్రవంతి భద్రాచలం శాఖ ఆధ్వర్యంలో స్థానిక లిటిల్ ఫ్లవర్స్ విద్యాసంస్థల ప్రాంగణంలో మాల్యశ్రీ అధ్యక్షతన "క్రిస్టమస్" పర్వదిన సందర్భంగా 'క్రిస్టమస్ కవి సమ్మేళనం' నిర్వహించబడినది. ఈ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన మాగంటి సూర్యం మాట్లాడుతూ నేటి సమాజంలో ఎన్ని మతాలు వున్నా సోదరభావంతో కలిసి మెలిసి మెలగాలని పిలుపునిచ్చారు. కార్యదర్శి తాతోలు దుర్గాచారి సభకు ఆహ్వానం పలుకుతూ సాహితీ స్రవంతి 'క్రిస్టమస్ కవి సమ్మేళనం'ని విభిన్న కార్యక్రమాల్లో భాగంగా, ఆదర్శవంతంగా నిర్వహిస్తోందని తెలియజేశారు. విశిష్ట అతిథిగా బిషప్ ఆనంద్‌పాల్ ఉపన్యసిస్తూ సాహిత్య కార్యక్రమాల్లో ఈ రోజు ప్రత్యేకంగా ఆహ్వానించి సత్కరించి, నన్ను మాట్లాడించడం నిజంగా గొప్ప విషయమన్నారు. ఈ సభలో ఎన్.సిహెచ్. చక్రవర్తి, డా॥ కావూరి పాపయ్యశాస్త్రి, జి. గోపాలకృష్ణ, ఎం. రాంప్రసాద్, ఎస్. వెంకటాచారి, జి. రామరాజు తదితరులు పాల్గొని ప్రసంగించారు. కవి సమ్మేళనంలో కుమారి సాయిలక్ష్మి, ఎం. మెర్సీగ్రేస్ ముత్తమ్మ, రమేష్, లింగ్య, జగన్ తదితరులు పాల్గొన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**







# ప్రగతి బాటలో పయనం...
# ప్రతి ఒక్కరికీ ప్రయోజనం

అందరి ఆకాంక్షలను నెరవేరుస్తూ, ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి పథంలో దూసుకుపోతోంది. అసలైన సంక్షేమ పాలనకు అర్థం చెపుతూ రైతులు, బడుగులు, మహిళల జీవన స్థితిగతులను మార్చే వినూత్న పథకాలతో, యువతరాన్ని నిరాశ, నిస్పృహల చీకటి నుండి వెలుగుబాట నడిపించే స్ఫూర్తితో, ముఖ్యమంత్రి **శ్రీ నల్లారి కిరణ్ కుమార్ రెడ్డి** నేతృత్వంలోని రాష్ట్ర ప్రభుత్వం ప్రగతి బాటలో పయనిస్తోంది.

## ఉజ్వల భవితకు హామీనిస్తూ... సర్వజన సంక్షేమంలో ప్రత్యేకతను చాటుతూ... ప్రజా సేవలో వినూత్న పథకాలు



**రాజీవ్ యువ కిరణాలు**
అవధులు లేని అవకాశాలు

### 'రాజీవ్ యువకిరణాలు' పథకం లక్ష్యాలు:

- వచ్చే మూడేళ్ళలో 15 లక్షల మంది యువతకు ఉపాధి కల్పన
- వివిధ ప్రభుత్వ శాఖలలో 1 లక్ష 16 వేల ఉద్యోగాల భర్తీ
- డిసెంబరు నెలలో ఒకేరోజు 1 లక్ష ఉద్యోగాల నియామకం
- ఉపాధికి అవకాశం ఉన్న ప్రైవేటు రంగాలతో భాగస్వామ్యం
- ప్రభుత్వరంగ, ప్రైవేటు సంస్థల సమన్వయంతో అమలు
- పరిశ్రమ అవసరాలకు అనుగుణంగా ఉన్నత, సాంకేతిక, వృత్తివిద్యా కోర్సులలో సరికొత్త సిలబస్













**ఇందిర జలప్రభ**

### ఇందిర జలప్రభ విశిష్టతలు:

- వచ్చే మూడేళ్ళలో రాష్ట్రవ్యాప్తంగా 10 లక్షల ఎకరాల భూమికి సాగునీటి సౌకర్యం
- 3.30 లక్షల ఎస్సీ, 2.37 లక్షల ఎస్టీ కుటుంబాలకు లబ్ధి
- దేశంలోనే తొలిసారిగా రూ.1838 కోట్లతో ఎస్సీ, ఎస్టీలకు చెందిన మెట్టభూములకు సాగునీటి వనరుల కల్పన
- 22 జిల్లాలలోని 211అసెంబ్లీ నియోజక వర్గాలలో అమలు
- మొత్తం 5.81 లక్షల కుటుంబాలను దారిద్ర్యరేఖ ఎగువకు తీసుకువచ్చే బృహత్తర పథకం.



**శ్రీమతి డి.కె. అరుణ**
రాష్ట్ర సమాచార, పౌరసంబంధాలు, సినిమాటోగ్రఫీ మరియు చలనచిత్ర, టీవీ & నాటకరంగ అభివృద్ధి సంస్థ శాఖామాత్యులు

## రూ. 3000 కోట్లతో రైతు, మహిళా సంక్షేమ ప్రత్యేక కార్యక్రమాలు - 1.20 కోట్ల కుటుంబాలకు లబ్ధి

### రైతుల కోసం...

- రూ. 765 కోట్లతో 2010 ఖరీఫ్ పంటల బీమా పరిహారం 7.48 లక్షల మంది రైతులకు లబ్ధి
- వడ్డీ మాఫీ క్రింద రూ. 352 కోట్ల పంపిణీ గత ఖరీఫ్‌లో పంట నష్టపోయిన 680 మండలాల్లోని 20 లక్షల మంది రైతులకు ప్రయోజనం
- పావలావడ్డీ క్రింద రైతులకు రూ. 73 కోట్లు పంపిణీ 9.6 లక్షల మంది రైతులకు లబ్ధి

### మహిళల కోసం...

- పావలావడ్డీ క్రింద మహిళా సంఘాలకు రూ.470 కోట్ల పంపిణీ
- రూ.274 కోట్లతో 'స్త్రీ శక్తి' భవనాల నిర్మాణం. ప్రతి మండలంలోనూ రూ. 25 లక్షలతో 'స్త్రీ శక్తి' భవన్
- రూ. 1000 కోట్లతో 'స్త్రీ నిధి' బ్యాంకుల ఏర్పాటు



| | మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A134 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshatha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |